


“ఉత్సవరంగం” : వాల్తేరులో ఆంధ్ర విశ్వవిద్యాలయం స్నాతకోత్సవ సభా భవనానికి 1963 జనవరి 3 వ తేదీన రాష్ట్రపతి పునాదిరాయి వేశారు.



ఆంధ్రప్రదేశ్ గవర్నరు, అనంతపురంలో 1962 డిశంబరు 26 న పారిశ్రామిక శిక్షణ సంస్థవద్ద ఎన్. సి. సి. పెరేడును తిలకించారు.

# విషయసూచిక


| | | | |
|---|---|---|---|
| ముఖ్యమంత్రి లేఖ | .... | | 3 |
| వెలుగు బాటలు | .... | కె. వి. భాస్కరరావు | 5 |
| అమృతమూర్తి | .... | దాశరథి | 6 |
| గ్రామీణ స్వచ్ఛంద దళాల త్రివిధ కార్యక్రమాలు | .... | యం. చెన్నారెడ్డి | 8 |
| జయపతాక | .... | గడియారము వేంకటశేషశాస్త్రి | 9 |
| అత్యావసర పరిస్థితి – యువకుల కర్తవ్యం | .... | పి. వి. నరసింహారావు | 11 |
| తెలుపు నలుపు | .... | కె. కృష్ణారావు | 14 |
| జాగృతి | .... | 'అమరేంద్ర' | 16 |
| ప్రతిఫలాకాంక్షలేని కార్యదీక్ష జీవిత విజయానికి శ్రీరామ రక్ష | .... | 'మహతీ శంకర్' | 17 |
| మంచుకొండపై జవాన్ | .... | పైడిపాటి సుబ్బరామశాస్త్రి | 19 |
| హిమాలయ యోధులు | .... | | 20 |
| ఈశాన్య సరిహద్దు-లధక్ ప్రాంతాలపై మన ఆధిపత్యం యీ నాటిదా ? | .... | సంపత్ | 25 |
| మీ సంపూర్ణ సహకారం కావాలి | .... | | 28 |
| దేశ రక్షణకై | .... | యం. వి. రావు | 31 |
| కమ్యూనిటీ రేడియోసెట్లు | .... | | 34 |
| చైనా తిరోగతి | .... | సి. వి. సుబ్బన్న | 35 |
| పారిశ్రామిక విశేషాలు | .... | | 37 |
| శాసన పరిశోధక శిఖామణి : శ్రీ సోమశేఖర శర్మ | .... | జి. వి. రామమూర్తి | 38 |
| పబ్లిక్ వర్క్సుశాఖ కార్యకలాపాలు | .... | | 41 |
| మన భారతదేశం | .... | జూలూరి హనుమంతరావు | 42 |
| ప్రశ్నోత్తరావళి | .... | | 48 |
| త్యాగానికి సమయమిదే ! | .... | ఉత్పల సత్యనారాయణాచార్య | 49 |
| సంగ్రహ ప్రకటనలు | .... | | 50 |
| ప్రగతిపథంలో | .... | | 52 |
| మహాకవి కాటూరి | .... | బాలాంత్రపు రజనీకాంతరావు | 54 |
| పంచాయతీ రాజ్య పురోగమనం | .... | | 56 |
| కొలంబో సమావేశం ప్రతిపాదనలు | .... | | 58 |
| బహుముఖ సేవానిరతుడు శ్రీ వీరేశలింగం | .... | తల్లాప్రగడ ప్రకాశరాయుడు | 63 |
| ప్రబోధము | .... | మెండా చినసీతారామయ్య | 67 |
| ముఖ్యవార్తలు | .... | | 68 |
| లేఖలు | .... | | 70 |
| గ్రంథ సమీక్ష | .... | | 71 |


ముఖ చిత్రం : హైదరాబాదు జిల్లా బౌరంపేటలో 1963 జనవరి 26 వ తేదీన గ్రామీణ స్వచ్ఛంద దళం పథకానికి ప్రారంభోత్సవం జరిగింది. ఆ సందర్భంలో ఉత్పత్తికి సంబంధించిన అనేక పనులను చేపట్టారు. కొందరు వాలంటీర్లు పీడల్లతో పనిచేస్తున్న దృశ్యం.

అట్ట వెనుక బొమ్మ : కోరుకొండ సైనిక పాఠశాల విద్యార్థులతో రాష్ట్రపతి గవర్నరు (10-12-62).


Edited & Published by the Director of Information and Public Relations, Andhra Pradesh, Hyderabad-1.
Printed at Yuva Press, Public Garden Road, Hyderabad.

# ముఖ్యమంత్రి లేఖ

ప్రియమైన చదువరీ!

భారతదేశంపై చైనీయులు దాడి జరిపిన ఫలితంగా ఏర్పడిన పరిస్థితిని గురించి క్రిందటి నెల నేను మీకు వ్రాసిన లేఖలో తెలిపాను. చైనీయుల ఈ సవాలును ఎదుర్కోడానికి మొత్తం మీద ప్రజలు చూపిన ధైర్య స్థైర్యాలు, ఉత్సాహోద్రేకాలు చాలా సంతృప్తికరంగా వున్నవి. అన్ని స్థాయిల లోనూ విభిన్న మార్గాలలో ప్రసరించిన ప్రజోత్సాహం మనకు సుస్పష్టంగా ద్రుగ్గోచర మవుతుంది.

ఆంధ్రప్రదేశ్, జాతీయ రక్షణనిధికి తగినంత మొత్తం సమకూర్చలేదని కొన్ని వర్గాలు అనుకోవడం జరిగింది. నేటి వరకు జాతీయ రక్షణనిధి కేంద్రం వద్దకు దాదాపు రూ. 32 కోట్లు లభించాయి. ఇందులో మనం ఇచ్చింది దాదాపు రూ. 1,57,00,000 (ఒక కోటి యాభైఏడు లక్షలు) ల రొక్కం, సుమారు 52,000 గ్రాముల బంగారం మాత్రమే. జాతీయ రక్షణ నిధికి రూ. 3½ కోట్లు సమర్పించడానికి మనం ఇప్పుడు నిశ్చయించుకున్నాం. మన రాష్ట్ర జనాభా దాదాపు మూడున్నరకోట్లు కాబట్టి రాష్ట్రంలోని ప్రతివ్యక్తి ఒకే ఒక రూపాయి వంతున ఇవ్వడంవల్ల సమకూరే మొత్తానికి ఇదిసమానం. మూడున్నర కోట్ల జనాభా, మూడున్నర కోట్ల రూపాయిల నిధి అనే ఈ సామ్యం మన నిధి సేకరణ లక్ష్యపు ప్రాతిపదికను మాత్రమే సూచిస్తుంది. అంతేకాని ప్రతి వ్యక్తీ ఒక రూపాయి ఇచ్చి తీరాలనీ, అంతకుమించి ఏమీ ఇవ్వ నవసరం లేదనీ దీని అర్థంకాదు. ధనికులు అధికంగానే విరాళాలిస్తారనీ, ఏమీ ఇవ్వలేని వర్గాలవారు కూడా మన సమాజంలో వున్నారనీ ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. ఎవరు ఎంత ఇచ్చారనే ప్రసక్తి లేకుండా ఒక కుటుంబం ఇచ్చినట్టుగా ఈ మొత్తాన్ని మనం సమకూర్చు కోవాలి. 1963 జనవరి 26 వ తేదీలోగా ఈ లక్ష్యాన్ని సాధించడానికి వీలుగా నేనూ, మంత్రి మండలిలోని నాసహచరులూ రాష్ట్రంలో విస్తృతంగా పర్యటించాం. ఇంకా పర్యటిస్తూవున్నాం. మీరు ఈ లేఖ చదివే నాటికి ఆ తేదీ గడిచి పోతుంది. ఈ లక్ష్యాన్ని సాధించగలమనే విశ్వాసం నాకువుంది. లక్ష్యం నెరవేరినంత మాత్రానే మనకృషి నిలిచిపోతుందనుకోరాదు. విరాళాలు ఇవ్వడం ఇలా సాగిపోవల్సిందే. ఇది మన తొలిలక్ష్యం మాత్రమే. సాధారణ వ్యక్తికి ఇది చాలా పెద్ద మొత్తమే అనిపిస్తుంది. కాని నేడు మనం నివసిస్తున్న ఈ విశాలమైన విశ్వం, మనం ఎదుర్కొంటున్న బృహత్తరమైన కార్యభారం దృష్ట్యా ఇది చాలా స్వల్పమొత్తం మాత్రమే. ఒకే ఒక జెట్ విమానం కొనడానికి మనకు కావలసిన దానికంటే ఈ మొత్తం కొద్దిగా మాత్రమే అధికమనే విషయం తెలిసినప్పుడు మీకు ఆశ్చర్యం కలగదూ? మన రక్షణకై విమాన దళాన్ని పటిష్ఠం చేయడానికి మనకు ఇటువంటి జెట్ విమానాలు ఎన్నోకావలసి వుంటాయి! కాగా మనకు ఎదురైన సవాలును ఎదుర్కోడానికి అవసరమైన రక్షణ బలగంలో విమానదళం కేవలం ఒక భాగం మాత్రమే. కనుక ఈ మొత్తం అధికమని ఎవ్వరూ భావించ కూడదు. ఇది సముద్రంలో కేవలం ఒక నీటిబిందువు వంటిదే. ఇతరులు కూడా ఇదే విధంగా విరాళా లిస్తారనీ, ఈ చిన్నచిన్న నీటి బిందువు లేకలిసి ఒకపెద్ద సాగరంగా రూపొంద గలదనే విశ్వాసంతో మనం ఈ మొత్తం సమర్పిస్తున్నాం. నేను గత డిసెంబరులో చేసిన విజ్ఞప్తిలో, నెలకు రు. 150/- ల కంటే తక్కువ వేతనం పొందే వారు ప్రతి నెలా సగం రోజు జీతం మొత్తాన్నీ, రూ. 150/- ల కంటే ఎక్కువ వేతనం పొందేవారు నెలనెలా ఒక రోజు జీతం మొత్తాన్నీ జాతీయ రక్షణనిధికి విరాళంగా ఇవ్వాలని సూచించాను. దేశంలో ఆత్యయిక పరిస్థితి వుండే వరకూ ఈ ప్రకారం విరాళాలివ్వడం కొనసాగాలి.

బంగారం విరాళంగా సమర్పించడానికీ, బంగారం బాండ్లకు పెట్టుబడి పెట్టడానికి కూడా మేము విజ్ఞప్తి చేశాం. కాని ఈ పథకానికి సరిగా ప్రోత్సాహం లభించలేదని తెలపడానికి నాకు విచారంగా వుంది. భారత దేశంలో చాలా ఎక్కువ బంగారం దొంగచాటుగా నిలువ వుందనే సంగతి సుప్రసిద్ధమే. మన దేశంలో బంగారంధర అంతర్జాతీయ మార్కెటు ధరకంటే దాదాపు రెండింతలు ఎక్కువవుండటానికి

---

ఈలేఖను ముఖ్యమంత్రి ప్రతినెలా 15వ తేదీన వ్రాస్తారు

ఇదే కారణం. బంగారంపట్ల మనకుగల మక్కువ, ముఖ్యంగా స్త్రీలకు దీనిమీదగల మోజు ఈ నాటిది కాదు. దేశంలో ఆర్థిక విధానం అభివృద్ధి జెందని నాటినుంచీ ఈ పరిస్థితి కొనసాగుతున్నది. ప్రజలు ఎప్పుడూ కూడా బంగారంపై ఆధారపడ గలిగారు. కనుకనే వ్యక్తిగత ఆస్తిపాస్తులకు ఇది సూచికగా కూడా రూపొందింది. కాని ఈ నాడు మనం ఈ పసుపుపచ్చ లోహం పట్ల మన దృక్పథాన్ని మార్చుకోవాలి. భారత ప్రభుత్వం బంగారం కంట్రోలు నియమావళిని ఈ వారంలో ప్రకటించింది. దీని ననుసరించి ఆభరణాలు తప్ప ఇతర రూపాలలో దాచిపెట్టుకున్న బంగారానికి సంబంధించిన వివరాలన్నింటినీ ప్రకటించవలసి వుంటుంది. కాబట్టి బంగారాన్ని నిలువచేసి దాచి వుంచడం జాతీయ విద్రోహకరమైన చర్య మాత్రమే కాకుండా, ఇప్పుడది ఆస్తిగా వుండే అవకాశం కూడా లేకుండా పోతున్నది. కనుక ఈ విధంగా నిలువ వున్న బంగారాన్ని స్వచ్ఛందంగా బంగారం బాండ్లకు పెట్టుబడి పెట్టడం సముచితం. ఇప్పటివరకు మనం పూర్తిగా యుద్ధానికి లోను కాలేదు. మళ్లీ పోరాటం ప్రజ్వరిల్లినట్లయితే దాని ప్రభావం మన దైనిక జీవితం పై పడటం ఖాయం. కనుక అప్పటివరకు వేచి వుండటం కన్న ఎట్టి పర్యవసానానికైనా మనం సిద్ధమై వుండటం అవసరం. అర్థశాస్త్రానికి దాని సూత్రాలు కొన్ని వున్నాయి. వాటి ప్రకారం, ఏ అభివృద్ధి జరగాలన్నా, అందుకు మూల్యం చెల్లించవలసి వుంటుంది. అవసరమైన పనులు స్వచ్ఛందంగా జరగనట్లయితే ఇతర విధానాలు అవలంబించవలసి వుంటుంది.

చైనీయులు శాంతి పేరిట చేసిన మోసపు ప్రతిపాదనలను గురించి ప్రజలకు భారీ ఎత్తున పంచిపెడుతున్న కరపత్రాలలో వివరించడం జరిగింది. మన ఉత్సాహం నిర్దిష్టంగా కార్యరూపం దాల్చడానికీ, శుష్కమైన నినాదాల ప్రాతిపదిక పైకాక దృఢసంకల్పంతో కార్యాచరణ జరగడానికీ వీలుగా సమాజంలోని ప్రతి వర్గం వారు కూడా ఈ పరిస్థితి యొక్క నిజానిజాలను గురించి తెలుసుకోవాలి.

నా పర్యటన సందర్భంలో, కొందరు రాజకీయ వాదులు విద్యార్థులలో చైనా అనుకూల ప్రచారం సాగిస్తున్నట్లు తెలుసుకొని బాధపడ్డాను. నిరంకుశ పరిపాలనసాగే దేశాలలో యువకులకుఇలాంటి దుర్బోధనలు జరగడాన్నిగురించి మనం చాలా చాలా విన్నాం. కాని మన దేశంలో ముఖ్యంగాఇలాంటి సమయంలో ఇది ముమ్మాటికీ క్షమార్హం కాని నేరం. విద్యార్థుల దేశభక్తి, క్రమశిక్షణలకు భంగం కలిగించడానికి ప్రయత్నించే దుష్ప్రచారకు లందరికీ, వారు ఎచ్చట వున్నప్పటికీ, వారు సాగించే ఇలాంటి సంఘ విద్రోహకరమైన చర్యలను ప్రభుత్వం చూస్తూ ఊరుకోదని హెచ్చరిక చేస్తున్నాను.

విద్యార్థులు జాతికి విలువైన సంపదలాంటి వారు. శక్తి, సామర్థ్యాలను ప్రసాదించే విజ్ఞానం, ప్రావీణ్యతలను ఆర్జించడానికి వారికి సమస్త అవకాశాలు కల్పించాలి. ఆధునిక శాస్త్ర విజ్ఞానం, టెక్నాలజీలలో అధ్యయనానికై వారికి సంపూర్ణమైన సౌకర్యాలు కలిగించాలి. విశాల దృక్పథంతో ఉన్నత విద్యాభ్యాసం చేయవలసిన తరుణ వయస్కులైన విద్యార్థులు సంకుచిత భావాలు, మూఢ విశ్వాసాల దుష్ప్రభావానికి గురికారాదు. మనరాష్ట్రంలో మూడవ స్టాండర్డునుంచే పిల్లలకు ఇంగ్లీషు బోధించడానికై నిశ్చయించడానికి ఇదే ముఖ్య కారణం. పిల్లలు ఉన్నత విద్యాభ్యాసానికి పూనుకునేప్పటికి ఈ భాషలో మంచి పరిజ్ఞానం కలిగి వున్నప్పుడు మాత్రమే దానికి వారు నిజంగా యోగ్యులు కాగలుగుతారు.

రక్షణ కృషికై ప్రజోత్సాహాన్ని సమీకరించడానికి ఉద్దేశించిన రెండు కొత్త పథకాలను ఈనెలలో ప్రవేశపెడుతున్నాం. ఆ పథకాలు ఇవి: గ్రామీణ స్వచ్ఛంద దళం, రక్షణ శ్రామిక బ్యాంకు. గ్రామాలలో వృధాగావున్న మనుష్య శక్తిని వినియోగించుకోడానికీ, సైనిక సర్వీసు మూల సూత్రాలలో ప్రజలకు శిక్షణ గరపడానికీ ఈ రెండు పథకాలు ఉద్దేశించ బడినాయి. ఇవి గ్రామీణ ప్రాంతాలలో స్వచ్ఛంద సేవలను వినియోగించుకోవడంతో పాటు గ్రామస్థులలో రక్షణపట్ల చైతన్యం కలిగిస్తాయి. రక్షణ కృషిలో మనం ఇంతగా నిమగ్నులమై వున్నప్పుడు ఇతర స్వల్ప విషయాలను గురించి ఆలోచించడం దుర్లభం. అయినప్పటికీ, మన దైనిక జీవితాన్ని, సుదీర్ఘమైన మన చరిత్రగతికి మధ్య మధ్య విఘాతాలు కలిగించినా మన జీవితపు మూలబంధంపై ఎట్టి ప్రభావం కనబరచ లేకపోయిన క్షణికమైన పీడకలలలో ఒకటిగా అతిత్వరలోనే చైనా దురాక్రమణ రూపొందగలదని ఆశిస్తూ సమధికోత్సాహంతో గడుపుకోవాలి. జైహింద్!

భవదీయుడు

నీలం సంజీవరెడ్డి




కె. వి. భాస్కరరావు

జాతీయ రక్షణనిధికి మనజిల్లాలు చేస్తున్న ప్రయత్నాలు మళ్ళీ జాతీయోద్యమపు రోజులను గుర్తుచేస్తున్నాయి. వ్యక్తి సంపద కన్న జాతీయ శ్రేయస్సే ముఖ్యమని ప్రజలు మరొకసారి నిరూపించారు. అందువల్లే ధన, కనక, వస్తు, వాహనాలను వారు రక్షణనిధికి స్వచ్ఛందంగా సమర్పిస్తున్నారు. రాష్ట్రంలోని ప్రతిజిల్లా తాము నిర్ణయించుకొన్న లక్ష్యాన్ని చేరేటందుకు చురుకుగాపనిచేస్తోంది. వరంగల్, మెదక్, తూర్పుగోదావరిమున్నగు జిల్లాలు తమలక్ష్యాన్ని మించి వసూళ్ళు చేశాయి. నిజామాబాదుజిల్లా మరోఅడుగు ముందుకువేసి ఇతర జిల్లాలకు మార్గదర్శి అయ్యింది.

నిజామాబాదుజిల్లా రక్షణనిధికి రు. 10 లక్షలు ఇవ్వాలని సంకల్పించింది. ఆ జిల్లా జనాభాకూడ సుమారు 10 లక్షలే. ఐతే ప్రజల ఉత్సాహం అవధులు దాటింది. రిపబ్లిక్ దినోత్సవానికిముందే ఆ జిల్లా 18 లక్షల ధనాన్ని 2395గ్రాముల బంగారాన్ని వసూలు చేసింది. మొత్తం 20 లక్షల ధనాన్ని వసూలు చేసిందన్నమాట. అంటే ఆశించిన దానికంటె రెట్టింపు రక్షణనిధికి విరాళంగా యిచ్చారు. సగటున ఆ జిల్లాలోని ప్రతివ్యక్తి రెండురూపాయలు యిచ్చిన ఘనతపొందారు. మాతృదేశ రక్షణపట్ల వారికిగల ఆదరాభిమానాలకు ఇదొక తార్కాణం.

రాష్ట్రంలోని చిన్నజిల్లాలలో నిజామాబాదు ఒకటి. ఈ జిల్లా వైశాల్యం 3,203 చ. మైళ్ళు. జనాభా 10,21,503. జిల్లాలో 6 తాలూకాలు వున్నాయి. రాష్ట్ర గవర్నరు శ్రీ శ్రీనగేష్ ఇటీవల ఈ జిల్లాలో రెండు రోజులు పర్యటన జరిపారు. సహజంగా రాష్ట్రాధినేత తమ ప్రాంతానికి వచ్చినపుడు ప్రజలు తమ కష్టాలను, అవసరాలను చెప్పుకోడం పరిపాటి. కాని నిజామాబాదుజిల్లా ప్రజలు ఆపని చెయ్యలేదు. తమ అవసరాలను వెనక్కినెట్టారు. జాతీయ అత్యవసరస్థితిలో తమధర్మాన్ని ప్రశంసనీయంగా నెరవేర్చారు. రెండురోజులలో జిల్లాలోని వివిధ ప్రాంతపు ప్రజలు రు. 7,89,022-00 ధనాన్ని, 1167 గ్రాముల బంగారాన్ని రక్షణనిధికిగాను గవర్నరుకు అందజేశారు. ప్రతిప్రాంతంలోను ప్రజలు స్వచ్ఛందంగా ఈ విరాళాలను యిచ్చారు. గ్రామస్థులు, పంచాయతీలు, పంచాయితీ సమితులు, పురపాలక సంఘాలు, తదితర సేవాసంస్థలు ఈ కృషిలో భాగస్వాములయ్యాయి. అంటే ప్రజలు తాము స్వయంగాను, ప్రజా ప్రతినిధుల ప్రోత్సాహం వల్లను ఈ నిధి సేకరణకు తోడ్పడ్డారని చెప్పవచ్చు. బాల బాలికలు, కార్మికులు సైతం ఈ రక్షణ కృషిలో పాల్గొనడం మరింత విశేషం. నవీపేట పంచాయతీ సమితిలోని మానిక్ భండార్ గ్రామంలో 7 ఏండ్లబాలిక తాను కొన్నినెలలుగా పొదుపుచేస్తున్న హుండీ డబ్బాను గవర్నరుకు సమర్పించింది. దీనిలోనిడబ్బు ఏంచేయమంటావమ్మా? అని ప్రశ్నిస్తే, "మా మాస్టారు అంతాచెప్పారు. ఈ డబ్బుతో మన సైనికులకు ఏంకావలిస్తే అదికొని ఇవ్వండి" అని తడుముకోకుండా జవాబు చెప్పిందాబాలిక. ఇక పోచంపాడు ప్రాజెక్టువద్ద పనిచేసే కార్మికుల ఉత్సాహం చెప్పనవసరంలేదు. తమ కార్మిక సంఘం తరపున రు. 1370-00 లు రక్షణనిధికిగాను గవర్నరుకు అందజేశారు. "తాతా మీరిచ్చేడబ్బు ఎందుకో తెలుసా?'' వూరుకోలేక అక్కడున్న వృద్ధకూలీని అడిగాను. వెంటనే చెప్పాడు. ''ఆ మాత్రం తెలియదాబాబూ! దేశమేలేకపోతే మా బతుకేముంది? ఉడతాభక్తిగా మాకుచేతనయ్యింది యిచ్చాం.'' దేశభక్తి ప్రతివ్యక్తిలోను ఎలా వేళ్ళుపాతుకొంటూందో అప్పుడర్థమైంది. అలాగే నిజాంసాగర్ వద్దవున్న జాలరులు జాతీయ రక్షణనిధికి రు. 116-00 లు ఇచ్చారు.

నిజామాబాదు జిల్లా ఇతర జిల్లాలకెలా ఆదర్శప్రాయమయ్యిందో, నిజాం చక్కెర ఫ్యాక్టరీ దేశంలోని ఇతర ఫ్యాక్టరీలకు అలా మార్గదర్శి అయ్యింది. ఆ ఫ్యాక్టరీ యజమానులు, కార్మికులు, చెరుకు పండించే రైతులు రక్షణనిధికిగాను మొత్తం రు. 10.67 లక్షలు విరాళంగా ఇచ్చారు. ఈ మొత్తంలో 7½ లక్షలవరకు ఫ్యాక్టరీకి సంబంధించిన 5 వేల కార్మికులు, 10 వేల మంది రైతులు ఇచ్చారు. దేశంలోని ఏ యితర చక్కెర ఫ్యాక్టరీ కూడ ఇంత మొత్తాన్ని రక్షణనిధికి ఇంతవరకు ఇవ్వలేదు. నిజంగా నిజామాబాదు ప్రజలు, ఫ్యాక్టరీ వారు అభినందనీయులే.

ధనం, బంగారం రూపంలో ప్రజలిస్తున్న విరాళాలకు గవర్నరు తమ హర్షాన్ని తెలియజేశారు. అంతేగాక ఆయన యువకులకు ప్రత్యేకంగా ఒక విజ్ఞప్తికూడ చేశారు. రక్షణ సైన్యాలలో విరివిగా చేరినట్లయితే మాతృదేశ రక్షణకు తోడ్పడటమే గాక, తమ జీవితాలను కూడా క్రమ శిక్షణతోను, ఉన్నతంగాను గడపడానికి వీలవుతుందని

(మిగతా 7వ పేజీలో)

# అమృతమూర్తి

దాశరథి

పాల సముద్రమే నడచి వచ్చినరీతి, హిమాచలాగ్ర శృం
గాలు కరాలుసాచి మనకై అరుదెంచిన భాతి, శాంతి స
త్యాలు మనుష్యరూపమును దాలిచి నేలకుడిగ్గినట్లు, గాం
ధీ లలితాత్ము డుజ్జ్వలమతిన్ భరతావనిపైన కాలిడెన్.

　　మృత్యువునైన గెల్వగలమేటి
　　　　బలాఢ్యుడు, వాని చేతిలో
　　సత్యమె మొక్కవోవనిని శాత
　　　　మహాయుధమై చెలంగెడిన్;
　　నిత్యుడటన్న నాతడె; అనిత్య
　　　　ధరాతలి త్యాగశక్తి సాం
　　గత్యముతో అనాదియు ననంతు
　　　　డమర్త్యుడజయ్యు డయ్యెడిన్

　　భయము ముక్కుమొగమ్ము పరికించి యెరుగని
　　　　　　విఖ్యాత వీరాధి వీరుడతడు,
　　స్వార్థ శబ్దమ్మున కర్థమ్ము తెలియని
　　　　　　రమ్య విజ్ఞాన వారాశి యతడు,
　　రాజసతామస సారభటి నోర్వగలేని
　　　　　　కీర్తిత సాత్వికమూర్తి యతడు,
　　రాగ భోగమ్ముల రంపాల పండ్లలో
　　　　　　అణగారి పోనట్టి త్యాగియతడు,
　　　ఉరగములలోని విషమునే విరిచివేయు
　　　మధుర దరహాస మండిత మనుజుడతడు,
　　　రాక్షసులవంటి మనుజుల కక్షజేరి
　　　దేవతాత్వమ్ము నదించు దేవుడతడు.

మంచికి మారుపేరయిన మానిసి! మా హృదయాలలోన ని
ర్మించితిమోయి నీ కొరకు మేలిమి బంగరు దేవళాలు; పూ
జింపగ ప్రేమ పుష్పములు చిత్తమునిండుగ తెచ్చినాముర!
వంచనగాదు, నిక్కమిది, భారతజాతికి తండ్రి వీవెరా!

　　నిను నిర్జించగనెంచి తానె మరణించెన్
　　　　దుష్టుడొక్కండు; మి
　　త్తినె నిర్జించిన నీవు మా హృదయ
　　　　ధాత్రిన్ దివ్య దీపంబవై,
　　ఇన రూపంబయి, పూర్ణచంద్ర
　　　　నిభమై, హేయాజ్ఞ తాంధ్యమ్మునం
　　తను పోద్రోలగనెంతు, వెంతటి
　　　　దయా దాక్షిణ్యముల్ రా! ప్రభూ!
　　కత్తిలేక దురాత్ము కుత్తుకల్ నరికెడి
　　　　నీ నేర్పులే వీరునికి లభించు?
　　ఉపవాస వహ్నిచే అపకారి గుండెల
　　　　బూదిసేయు టలన్య పురుషుతరమె?
　　తీయని యొకమాటచే యావదవనిని
　　　　చేపట్టుటెవ్వని చేతనగును?
　　గుడిసెలో కూర్చుండి గుడిలోని దేవుని
　　　　మహిమల మించుటే మనిషి వశము?
　　దుర్బలుడవయ్యు నెంతటి దోర్బలమ్ము!
　　పేదవైగూడ నెంతటి పెద్దతనము!
　　ముదుసలివెయయ్యు నెంతటి కదనపటిమ!
　　తాత వయ్యును మాకెల్ల నేతవోయి!
　　ఈశలు గలిగినవారే
　　ఓటమి నందిరిగదా మహోద్యమ మందున్!
　　ఓటమినే యెరుగని నీ
　　మాటలలో నున్నదెంత మహిమ! మహాత్మా!

నిప్పుల నుమిసెడి వారికి
కప్పురపున్ నవ్వులిచ్చి కరుణించెడి నీ
న్నెప్పుడు కీర్తించెద, మా
యప్పా! నినుగొల్వ మా యునఘము, మహాత్మా!

నీ వడుగుంచిన ధరపై
తీవెలు పూవులు చెలంగు, తేనియలూరున్.
దేవుడవో, జీవుడవో
నీ వెవ్వడవో యెరుంగనేర, మహాత్మా!

నినుగాంచిన మానవు కం
టెను ధన్యుండింక నెవ్వడీ విశ్వమున్?
కనులిక నెవ్వని మెచ్చును?
మనసున కింకెది రుచించు మహిని? మహాత్మా!

బుద్ధుడవో! సకల తప
స్సిద్ధుడవో! శంకరుడవొ! శ్రీ విష్ణువవో!
వృద్ధుడవో! యువకుడవో!
సిద్ధాంతింపంగ నీకె చెల్లు; మహాత్మా!

చంద్రుడవై మాగుండెల
సంద్రము పొంగింతు వోయి చల్లని జ్యోత్స్నన్;
ఇంద్రుడవై మా పొలముల
సాంద్రాబ్దములంపి కురియ జాలు మహాత్మా!

కులములతో, మతములతో
కలుషము కాబోని మనసుగలవాడా! దో
ర్బలమును మెచ్చవులే ధీ
బల సంపన్నుడవు, దీనబంధు! మహాత్మా!

పసివాడవు నీవే లే;
ముసి ముసి నవ్వొలికి దుష్ట పురుషుల మదిలో
విసము విరుగ గొట్టెద, వా
కసమున శశివై చెలంగగలవు, మహాత్మా!

# వెలుగు బాటలు

(5వ పేజీ తరువాయి)

శ్రీనగేష్ తెలియ జేశారు. శాస్త్ర విజ్ఞానం పెంపొందిన ఈ రోజులలో కేవలం యుద్ధ భూమిలోనే ప్రాణహాని కల్గుతుందనేది సత్య దూరమని కూడ ఆయన అన్నారు. వారు చెప్పినట్లు యువకుల శక్తి, సామర్థ్యాల వినియోగానికి తగిన తరుణమిది.

ఏ దేశపు శక్తి, సామర్థ్యాలైనా చివరకు ఆ దేశపు మానవ సంపద మీదనే ఆధారపడి వుంటాయి. స్వాతంత్ర్యానంతరం ఇతర సంపదలతో పాటు మన దేశంలోని మానవ సంపదను సాంఘిక, ఆర్థికాభివృద్ధికి వినియోగిస్తూ వచ్చాం. చైనా వారి దురాక్రమణవల్ల దేశంలోని ప్రతి వ్యక్తి దేశరక్షణకు కూడ తగు విధంగా తర్ఫీదు కావాలని అనుభవమయ్యింది. అంటే యుద్ధభూమిలోనే గాక, పంటభూమి, కర్మాగారం, కార్యాలయం ఎక్కడ పనిచేస్తున్నా ఒక విధంగా మన మీనాడు సైనికులమే. ఒక ప్రక్క చైనావారి దురాక్రమణ పైన, మరో ప్రక్క దారిద్రం, అజ్ఞానం, అనారోగ్యాల పైన సవ్యసాచిలా మనం పోరాడవలసిన సమయమిది.

రక్షణ కృషికి తోడ్పడేటందుకు గాను భారత ప్రభుత్వం, గ్రామీణ స్వచ్ఛంద సేవా దళాలు, రక్షణ శ్రమబ్యాంకు పథకాలను దేశమంతటా రిపబ్లిక్ దినోత్సవంనాడు ప్రవేశపెట్టింది. గ్రామస్థాయినుండి అన్ని దశలలోను ఈ కార్యక్రమాలు పంచాయతీ రాజ్ సంస్థల సమన్వయంతో అమలు జరుపబడతాయి. ఆ గ్రామాలలోని శరీర దారుఢ్యంగల వయోజనులంతా వీటిలో చేరి గ్రామరక్షణ, వ్యవసాయోత్పత్తి, పారిశుద్ధ్యం, పండ్లు, కాయగూరల పెంపకం మొదలైన ఉత్పత్తి కార్యక్రమాలకు తోడ్పడవచ్చు. సభ్యులకు తగిన శిక్షణ ఇవ్వబడుతుంది. రక్షణ శ్రమబ్యాంకు పథకంలో గ్రామస్థులు నెలలో కనీసం ఒక రోజైనా ఉచితంగా శ్రమగాని అందుకు తగిన ధనంగాని దానం చేస్తారు. గ్రామాభివృద్ధికి కావలసిన శ్రమ నంతటినీ ఈ బ్యాంకులనుండి పొందుతారు.

పంచాయతీరాజ్ విధానం దేశంలో ఒకే రకమైన పరిపాలనా విధానాన్ని తేవడం ద్వారా జాతీయ సమైక్యతకు తోడ్పడింది. రక్షణ కృషికి ప్రవేశపెట్టిన ఈ కార్యక్రమాలు కూడా ప్రజలను మరింత సన్నిహితం చేసి వారిలో నూతనోత్తేజాన్ని కల్పించగలవు. ఈ నాడు జాతీయ రక్షణకు ధన, వస్తురూపంలోనే గాక శారీరకంగా కూడ సహాయపడడానికి మనకు మంచి అవకాశమిది.

# గ్రామీణ స్వచ్ఛందదళాల త్రివిధకార్యక్రమాలు

యం. చెన్నారెడ్డి

*రక్షణ కార్యాక్రమాలను సమర్థవంతంగా అమలు పరచడానికి జాతీయవనరులనూ, మానవశక్తినీ, రెండింటినీ సమాయత్తం చేయాల్సిన అవసరం నేడు ఎంతో ఉంది. రిపబ్లిక్ దే నాడు ప్రారంభించబడిన విప్లవాత్మకమైన గ్రామీణ స్వచ్ఛందదళం, రక్షణ శ్రామిక బ్యాంకు పథకం ద్వారా యీ లక్ష్యాన్ని మనం సాధించదలిచాం.*

చైనా దురాక్రమణవల్ల ఏర్పడిన విషమ పరిస్థితిని ప్రతి భారతీయుడు గుర్తిస్తాడు. చైనా తమంత తామే నేఫా ప్రాంతం నుండి ఉపసంహరించుకొన్న కారణంగా మనం అక్కడ సివిల్ పరిపాలనను తిరిగి నెలకొల్పినా, లథక్ ప్రాంతంలోని చాలా భూభాగాలు చైనావారి ఆక్రమణలోనే ఉన్నాయి. తలవని తలంపుగా మనపై దాడి జరగటంవల్ల, ఇకమీదట జాగరూకతగా ఉండడం అవసరం.

యీ అప్రమత్తత ముఖ్యంగా సైనిక వ్యవహారమే అయినా వ్యవసాయం, పరిశ్రమలలో ఉత్పత్తిని అధికంచేయడంద్వారా దీనిని మరింత పటిష్ఠం చేయాలి. సాధారణ పరిస్థితులలోకూడా పెరిగే జనాభా అవసరాలను ఆదుకోవడానికి అధికోత్పత్తి యెంతో అవసరం. యీ దృష్ట్యా క్రొత్త అవసరాలను తీర్చడానికి అధికోత్పత్తి విషయమై నొక్కి చెప్పాల్సిన అవసరంలేదు. అందువల్ల రక్షణ చర్యలను అమలు జరపడానికి ఆర్థికవనరులను, మానవశక్తిని సమీకరించడం నేడు ఎంతో అవసం.

దీనికి గ్రామీణ ప్రాంతాలలో పంచాయతీ రాజ్, సమాజాభివృద్ధి సంస్థలు యెంతో ఉపయోగకారిగా ఉంటాయి. గ్రామీణ ప్రాంతాలలోని ఆర్థిక వనరులను, మానవ శక్తిని సమీకరించడానికి, గ్రామీణ స్వచ్ఛంద దళం, రక్షణ శ్రామిక బ్యాంకు పథకాన్ని భారత ప్రభుత్వం రూపొందించింది.

## త్రివిధ కార్యక్రమాలు

గ్రామీణ స్వచ్ఛంద దళానికి త్రివిధ కార్యక్రమాలు ఈ విధంగా ఉన్నాయి: ఉత్పత్తి, జనబాహుళ్యానికి విద్య, గ్రామ రక్షణ. జాతీయ రక్షణకు ప్రథమంగా పటిష్ఠమయిన వ్యవసాయ ప్రాతిపదిక ఉండడం యెంతో అవసరం. దేశరక్షణ కార్యక్రమంలో వేలకొలది మన కర్షకులు పాల్గొనడానికి వీలుగా ప్రతి గ్రామములోనూ గ్రామ ఉత్పత్తి ప్రణాళికలద్వారా అధికోత్పత్తిని సాధించడానికి దేశం మొత్తంమీద తీవ్రంగా కృషి జరపడం యీ కార్యక్రమం ముఖ్యోద్దేశం.

పంచాయితీభూముల అభివృద్ధి, కంపోస్టు, కూరగాయలు, ఫలాల ఉత్పత్తి, వంట చెరకు చెట్ల పెంపకం, గ్రామ చెరువులలో చేపల పెంపకం, ఇతర గ్రామీణ పనుల వంటి స్థానిక సామాజిక ఆస్తులను అభివృద్ధి చేయడంద్వారా గ్రామీణ స్వచ్ఛంద దళం అధికోత్పత్తికి కృషి చేయాల్సి ఉంది.

వ్యవసాయ ఉత్పత్తులను అధికం చేయడానికై భూసార సంరక్షణ, చిన్నతరహా నీటివనరులు, ప్రస్తుతం ఉన్న నీటిపారుదల వనరులను అభివృద్ధి చేయడంవంటి ప్రత్యేక కార్యక్రమాలనుకూడా చేపట్టాలి. గ్రామీణ సహకార సంఘాలను అభివృద్ధి చేయడానికీ, సభ్యుల సంఖ్యను పెంచడానికీ, మార్కెటింగ్ సౌకర్యాలను పెంపొందించడానికీ గ్రామీణ స్వచ్ఛంద దళం సభ్యులు కృషిచేస్తారు.

## జనబాహుళ్యానికి విద్య

పుకార్లను నిరోధించడానికి, ప్రజానీకంలో ధైర్య స్థైర్యాలను కలిగించడానికి వీలుగా గ్రామీణ స్వచ్ఛంద దళం సభ్యులు సరిఅయిన సమాచారాన్ని సేకరించి వివిధ ప్రచార సాధనాల ద్వారా ప్రజలలో ప్రచారం చేయాలి. అంతేగాక ప్రథమ చికిత్స కమ్యూనికేషను లైన్ల సంరక్షణ, వాచ్, వార్డు అగ్ని ప్రమాదాల నిరోధన మొదలైన విధులను కూడా వీరు నిర్వహించాలి.

యువజన క్లబ్, మహిళా మండలి యీ దళానికి ముఖ్యమైనవి. మహిళా మండలిలో ఒక విభాగాన్ని ఏర్పాటు చేస్తారు. పొదుపు, కుట్టుపని, సర్వీసు సహకార సంఘాలకు తోడ్పడడం, వినియోగ వస్తువుల పంపిణీ మొదలయిన వాటికై సరస ధరల దుకాణాలకు సహాయపడడం వంటి ప్రత్యేక, కార్యక్రమాలు యీ విభాగం నిర్వహిస్తుంది.

(మిగతా 60 వ పేజీలో)

# జయపతాక

గడియారము వేంకటశేషశాస్త్రి

అరెరే! యెంతటి మోస మెంచిరిపు
డున్నట్లుండి చైనీయ ము
ష్కరు లీ భారత భూ స్వతంత్రతకు!
నేస్తంబాడి నమ్మించుచున్
గుటిగా వెన్నున బాకుపోటటు
ఫిరంగుల్ ప్రేల్చు సైన్యాలతో
సరిహద్దుంగడ నాక్రమించిరి
దురాశా ధూతదుర్భావులై ॥

మోస మదొక్కటా! ప్రతిన
పూనిన యచ్చపుఁ 'బంచశీల'కు
ద్వాసనచెప్పి, బుద్ధుని మతంబున
కెగ్గొనరించి, స్నేహావి
శ్వాసము లగ్గిఁబెట్టిన కసాయులు
నేఁడిటు వచ్చినారు చై
నా సరదార్లు ధర్మపరిణద్ధము
భారతమున్ జయింపఁగన్ ॥

శాంత్యహింసాత్మ ధీ ధర్మ సత్యబలము
సాధనముగాఁగ స్వాతంత్ర్య సమర జయము
గొన్న మనపైకవే తుపాకులు ఫిరంగు
లెత్తుకొనివచ్చి; రెట్లు జయింపఁగలరో! ॥

అయత విక్రమక్రమ
నిరంకుశ వీర విహారులైన రా
మాయణ భారతస్తుత
మహారథులన్ గనినట్టి భారత
శ్రీ యిపుడేమి కాన్పుడిగి
చేవ దొరంగెనె? నేఁడులేరె చై
నీయుల కుత్తుకల్ దఱిగి
నెత్తురు లానెడు వీరసింహముల్ ॥

ఉన్నారిప్పుడుఁగూడ నాఁటి
యభిమన్యుల్ బాలచంద్రోపముల్
కన్నయ్యల్ రణతిక్కనల్;
కలరు ఘూర్ఖాలున్ మరాటాలు సం
పన్నక్షాత్రులు రాజపుత్ర
మలబార్ పంజాబు సింహంబు; లీ
యన్నల్ దమ్ములు చుట్టుముట్టి
రిపుసైన్యశ్రేణి చెండాడరే! ॥

భారత భూ ప్రతిష్ఠ నిలుపన్
బురుషోపమ ధీరమూర్తులై
పోరిన వీరమాత లభిభూత
సపత్నలు వీరపత్నులు
న్నారిటఁ గార్య ఖడ్గ నిపుణల్
తొలినాఁడును నేఁడుగూడఁ, ద
ద్వీర విహారముల్ తుడిచి
పెట్టవెముట్టిన శత్రుసేనలన్ ॥

వీర క్షేత్రము, వేదశాస్త్ర విలస
ద్విజ్ఞాన విద్యా కళా
ధార క్షేత్రము — భారతంబు—
హిమవద్గంగాదిక క్షేత్ర తీ

ర్ధారామస్తుత పుణ్యభూమి
ఋషిదేవా వాస; మిచ్చోట చై
నా రక్షో రణభేరి మ్రోగిన
నకాండ క్షోభ ముప్పొంగదే!॥

ఈ పరిస్థితిరాదు — రానీయకుండఁ
జూచుచున్నాఁడు శివుడు త్రిశూలధారి
శీతనగముపైఁ గైలాసశిఖర మెక్కి
ప్రమథ గణముతో నిజధర్మ పత్నితోడ॥

చేతఃప్రీతిఁ బ్రపంచరాజ్య
పతులున్ జేదోడుగా భారత
స్వాతంత్ర్యంబును శాంతి సౌఖ్యముఁ
బ్రజాస్వామ్యంబు రక్షింపఁజే
సేతన్ సైనిక శస్త్ర సాధన ధనశ్రీ
యిచ్చుచున్నారు; చై
నా తంత్రంబులు సాగనీకిపుడు
సన్నాహంబు సంధింపుఁడీ!॥

"ఆయతమైన ధర్మబల మండగ
నున్నది, దేశదేశముల్
సాయము చేయుచున్న" వని
జాగొనరింపఁగ రానిదిప్డు చై
నీయుల తోడి యుద్ధ; మవి నీతియు
వంచన యస్త్ర శస్త్ర సై
న్యాయతిఁగూర్చి పేర్చు నభియాతి
యలంతుల వీగిపోవునే?॥

ఐనన్, భారతజాతి యేకమయి
సర్వాయత్తతన్ నిల్చి, నె
హ్రూ నేతృత్వముక్రింద జాతి
మత వైరుధ్యాదులన్ వీడి, గాం
ధీ నిర్ణీత పథంబునన్ జయము
సాధింపంగ మున్దూకుచో

చైనాదాడి మరల్చుటెంత
భరత స్వాతంత్ర్య యోధాళికిన్॥

రణముగాదు — ప్రజాస్వామ్య రాజసూయ
యజ్ఞమిది — సాగుచున్న దత్యంత దీక్ష!
ధన కనక శస్త్ర వస్తు వాహనము లెల్లఁ
దెచ్చి యర్పింపుఁడో భారతీయులార!॥

రాష్ట్రపతి కృష్ణుఁ, డిందు సర్వప్రధాని
విజయుఁడే యెందు, రక్షణవిధికి చ్యవనుఁ
డల మహారాష్ట్ర వీరాపరావతార;
మగుట ధర్మమే గెల్చు; జయంబు మనదె!॥

హిమగిరియన్న లోకజనయిత్రికి
దుర్గకుఁ బుట్టినిల్లు; త
ద్విమల ఝరీ దరీ విపిన వీధి
విహారము లామెకింపు; ర
మ్యము లవియెల్ల నేఁడు రిపు
మర్దితముల్ శవరక్త మాంస దూ
ష్యము లగు దృశ్య మామె
హృదయంబున నగ్గిరగుల్చ కుండునే!॥

కోయని హుంకరించి యదిగో
రణదుర్గ కరంబునన్ ద్రిశూ
లాయుధమెత్తి, మున్ను
మహిషాసుర శుంభ నిశుంభముఖ్య దై
తేయులఁబోలె నిప్పుడు వధించుచు
నున్నది మూగియున్న చై
నీయుల; నింక భారతము
నిర్గత శాత్రవమై వెలింగెడిన్!॥

కనుక నంతిమ విజయమ్ము మనది నిజము
దైవ బలముతో మనకుండె ధర్మబలము
ప్రబల జాతీయతా ప్రజాబలముఁ బెంచి
శాత్రవులఁదోలి యెత్తుఁడీ జయపతాక!॥ ★

# అత్యవసర పరిస్థితి:
# యువకుల కర్తవ్యం

పి. వి. నరసింహారావు

మన దేశం శాంతికాముక దేశం. మన జాతి ఎన్నడూ ఒకరితో కయ్యానికి కాలు దువ్వలేదు. మరొక దేశంపైన దాడి చేయలేదు. ఒకరి భూభాగంపైన కన్ను వేయలేదు. విశ్వ మానవ సౌభ్రాతృత్వానికీ, శాంతియుత సహజీవనానికీ మనమే బాటలు వేశాం. ఎంత విషమ సమస్యనైనా సరే, సామరస్యం ద్వారా పరిష్కరించవచ్చునని విశ్వసించాం. ఆ విశ్వాసాన్ని పురస్కరించుకొని అనేక సమస్యల పరిష్కారంలో సముచిత పాత్ర నిర్వహిస్తూవచ్చాం. ఇదే మన సిద్ధాంతం. ఇదే మన విధానం – ఇదే మన సాంప్రదాయం.

కాని కాలం తారుమారైంది. శాంతి కాముకత్వ మంటే బలహీనత అనీ, సామరస్య ప్రవృత్తి అంటే చేతగాని తనమనీ, సహజీవన విధానమంటే నిష్క్రియత్వమనీ – మన పొరుగు దేశమైన చైనా పాలకులు అపార్థం చేసుకున్నారు. అవసరమున్నా లేకున్నా యుద్ధానికే అలవాటు పడ్డవారైనందున శత్రుదేశమేదీ అనువుగా కనపడలేదని మిత్రదేశం పైననే తన బల మదాలను ప్రదర్శించబూనారు. ప్రపంచ చరిత్రలో ఇటీవల ఎన్నడూ కనివినని అమానుషత్వం, శరత్వం, సామ్రాజ్యకాంక్ష, వారివేనన్న శాశ్వత దుష్కీర్తిని సాధించుకున్నారు.

ఐతే చైనా సేనల ఆకస్మిక దురాక్రమణకు భారతదేశం మరింత కాకలు తీరిందే కాని చలించలేదు. ఛిన్నాభిన్నం కాలేదు. దేశ చరిత్రలో ఎన్నడూలేని ఉత్సాహం, ఐక్యభావం, నవ చైతన్యం చైనా దండయాత్ర ఫలితంగా వెల్లి విరిశాయి. ఈ నవ చైతన్యాన్ని సంఘటిత పరచడమే నేడు మన ప్రథమ కర్తవ్యం.

ఏ ఉద్యమమైనా యువజనుల ఉత్సాహంతోను, అనుభవజ్ఞుల సలహా సంప్రదింపులతోను, ముందుకు సాగుతుంటుంది. కావున నేటి దురాక్రమణను ప్రతిఘటించే కార్యక్రమం కూడా ప్రజా ఉద్యమ స్వరూపం తాల్చవలెనంటే యువకులే దానికి వెన్నెముకగా నిలువక తప్పదు.

దేశ రక్షణ కార్యక్రమంలో యువకులేం చేయాలో చెప్పాలంటే, ఇంతవరకు యువకులేం చేస్తూ వచ్చారో క్లుప్తంగా సమీక్షించడం అసంగతం కాదనుకుంటాను. స్వాతంత్ర్యాన్ని ఒకసారి సాధించామంటే చాలు, అది ఎల్లకాలం సుస్థిరంగా తనంత తానే ఉంటుందన్న భావం మన దేశంలో కనీసం పరోక్షంగానైనా ప్రబలిందని అంగీకరించాలి. స్వాతంత్ర్య సముపార్జన సందర్భంలో అశేష త్యాగాలు చేసి అచంచల దీక్షను ప్రదర్శించిన దేశ సేవకులెందరెందరో రంగం నుంచి రాలిపోవడమో, తప్పుకోవడమో జరిగింది. నేటి యువకుల్లో చాల మంది స్వతంత్ర వాతావరణంలోనే జన్మించిన వారు, బుద్ధి తెలిసినవారు, స్వాతంత్ర్య ఫలితాలకై పరస్పరం పోటీలు పడుతున్న సందర్భంలోనే వారి చైతన్యం ప్రారంభమైంది. వారు మల్లెపూలలా కనిపించే బియ్యాన్ని మాత్రమే చూచారు – కాని ఎన్నిసార్లు దున్నితే ఎన్ని నెలలు కష్టపడితే, ఏన్ని వడగండ్లను సహిస్తే, ఎన్ని కొడవళ్ళతో కోస్తే చివరకెన్ని రోకండ్లతో దంచితే ఆ బియ్యం తయారయ్యాయో తెలుసుకుంటేనే కాని బియ్యం విలువ తెలియదు. కావున భారత స్వాతంత్ర్య సమర చరిత్రను సమగ్రంగా తెలుసుకొని కేవలం మేధాపరంగానే కాక భావనాత్మకంగా ఆ నాటి త్యాగపూరిత వాతావరణంతో తాదాత్మ్యం పొందడం నేటి యువకుల ప్రథమ కర్తవ్యమై యున్నది.

ఒక దేశం యొక్క విదేశాంగ విధానం, ఆ దేశపు ఆంతరంగిక విధానాన్నే ప్రతిబింబిస్తూ ఉంటుంది. అలాగే ఉండాలి. అలాంటప్పుడు గత పదిహేనేళ్ళలో మన విదేశాంగ, ఆంతరంగిక విధానాల్లో బింబ ప్రతిబింబ భావ మెంతవరకు కనిపించింది? ప్రపంచ దేశాలన్నింటికీ శాంతి పాఠాలు చెప్పి మనం చిల్లర మల్లర ఆంతరంగిక వ్యవహారాల్లో అశాంతి మార్గాల నవలంబించ కూడదు. విశ్వమానవ సమైక్యతను, సమానత్వాన్ని ఉద్బోధించిన మనం, అడుగడుగునా కుల మత, వర్గ వ్యక్తి ద్వేషాలకు అవకాశ మివ్వకూడదు. సర్వ సంగ పరిత్యాగానికి పెట్టింది పేరుగా నిలిచిన మనం క్షుద్రస్వార్థ వికారాలకు లొంగిపోరాదు. మరి ఈ కారణాలవల్లనే మన శాంతి కాముకత్వాన్నీ, సామరస్య ప్రవృత్తినీ, సహజీవన విధానాన్నీ, పునాది లేనివిగా అపార్థం చేసుకోవడం జరిగిందో ఏమో మనం సూక్ష్మంగా పరిశీలించి ఆత్మ పరీక్ష చేసుకోవాలి. స్వాభావికంగా ఆదర్శప్రియులైన యువజనులు దేశంలో అక్కడక్కడ పొడచూపిన లక్ష్య చ్యుతిని, ధ్యేయంపట్ల ఉదాసీనతను మరొక సారి తుదముట్టించవలసి ఉంటుంది. ఒకరి ననుకరించడంకన్న తామే మౌలికంగా ఆలోచించే విధాన మవలంబించడం మంచిది. కొన్ని వ్యవహారాల్లో పెద్దల విధానాలు ధ్యేయానురూపంగా లేనప్పుడు వారి ననుకరించడమే శ్రేయస్కరమౌతుంది.

ఈవిధంగా ధ్యేయ పునఃస్థాపన నేటి యువకుల పరమ కర్తవ్యమై యున్నది. దీనివల్లనే జాతియొక్క మోరల్ ఉన్నత స్థాయి నందుకుంటుంది. సైన్యానికి ఆయుధాలెంతో జాతికి చైతన్యమంత. ఒకవైపు యుద్ధం జరుగుతుంటే మన ప్రభుత్వ వార్తలను మనమే నమ్మకపోవడం, రకరకాల కింవదంతులను సృష్టించడం, వ్యాప్తం చేయడం, ఉదాసీనత కలిగించడం భయోత్పాతాలు పుట్టించడం — ఇలాంటి చర్యలు ఆలోచితంగానూ, అనాలోచితంగానూ, జరుగకుండా యువకులు తగు శ్రద్ధ తీసుకోవలసి ఉంటుంది.

చైతన్యంతోపాటు సన్నద్ధత అవసరం. మన జాతి శారీరకంగా పటిష్ఠం కావలసి ఉంటుంది. శరీర వ్యాయామం, క్రీడారంగం పౌరరక్షణ కార్యక్రమం, సైనిక శిక్షణ — ఇవన్నీ జాతి సన్నద్ధతలో వేర్వేరు మెట్లు, కోట్లాది యువకులు ఈ కార్యక్రమాల్లో పాల్గొనవలసి ఉంటుంది. ప్రతి యువకుడొక సైనికుడుగా తయారు కావలసి ఉంటుంది. గ్రామ గ్రామంలో క్రమశిక్షణకు సంబంధించిన అనేక కార్యక్రమాలు రూపొందించవలసి ఉంటుంది. వ్యవసాయరంగంలో కాని, పారిశ్రామికరంగంలో కాని, మరే రంగంలో కాని ఇంక అలసత్వానికి ఆస్కారంలేదు. అన్ని కార్యక్రమాలు యుద్ధస్థాయిలోనే నడువవలసి ఉంటుంది. గ్రామాల్లో స్వయం సేవక దళాలు, రక్షణ శ్రామిక శిబిరాలు పెద్ద ఎత్తున ప్రారంభించే కార్యక్రమం రూపొందించబడుతోంది. యీ కార్యక్రమాలన్నింటిలో యువజనులదే ప్రముఖ పాత్ర ఉంటుందని వేరే చెప్పనవసరంలేదు. ఇకమీద గ్రామాల్లో కక్షలకు, అభిప్రాయ భేదాలకు, కలహాలకు, ప్రస్తుత అత్యవసర పరిస్థితి ముగిసేవరకైనా స్వస్తి చెప్పవలసి ఉంటుంది. సమైక్య వాతావరణం కల్పించడంలో యువకులు కృషిచేస్తేనే కక్షలు సమసిపోగలవు.

ప్రస్తుత యుద్ధవిరమణవల్ల ప్రజల ఉత్సాహం సన్నగిల్లకుండా ప్రత్యేక కృషి చేయవలసి ఉంటుంది.

రక్షణ సన్నాహాలు మునుపటివలెనే సాగించడం అవసరం. ఇది అనుకున్నంత సులభంకాదు. యుద్ధ మనస్తత్వంలేని భారత ప్రజలు యుద్ధవిరమణ జరిగిందని తమ ఉద్రేకాన్ని సడలనిచ్చే ప్రమాదం లేక పోలేదు. ప్రజల్లో త్యాగబుద్ధిని ఉత్తేజపరచి, రక్షణ కృషిలో తాను భాగస్వామి అనే చైతన్యం ప్రతి వ్యక్తిలో ఉద్భవిస్తేనేతప్ప జాతి ఉత్సాహం నిలుపడం సాధ్యంకాదు. కావున జాతి ఉత్సాహాన్ని నిలుపుకునే బాధ్యత కూడా సహజంగా ఉత్సాహవంతులైన యువజనులే వహించవలసి ఉంటుంది. ఎవరే రంగంలో పనిచేస్తున్నా ఇదివరకన్న అధికంగానూ, సమర్థవంతంగానూ పని చేయడమే దేశరక్షణ కృషికి తాను చేస్తున్న సహాయమని గుర్తించే వాతావరణం సృష్టించాలి.

విద్యార్థుల్లో నేడు విశేష చైతన్యం కానవస్తున్నది. ఇది అత్యంత ముదావహం. యన్. సి. సి. కార్యక్రమం ఇదివరకన్న పెద్ద యెత్తున సాగించాలనే నిర్ణయం జరిగింది. తదనుగుణ్యంగా విద్యార్థి లోకమంతా మనస్ఫూర్తిగా సహకరించవలసి ఉంటుంది. ఇదివరలో అక్కడక్కడ కానవచ్చిన క్రమశిక్షణ రాహిత్యం ఇంతటితో శాశ్వతంగా సమసిపోవాలి. యువజనుల కర్తవ్యాలన్నింటితోబాటు విద్యార్థుల ప్రత్యేక కర్తవ్యాలు కూడ గుర్తించబడాలి. నేటి అత్యవసర పరిస్థితి అంటే దేశసామర్థ్య పరీక్ష అనీ, ఆ పరీక్ష ఒక్క యుద్ధరంగంలో మాత్రమేకాక సమస్త రంగాలలో జరుగుతోందనీ, తెలుసుకోవాలి. నేటి శాస్త్రవిజ్ఞానం ఉద్యోగ సముపార్జనకో, లేక ప్రయోగ శాలకో, కాక దేశ సంరక్షణకై ఉద్దేశింపబడునట్టు పునర్వ్యవస్థీకరణ జరగాలి. యీ నూతన వ్యవస్థదృష్ట్యా విద్యార్థుల దృక్కోణం ఎంతో మారవలసి ఉంటుంది.

అలసత్వం, నిష్క్రియత్వం పోవాలంటే ఎవరంతట వారు తమకేది తోచితే అది చేయడమని తాత్పర్యంకాదు. యువశక్తి ఎంత గొప్పదైనా అపరిమితం కాదు. కావున ఆ పరిమితశక్తిని పొదుపుగాను, ప్రభావోత్పాదకంగాను, అత్యంతోపయుక్తంగాను వినియోగించవలసి ఉంటుంది. దేశరక్షణ కార్యక్రమమంటే చదువు ఇష్టంలేని విద్యార్థుల ఉబుసుపోకకు ఒక అవకాశమని మాత్రం భావించవద్దు. కాబట్టి విద్యార్థుల కార్యక్రమాలు ముఖ్యంగా మేధా రంగంలోను, శారీరకరంగంలోను రూపొందించడం సమంజసమవుతుంది. శ్రద్ధతో పని చేయదలిస్తే ఇతర రంగాల జోలికిపోకుండా పై రెండు రంగాలలోనే విద్యార్థులందరికీ తలకు మించిన కార్యభారం లభ్యమవుతుందనడంలో సందేహంలేదు.

చైనా, ఇండియా సరిహద్దు తగాదాలోని వాస్తవ అంశాలు ప్రజాసామాన్యానికి తెలియపరచడంలో, విద్యార్థులు, విద్యావంతులైన యువకులు, ఎంతో పని చేయవలసి ఉంటుంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కావలసిన సాహిత్యాన్ని ప్రచురిస్తున్నాయి. ఆ సాహిత్యాన్ని చదివి అందులోని ముఖ్యాంశాలను చర్చించడం, తత్సంబంధమైన ఇతర పరిశోధనలు జరుపడం, అధ్యయన శిబిరాలు ఏర్పాటు చేయడం, — యీ పనంతా విద్యార్థి సంఘాలు, యువజన సంఘాలుచేస్తే బాగుంటుంది. ఇది వాళ్ళకు సాధ్యమైనట్లు మరెవ్వరికీ కాదు.

యువజనులు తక్షణ కర్తవ్యాలకు సంబంధించిన కొన్ని ముఖ్యాంశాలను మాత్రమే పేర్కొనడం సాధ్యమవుతుంది. మిగతా వివరాలన్నీ ఎవ్వరి వారి సమయస్ఫూర్తికి వదిలివేయడమే సమంజసమవుతుంది. మొత్తానికి నూతన చైతన్యం, నూతన సన్నద్ధత — యీ రెంటిని లక్ష్యాలుగా పెట్టుకొని తమ శక్తిని అపవ్యయం కాకుండా వినియోగించడం యువజనులు నేర్చుకుంటే వారు చేపట్టిన ఏ కార్యక్రమమైనా దేశ రక్షణకు దోహదకారిగా ఉంటుంది. ★

# సర్వదా సన్నద్ధంగావుండండి!

దేశం సరిగా రక్షణకు సన్నద్ధం కానట్లయితే, విదేశాలు దండెత్తి వచ్చే ప్రమాదం వుంటుంది. కనుక ఇది జరుగకుండా వుండేందుకై సమస్త హంగులనూ సమకూర్చుకోవాలి. రక్షణ బలగంలోని మూడు భిన్న భిన్న విభాగాలైన, సైనిక, వైమానిక, నావికా దళాలకు ఆధునిక సాధన సామగ్రిని సమకూర్చాలి. పటిష్ఠమైన రక్షణ చర్యలకై సైనిక దళాలకు సక్రమంగా శిక్షణ గరపడానికి మన దేశంలోనే బహుళంగా అవకాశాలు కల్పించాలి. ఇందుకు సుశిక్షితులైన వ్యక్తులు, తగినన్ని ఆయుధాలు కావలసి వుంటుంది.

ఈనాడు ఏ దేశం రక్షణ కృషిలోనైనా యంత్ర శక్తి ప్రముఖ పాత్ర వహిస్తుంది. భారతదేశం ఎల్లప్పుడూ కూడా శత్రువును ధైర్యంగా ఎదుర్కొని, తన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు విఘాతం కలిగించడానికి ప్రయత్నించే ఏ దేశాన్నయినా సరే ఎదిరించి పోరాడడానికి తాను సిద్ధంగా వున్నట్లు వెల్లడించాలి. భారతీయులు అహింసా వాదులు అయినప్పటికీ దురాక్రమణ దారుడు దండెత్తి వచ్చినప్పుడు దేశ స్వాతంత్ర్యాన్ని రక్షించడానికి వారు సర్వదా సన్నద్ధంగా వుండాలి. ప్రపంచంలో అనేక దేశాల వారు సైనికంగా బలసంపన్నులై వున్నప్పుడు, దేశం రక్షణ విషయంలో పటిష్ఠంగా లేకపోవడం నిజానికి దురాక్రమణకు తావివ్వడమే అవుతుంది.

సైనిక శిక్షణ తరువాతి స్థానం ఆయుధ యంత్రపరికరాలు, ఆయుధాల ఉత్పత్తిది. అవసరమైన పరిశ్రమలను, పరిశోధనలను నిశ్చలంగా కొనసాగించనిదే వీటిని సమకూర్చడం సాధ్యంకాదు.

అభివృద్ధిజెందిన సుసంఘటితమైన పరిశ్రమ, లభ్యమైన ముడిసరుకుల సక్రమ వినియోగం, సైనికశక్తి ప్రధానమైన సాధనాలు. రక్షణ సన్నాహాలకు సంబంధించిన మరో ముఖ్యమైన కార్యక్రమం ట్రక్కులు, విమానాలు యు-బోట్లు మొదలైన అత్యాధునిక యుద్ధసామగ్రి తదితర ఆయుధాల ఉత్పత్తి. యుద్ధ సన్నాహక కృషిలో దీనికి ప్రముఖ స్థానముంటుంది. రక్షణ పరిస్థితి, రక్షణ యంత్రాంగం, రక్షణసమస్యలను ప్రత్యేకంగా పరిశీలించి అన్ని విధాలైన సైనికవనరులను, ఆయుధనిర్మాణ పరిశ్రమలను అభివృద్ధి పరచడానికి స్వతంత్రంగానే సత్వరంగా పూనుకోవలసిన అవసరం మనదేశంలోవుంది.

— స్వర్గీయ మోక్షగుండం విశ్వేశ్వరయ్య

ఇండియా చైనా సరిహద్దు వివాదం విషయమై చైనావారి వాదన అంతర్జాతీయ న్యాయ శాస్త్ర నిబంధనలకు పూర్తిగా వ్యతిరేకంగా వుంది. చైనా అంతర్జాతీయ న్యాయ సూత్రాలకు వ్యతిరేకంగా వాదించడమే గాక, ఆ దేశం పెక్కు సందర్భాలలో సూచించిన నిబంధనలు అంతర్జాతీయ న్యాయ శాస్త్రంలో లేవు. అవి ఆ దేశానికి తప్ప మరెవ్వరికి తెలియవు. ఈ విషయాన్ని పూర్తిగా గ్రహించవలసి వున్నది.

మొదటి విషయమేమంటే, స్వతంత్రంగా కొన్ని 'సూత్రాలను' సూచించి తనకు అనుకూలంగా వున్నపుడు వాటిని ఆ యా సంఘటనలకు అనువర్తింపజేసి, అననుకూలంగా వున్న సమయంలో వాటిని తిరస్కరించటం చైనాకు అలవాటైంది.

ఈ అలవాటు అంతర్జాతీయ న్యాయ శాస్త్రానికి పూర్తిగా విరుద్ధమైంది. పివిహేర్ కేసులో న్యాయమూర్తి అల్ఫరో యిలా చెప్పారు.

'తగాదాపడుతున్న దేశాల మధ్య వివాదాలను ఆ యా దేశాల వాదన, వారి పూర్వ చర్యల మధ్యనున్న వ్యత్యాసాన్ని ఆధారం చేసుకొని, నిర్ణయిస్తారు. ఏ దేశం విషయంలో ఈ వ్యత్యాసం గోచరిస్తుందో ఆ దేశానికి వ్యతిరేకంగా ఆ నిర్ణయం జరుగుతుంది. చెప్పేమాటలకు, చేసే చేతలకు వ్యత్యాస ముండడం చాలా సంవత్సరాల నుంచి, ఒక అలవాటుగా తయారైంది. ఆ అలవాటును తొలగించటానికి న్యాయం, అంతర్జాతీయ సామరస్యం, సహాయభూతం కావాలి.'

దీన్ని దృష్టియందుంచుకొని పరిశీలిస్తే చైనావారి వాదనలోని ప్రధానాంశాలు సారం లేనివిగా గోచరించకమానవు.

భారత దేశానికి చైనా 1910 ఏప్రిల్ 3న పంపిన లేఖలో ఆ దేశం అంతర్జాతీయ సరిహద్దంటే తన నిర్వచన మేమిటో వివరించింది. ఆ లేఖలో యిలా వ్రాయబడివుంది.




కె. కృష్ణారావు

'...అంతర్జాతీయంగా సమ్మతించబడిన నిబంధనల ప్రకారం, అంతర్జాతీయ సరిహద్దు దేశాల మధ్య సరిహద్దులను యేర్పరచే రేఖ. దాని ప్రక్కన వున్న రాజ్యాలు తమ భూభాగంపై ఆ రేఖ వరకు సార్వభౌమాధికారాన్ని నిర్వహిస్తాయి. ఆ రేఖను తత్సంబంధమైన దేశాలు సమిష్టిగా నిర్వచించవలసి వున్నది.'

ఈ ప్రాతిపదిక మీద వారు ఇండియా, చైనా సరిహద్దును, అది భూమి మీద గుర్తించ బడలేదని చెప్పి, తిరస్కరించ చూచారు. అయితే ఈ నిర్వచనం తప్పని స్పష్టంగా తెలుస్తూనే వుంది. ఇతరత్రాగూడా అదే రుజువయింది.

మరో సందర్భంలో చైనా అధికారులు చేసిన ప్రకటనను పరిశీలిస్తే ప్రస్తుతానికి సరిపోతుంది.

## పరస్పర విరుద్ధమైన వాదనలు

1960 లో ఉభయ దేశాల అధికారుల మధ్య జరిగిన సంప్రదింపులలో చైనావారు 1924-25 లో సరిహద్దు విషయంలో టిబెట్, గ్రేట్ బ్రిటన్ ల మధ్య జరిగిన డోక్పో-కార్పో సంప్రదింపులను పేర్కొన్నారు. 'సాంప్రదాయ సిద్ధంగా వస్తున్న రేఖ విస్పష్టంగా వుంది. తిరిగి నిర్ణయించవలసిందేమీ లేదని చైనావారు భావించడం' కారణంగా కొన్ని ప్రతిపాదనలకు తమ దేశం సమ్మతించలేదని చైనా అధికారులు చెప్పారు.

ఆ చర్చల తొలిదశలలో చైనా అధికారులు, 'లాంఛనప్రాయంగా సరిహద్దును నిర్ణయించడం' అవసరమై వుందని పట్టుపట్టారు. లాంఛనప్రాయంగా సరిహద్దు నిర్ణయించబడనందున తమకు రావలసిన ప్రాంతాలి వని నిర్దిష్టంగా చెప్పలేకున్నామని వారన్నారు.

అయితే, ఆ తర్వాత కొద్ది కాలానికే వారు 'సంప్రదాయ సిద్ధంగా వచ్చే రేఖ ఒకటుందని అన్నారు. ఉభయ దేశాల అధికారుల మధ్య జరిగిన సంప్రదింపులలో వారు తాము

సూచించిన సంప్రదాయ సిద్ధమైన రేఖ స్పష్టమైంది. నిర్దిష్టమైందని అది 'స్థిరమైంది మార్పు లేదని' చైనా వారి మ్యాపులలో సూచించబడినట్లు ఆ సంప్రదాయ సిద్ధమైన సరిహద్దు వుందని వాదించారు.

వాదనలో సందర్భశుద్ధి వుండాలని, పరస్పర విరుద్ధ అంశాలు వుండరాదని లౌకిక జ్ఞానం చెపుతుంది.

1928 లో ఒకసారి సాంప్రదాయ సిద్ధమైన సరిహద్దు నిర్దిష్టమైందని, దానికి తిరుగు లేదని చెప్పి, తనకు అనుకూలంగా వున్నప్పుడు 1960 లో వెనక్కు తిరిగి, మరొక సందర్భంలో అందుకు పూర్తిగా వ్యతిరేకంగా వాదించింది.

## అనుకూలాన్ని బట్టి వాదించడం

చైనావారి మిగతా వాదనలకు గూడా యీ అంతర్జాతీయ న్యాయశాస్త్ర నిబంధనే వర్తిస్తుంది. 1914 లో జరిగిన సిమ్లా సమావేశంలో మాక్‌మోహన్ రేఖ సరిహద్దు విషయంలో జరిగిన ఒప్పందం పై సంతకం చేయటానికి టిబెట్‌కు హక్కు లేదని, అలా చేసేముందు టిబెట్ తమ సమ్మతాన్ని పొంది వుండాల్సిందని చైనా వాదించింది. అయితే ఇండియా, చైనా సరిహద్దులో కొంత భాగానికి సంబంధించినంత వరకు చైనా 1924-25 లో భారత దేశంతో టిబెట్ స్వంతంగా నిర్వహించిన సంప్రదింపులు, చర్చలను ప్రాతిపదికగా తీసుకొనే సాక్ష్యాధారాలను సమకూర్చ ప్రయత్నించింది. చైనా సమ్మతాన్ని ముందుగా పొందకుండా నిర్వహించబడిన సంప్రదింపులివి. తనకు అనుకూలంగా వున్నపుడు చైనా ఈ ప్రాతిపదిక మీద వాదించటం న్యాయశాస్త్ర రీత్యా ప్రత్యేక ప్రాముఖ్యమున్న విషయమని, ఉత్సాహకరమైన విషయమని చెప్పాలి.

## మత రాజకీయ వ్యవస్థ

టిబెట్‌లో అమలులో వున్నదని చెప్పబడే మత—రాజకీయ వ్యవస్థను గురించినట్టి చైనా వాదం కూడా యీ ధోరణిలోనే వుంది. ఈ వ్యవస్థలో మతాధికారికే రాజకీయ అధికారాలు గూడా ఉంటాయి.

1914 లో చైనా ప్రభుత్వం యీ వ్యవస్థను స్పష్టంగా నిరాకరించిందని గుర్తుంచుకోటం అవసరం. టిబెట్, చైనా సరిహద్దు వివాదం కొనసాగుతున్న సమయమది. లామాలకు మత సంబంధమైన అధికారం వుండవచ్చు. అయితే యీ ప్రాంతాలు టిబెట్‌కు చెందినవని అర్థం గాదు, అని అప్పటి చైనా విదేశాంగ మంత్రి విమర్శించారు.

చైనా వారి భావాలను సులభంగా అర్థం చేసుకోవచ్చు. ఎందుకంటె ఆ సమయంలో ఆ వ్యవస్థను గుర్తిస్తే చైనాలోని కొన్ని ప్రాంతాలు టిబెట్‌లో కలుస్తాయి.

అయితే 1960 లో ఇండియా, టిబెట్ సరిహద్దు విషయంలో చైనా ఈ మత—రాజకీయ వ్యవస్థను ఆధారంగా వుంచుకొని వాదించటానికి వెనుదీయ లేదు. అది చైనాకు బాగా లాభసాటిగా వుండవచ్చు. కాని అంతర్జాతీయ న్యాయశాస్త్రానికి చైనావారి యింతకుముందు చెప్పిన మాటలు వారి వైఖరికి వ్యతిరేకమైంది.

## చైనా మూకీభావం

అంతర్జాతీయ న్యాయ శాస్త్రం మీద చైనాకు ఎట్టి తప్పు భావాలున్నాయో, నిరసనలు ఒక మారు ఒక విషయాన్ని ఒప్పుకున్న తర్వాతగాని దానినుంచి వెనక్కు పోవటానికి వీలులేదనే సూత్రం మొదలైన వానిపై వారి ఉద్దేశాలే విశదం చేస్తాయి. తమకు రావాల్సున్నవంటూ చెప్పుతున్న భూభాగాల విషయంలో 1959 వరకు చైనా మూకీభావం వహించి కిమన్నాస్తిగా వూరుకోవటం విషయమై భారత దేశం న్యాయశాస్త్రం ప్రకారం వాదించగా దాన్ని తిరస్కరించటమే అప్పుడు వారు ముఖ్యంగా పెట్టుకున్నారు.

ఉభయ దేశాల సరిహద్దును గురించి భారతదేశం చాలా సార్లు ప్రకటనలు చేసినప్పటికీ చైనా మూకీభావం వహించి వూరుకోటానికి యిదివరకు చైనా చేసిన పనులకు న్యాయశాస్త్ర రీత్యా ప్రత్యేక ప్రాముఖ్యముందని యీ దేశం సూచించినది. చాలా అవకాశాలు లభించినప్పటికీ, నోరు మెదపక వూరుకున్న తర్వాత చైనా, ఆ తర్వాత వేటినీ న్యాయశాస్త్రరీత్యా—తమవని అడుగ లేదు.

ఈ వాదనను కాదంటానికని చైనా 1960 లో ఉభయ దేశాల అధికారుల మధ్య జరిగిన సంప్రదింపులలో యీ ప్రకటన చేసింది.

భారత పక్షం ఏ అంతర్జాతీయ న్యాయశాస్త్రాన్ని ఆధారం చేసుకొని వాదిస్తున్నదో చైనా పక్షానికి తెలియటం లేదు. మూకీభావం ఒప్పందాన్ని సూచిస్తుందనే వాదన, అంతర్జాతీయ న్యాయశాస్త్ర నిబంధనలలో లేదు.

ఈ ప్రకటనను వివరంగా ఖండించవలసిన అవసరం లేదు. అది అసంగతమైనదని, న్యాయ విరుద్ధమైన వాదనని ప్రస్ఫుటంగా తెలుస్తూనే వున్నది. చాలా అంతర్జాతీయ న్యాయ సభలు గుర్తింపు, అంగీకారం యొక్క ప్రాముఖ్యాన్ని వివరించాయి.

పల్మాస్ ఐలండ్ కేస్, లోటస్ కేస్, మింక్వైర్స్ అండ్ ఇరికోస్ కేస్, ప్రెవిహార్ కేస్ మొదలైన వానిని యిందుకు ఉదాహరణగా చూపవచ్చును. అంతర్జాతీయ న్యాయస్థానంలో ఇదివరకు న్యాయమూర్తిగా

పనిచేసిన లౌటర్ పాక్టి గూడా యిదే భావాన్ని వెలిబుచ్చారు.

చైనా వారి యీ దృక్పథం ఊహింప శక్యంగానిదిగా వుంది. ఎందుకంటె యితర సందర్భాలలో తన హక్కులను ఉల్లంఘించటం జరుగుతున్నదని ఆ దేశం తనంతట తానే వెంటనే నిరసనను తెలిపింది. అమెరికా విమానాలు తమ భూభాగం పైగా ఎగిరినవని చెప్పి ఆ దేశం అనేకసార్లు నిరసన తెలిపింది. రెండు చైనాల సిద్ధాంతాన్ని బలపరుస్తూ ఏ సూచన చేయబడినప్పటికీ చైనా వెంటనే నిరసన తెలిపింది. ఈ విషయాలలో ఆ దేశం యిలా నిరసనలను తెలపటంలో అర్థమేమిటి? అని ఈ సందర్భంలో ఎవరికైనా అడగాలనిపిస్తుంది.

## చైనా దురుద్దేశాలు

చైనా వాదనలోని న్యాయశాస్త్ర విరుద్ధమైన విషయాలు, అవకతవకలు ఆ వాదనను నిరర్థకమైనది చేస్తాయి.

చైనా వారి దురుద్దేశాలను కూడా అవి విశదం చేస్తాయి. చైనా వారికి రావాలని వారు కోరుతున్న భూభాగాలను గురించి 1959 లో ప్రధాని చౌ-ఎన్-లై చేసిన ప్రకటన గూడా మార్చబడి, 1960 లో వారు తమకు యింకా 15,000 చ. మైళ్ళ భూభాగం రావాల్సుందని చెప్పారు. ఇది ఇంతటితో ఆగలేదు. ఇటీవల భారత దేశంపై చైనా పెద్దపెట్టున జరిపిన దండయాత్రలో చైనా సైనికులు 1960 లో ఆ దేశం సూచించిన హద్దులను గూడా దాటి ముందుకు పురోగమించారు.

నీతి నిబంధనలు, అంతర్జాతీయ న్యాయశాస్త్ర సూత్రాలు, వేటి ప్రకారం చూచినప్పటికీ యిది ఆలోచించుకొని కారణ రహితంగా చేసిన దండయాత్రగా తోచక మానదు. స్వతంత్ర భారతావని తన స్వాతంత్ర్య పరిరక్షణకు గాను నిర్వహిస్తున్న తొలియుద్ధం యిది. ఈ పోరాటంలో ధర్మం, న్యాయశాస్త్రం భారత దేశాన్ని సమర్థిస్తుండటంతో ఆ దేశం తప్పక విజయం పొందుతుంది.

(ఆకాశవాణి సౌజన్యంతో.)



# జాగృతి

"అమరేంద్ర"

మేలుకొన్నది నేడు నా భరత దేశం
ఆలపించినది సమధర్మ సందేశం
జాతిమతముల పొరుపు మరచీ
జాజిపువ్వుల దారి పరచీ
నవతలో మానవత
నాటుకొనగా
జనత తొలుతటి ఘనత
చాటుకొనగా
జూలు దులుపుతు లేచు
కొదమ సింగములాగ
నివురు ముసుగుల చీల్చు
నిర్భయ జ్వాలగా
మేలుకొన్నది నేడు నా భరత దేశం
ఆలపించినది సమధర్మ సందేశం!

ఆవరించిన శోకతిమిరాలు తొలగంగ
ఆవహించిన మహోత్సాహమ్ము లుప్పొంగ
ఆకరనిరాశలను పారద్రోలంగ
ఆదర్శ శిఖరాగ్రములను చేరంగ
మేలుకొన్నది నేడు నా భరత దేశం!
కరువుతీరగ మసల కరమెత్తి దీవించు
కరుణా స్వరూపిణులు కళ్యాణ రాగిణులు
పరువెత్తు వాహినులు ఆనంద మోహినులు!
మరుభూములన్నింట తరులతో విరులతో
సిరులొలుకు సస్యాల చిరునవ్వు సరులతో
మేలుకొన్నది నేడు నా భరత దేశం
ఆలపించినది సమధర్మ సందేశం!



# ప్రతిఫలాకాంక్ష లేని కార్యదీక్ష
## జీవితవిజయానికి శ్రీరామరక్ష

—"మహతీశంకర్"

*(మహామనీషి అమేయ మేధానిధి ప్రముఖ తత్వవేత్త అయిన స్వామి వివేకానంద శతజయంత్యుత్సవాలు భారతదేశం అంతటా జరుగుతున్నాయి. ఈ సందర్భంలో జీవితవిజయానికై మానవునికవసరమైన కార్యదీక్షను గురించి వివరించే వివేకానందవాణితో కూడిన యీ వ్యాసాన్ని ప్రచురిస్తున్నాము - ఎడిటర్)*

మనం ఫలితాల కెంత ప్రాధాన్యమిస్తామో అంతటి ప్రాధాన్యం ప్రయత్నాలకు కూడా ఇవ్వాలి'— అది నా జీవితంలో నేను నేర్చుకొన్న ఉత్తమపాఠం. ఈ పాఠం ఒక మహానుభావుడివల్ల నేర్చుకొన్నాను. ఈ సూత్రాచరణకు ఆయన జీవితం ఒక దర్పణం. నా జీవితమంతటిలోనూ నేను గ్రహించిన మహోత్కృష్ట విజ్ఞానం ఒక్కటే. ఏ విషయంలోనైనా కార్యకారణాలకు ఒకే రకమైన ప్రాధాన్యమివ్వాలి అనేది. మనం ఉన్నతమైన దానినేదో ఆశిస్తాం. మన ఆశలు కోటలు దాటుతూవుంటాయి. ఆకాశాన్ని అందుకోవాలనుకుంటాం. హిమగిరి శిఖరాన్ని అధిరోహిద్దాం అనుకుంటాం. మన ఆశయాలు కార్యరూపం దాల్చటానికి వాటివెనుక దాగివుండే వివిధ పరిస్థితులను అవలోకించగల అంతర్దృష్టి వుండాలి. అదే మనకులేనిది— అదే మనజీవితంలో అపజయానికి కారణం.

మనకు జీవితంలో సంభవించిన అపజయాలకు కారణాలను సవిమర్శకంగా ఆలోచిస్తే తొంబై తొమ్మిదిపాళ్ళు మన ప్రయత్నాలలో వున్న లోపమేనని గ్రహింపగలుగుతాం. ఆరంభం నుండీ అంతందాకా విజయం లభించేవరకు విజ్ఞానదాయకమూ విచక్షణాత్మకమూ అయిన ప్రయత్నాలు చేయాలి. అటువంటి హృదయస్థైర్యం మనకు ఈనాడు కావాలి. ప్రయత్న లోపంలేకుండా వుంటే కార్యసిద్ధి కలిగితీరుతుంది. సాధనబలంవల్ల కార్యం సాధింపబడుతుంది. కార్యం దానంతట అదేచేకూరదు. ప్రయత్నములు యుక్తములూ యోగ్యములూ శక్తివంతములూ అయి వుంటేనేగాని ఫలసిద్ధి ప్రాప్తింపదు. మనంఒక కార్యం తలచినప్పుడు, మార్గములను నిశ్చయించుకొన్నప్పుడు దానినిగూర్చి మనకిక ఆలోచన ఉండకూడదు. కార్యసిద్ధి అవుతుందనే విశ్వాసం కలిగిఉండాలి. ప్రయత్నమున్నప్పుడు ఫలం చేకూరక తప్పదు. మనం కారణాలనుగూర్చి శ్రద్ధవహిస్తే కార్యం తనంతటతానే శ్రద్ధవహిస్తుంది. కాబట్టి ప్రయత్నాలపై శ్రద్ధగలిగి వుండటమే జీవితంలో ఒక విజయ రహస్యం. మనం గీతలోకూడా చదువుకున్నాం — "కృషి ముఖ్యం. సర్వశక్తులు క్రోడీకరించి కృషి చేయాలి" అని. మనమేపని చేస్తుంటే మన మనస్సంతా దానిమీదనే లగ్నంచేసి కృషి సాగించాలి. కార్యసిద్ధి కలిగేవరకూ వెనుదిరగకూడదు. ఒకవేళ విఫలులౌతాం — అయినా దాన్నిమనం వీడకూడదు. తేనెటీగ తేనె త్రాగటానికని వస్తుంది. కాని తేనెలో కాళ్ళు అతుక్కుపోతాయి పాపం! అయినా అది తేనె త్రాగటం మాత్రం మానదు. అట్లాగే మనంకూడా. మనం తేనెత్రాగటానికి వచ్చాం — తేనెలో చేతులూ కాళ్ళూ చిక్కుకుంటాయి. తేనె త్రాగటానికి మనంవస్తే తేనెలోనే మనం చిక్కుకున్నాం. ఆనందించాలని మనం వస్తే దుఃఖం ఎదురైంది. ఎంతో ఆశతోవస్తే ఆశకాస్తా ఆరిపోయింది. మనం ఒకదాని కోసం వస్తే ఒకటి చిక్కింది. జీవితంలో ఇటువంటివన్నీ సహజమైనవి; ఇవన్నీ మనకు ప్రతివిషయంలో కనిపిస్తుంటాయి; ప్రకృతిలోని ప్రతివస్తువునూ అనుభవిద్దాం అని అనుకుంటాం. కాని ప్రకృతి మనల్ని

ప్రక్కకు నెట్టేసి మనలనే తనబానిసగా చేసు కుంటుంది. ఇటువంటి కష్టపరిస్థితులనే మనం ఎదుర్కొనవలసింది! ఇది జీవితంలో ఒక రహస్యం.

ఇటువంటి ఇబ్బందులే లేకపోతే జీవిత మంతా వెలుగే! అయినా ఫరవాలేదు. జయాపజయాలూ, సుఖదుఃఖాలూ ఒకదాని వెంట మరొకటి వస్తుంటాయి. అపజయాన్ని పొందక పోవటమే వెలుగును చూడటం — దుఃఖం అనుభవించక పోవటమే కాంతిని చూడటం.

దుఃఖానికి కారణం ఆశ. మనం ఎల్లప్పుడూ ఆశాబంధులమై వుంటాం. అందుకనే నిరాశా సంకెళ్ళలో చిక్కుకుంటున్నాం. "ఎప్పుడూ కృషిచేయాలి. కష్టాలు అనుభవించాలి. కాని ప్రతిఫలం కోసం ఎదురుచూడ కూడదు—'' ఇదికదా గీతలోని బోధ! ప్రతి వస్తువును గూర్చిఏదో ఒకటి అపేక్షించకండి. మనకు ఇంత ఇష్టమైనదైనా, దాన్ని వదిలి పెట్టడంవల్ల ఎంతదుఃఖం వచ్చినా అవసర మైతే సర్వస్వమూ త్యజించటానికి సంసిద్ధంగా వుండాలి. దౌర్బల్యానికి జీవితంలో స్థానంలేదు. దౌర్బల్యం అనేకరకాలైన దుఃఖాలకు దారితీస్తుంది — భౌతికంగానూ మానసికంగానూకూడా. దౌర్బల్యం అంటే మరణ మన్నమాటే! వందలకొలది సూక్ష్మజీవులు మనచుట్టూ ఉండవచ్చును. మనశరీరం దుర్బలం కానంతకాలమూ లక్ష సూక్ష్మజీవులైనా మనకు ఎటువంటి ప్రమాదమూ చేయలేవు- మనల్ని సమీపించలేవు - అసలు మనవైపు చూడలేవు. శక్తియే జీవము. శక్తి శ్వాశత మైనది; సంతోషకరమైనది; మరణాతీత మైనది. దౌర్బల్యం బాధాకరమైనది; దుఃఖాకరమైనది; మరణ సమానమైనది.

రాగము సర్వసౌఖ్యాలకూ సాధనం. మనకు స్నేహితులతో బంధువులతో సంబంధమున్నది. మనమేధావిశేషాలకూ, ఆధ్యాత్మిక భావాలకూ సంబంధమున్నది, మనం అనేక బహిర్వస్తువులతో సంబంధం పెట్టుకున్నాం. అవి మనకు ఆనందాన్ని కలిగిస్తున్నవి. అయితే ఈ రాగబంధమే అన్నిదుఃఖాలకు కారణమని కూడా తెలుసుకోవాలి. నిజమైన ఆనందం పొందాలంటే ఈ విధమైన బంధాల నుండీ విముక్తి పొందాలి. మనకు ఈవైరాగ్య శక్తి వున్నపుడు దుఃఖాలు మనల్ని సమీపించలేవు. ఏ మానవుడికి వైరాగ్యశక్తి వుంటుందో అతడే ప్రకృతిలోని సర్వస్వమునూ అనుభవింపగలుగుతాడు. అటువంటి ఆత్మశక్తి వుండటమే ఈనాడు కావలసి వుంది!

ఏ వస్తువుచేతా ఆకర్షింపబడని మనుషులు కొందరుంటారు. వారు ప్రేమించలేరు; ఆదరించలేరు; వారు పాషాణ హృదయులు; వారు జీవితంలో దుఃఖానికిగూడా దూరులు. ఒకగోడ వున్నది. అది ప్రేమించలేదు. ఎవరికీ అపకారం చేయదు. అయితే అది గోడ — అదిఒక నిర్జీవపదార్థం. ఒక గోడ లాగా వుండటంకంటె ఒక మనిషిలాగా బ్రతకటమేనయం. ప్రేమింపలేని మనిషి, కఠిన హృదయుడైనవాడు ఏ రీతిగా దుఃఖాలకు అతీతుడో, అట్లాగే సుఖాలనుకూడా అనుభవించలేడు. మనకు అటువంటి స్థితి ఎందుకు కావాలి? ముమ్మాటికీవద్దు. అట్లా వుండటం ఒక విధమైన దౌర్బల్యం — అది మరణ సదృశము.

మనకు కావలసింది ప్రేమింపగల ఆత్మశక్తి—అతీంద్రియమైన శక్తికావాలి. ఉత్తమ మానవుడు అఖండమైన అతీంద్రియశక్తి కలిగివుంటాడు. అందరి ఆత్మలకు అటువంటి స్థాయిరావాలి. బిచ్చగాడు సుఖంఅంటే ఎరగడు. ఇతరుల దయాదాక్షిణ్యాలవల్ల వాడికి గుప్పెడు బిచ్చంమాత్రం దొరుకుతుంది. చీవాట్లుకూడా వాటివెంటనే వుంటాయి. సంఘంలో అతడొకహీనస్థితిలో వుండటమే దీనికికారణం. నిజంగా సంతోషం ఎరగని దురదృష్టవంతుడు అతడు. అయితే మనంమాత్రం అతడికంటె ఏమిగొప్పవాళ్ళం! ఏదిచేసినా ప్రతిఫలం కోరే చేస్తాం. మనం వ్యాపారులం. నిత్యజీవితంలో వ్యాపారులం — గుణాల్లో వ్యాపారులం — మతంలో వ్యాపారులం — ఖర్మ! మనం ప్రేమలోకూడా వ్యాపారులమే అయినాం.

అదీకాదు. నిజంగా మనం వ్యాపారుల మైతే కొన్ని వ్యాపారసూత్రాలు పాటించాలి. వ్యాపారంలో కొన్ని మంచిరోజులుంటాయి. కొన్ని చెడురోజు లుంటాయి. ఒకసారి ధరలు పెరిగిపోతాయి. తక్షణమే పడిపోతాయి. అయినా లాభంకోసమే ఎదురు చూస్తుంటాం. వ్యాపారసరళి అంతా అద్దంలో చూసుకున్నట్టుగా వుంటుంది. ముఖం అద్దంలో ప్రతిబింబిస్తుంది. మన ముఖం వికారంగావుంటే, అద్దంలో వికారంగానే కనిపిస్తుంది. మనం నవ్వితే అద్దంకూడా నవ్వుతుంది. ఇదేవ్యాపారం. ఇదే ఇవ్వటమంటే, పుచ్చుకుంటమంటే — కొనటమూ, అమ్మటమూ.

మనం బందీలం. మనకు వచ్చినదానివల్ల కాదు - రావలసినదానివల్ల. ప్రేమకు ప్రతిఫలంగా మనకు దుఃఖంవస్తుంది. మనం ప్రేమించటంవల్లకాదు - మనప్రేమకు ప్రతిఫలాన్ని ఆశించటంవల్ల. ఎక్కడ కోరిక వుండదో అక్కడ దుఃఖంవుండదు—కోరికలు దుఃఖకారకాలు. పేరాశ దుఃఖానికి తండ్రి. జీవితంలో విజయం సాధించాలంటే, సంతోషం అనుభవించాలంటే ఈ రహస్యం తెలిసివుండాలి. ప్రతిఫలాకాంక్షలేనివాడు, నిస్వార్థజీవి యైనవాడు జీవితంలో విజయం పొందుతాడు — అతడే పరిపూర్ణవ్యక్తి. ఈ

లోకంలో ఇదిమాత్రం నిత్యసత్యమని ఎట్లా విశ్వసించగలం? నిస్వార్థుడు మాత్రం నిరపాయుడౌతున్నాడా? ఎటువంటి స్వార్థజీవి అని క్రీస్తుభగవానుణ్ణి శిలువవేశారు? మానవజాతిలో నెలకొనివున్న పాపపంకిలాన్ని తనరక్తంతో కడిగివేసిన కరుణ మూర్తికి ఎన్ని ఇక్కట్టులు ప్రాప్తించాయి? ఎన్ని హింసల పాలుచేశారు?

అయినా ఆ అమరమూర్తి జీవితం నిస్వార్థజ్యోతిని మానవాళి గుండెలలో వెలిగింపచేసింది. అందువలననే మనం ఐచ్ఛికంగా ఇతరులకు సహాయంచెయ్యాలి. కూడబెట్టుకోవటం జీవితంలో ముఖ్యమైనదిగా భావించకండి. గుప్పెటమూసికొని వుంటాం. కాని ప్రకృతి మనగొంతుమీద కూర్చొని ఐనా గుప్పెడు విప్పుతుంది. మన కిష్టమైనా, కాకపోయినా జరిగేదిమాత్రం ఇదే. ప్రకృతిసూత్రానికి తిరుగులేదు. ప్రకృతిసూత్రాలను అధికమించగల శక్తి మనకులేదు. అడవి కాలిపోతుంది. అయినా వంటచెరకుమాత్రం మనకు దక్కుతుంది. సూర్యుడు సముద్రంలోనీరును పైకితీసుకొని వెళ్ళుతాడు — మళ్ళీ వర్షరూపంలో మనకే యిస్తాడు. అట్లాగే మనంకూడా నిస్వార్థంగా పరోపకారం చెయ్యాలి. మనంకొంచెం ఇస్తే దానికి పదిరెట్లు మనకువస్తుంది. తలుపులు వేసుకొన్నంతకాలమూ బయటనుంచీ మనకేమీరాదు. మీదుమిక్కిలి మనలో వున్నదికూడా నీరసమై, నిర్జీవమై, శుష్కమై విషయ ప్రాయమవుతుంది.

మనలో మరొక పొరపాటుగూడా కనబడుతున్నది. మనం ఇతరుల తప్పు చూపించటానికి ప్రయత్నిస్తాము. ఇతరులను బాగుచేయటానికి ప్రయత్నిస్తాం — మనల్ని గురించి ఆలోచించం. మనకు కష్టంవచ్చినప్పుడు "ఛీ! రాక్షసలోకం!" అంటాం — కోపంతో 'వీళ్ళంతానీచులు' అని తిడతాం. మనం అంతమంచివారమైతే ఈ పాపిష్టి లోకంలో ఎందుకుండాలి? ఇది రాక్షసలోకమైతే మనమూ రాక్షసులమేగా! అందువల్ల "ఈ ప్రపంచమంతా చెడ్డది. మనం మాత్రం మంచివాళ్ళం" అనేమాట పచ్చిమోసం. అది ఆత్మవంచన చేసుకుంటమే.

ఇతరులతప్పు పట్టగూడదు. బయటి వాళ్ళమీద విరుచుకు పడగూడదు. ఇదే మనం నేర్చుకోవలసింది! మనం "మానవులం" కావాలి — మగత వీడాలి. స్వాత్మావలోకనం అత్యంతమూ ఆవశ్యకం. మనకు అన్నీ తెలుసుననీ, ఏదైనా చేయగలమనీ, నిర్దోషులమనీ, నిస్వార్థులమనీ, మన మానవత్వంగురించి ఉపన్యాసాలు దంచి, మనం దేవతాపురుషులమని చెప్పుకుంటుంటాము. మరుక్షణంలోనే చిన్నరాతిదెబ్బకు గురి అవుతాం. మరి ఇటువంటి "దేవతాపురుషుల"ను ఎవరు విశ్వసిస్తారు?

ఉతరులమీదికి తప్పునెట్టటానికి ప్రయత్నిస్తున్నామంటే మరొక తప్పుచేస్తున్నామన్నమాట. "ఇదిరాక్షస ప్రపంచం! వాడు నన్ను చంపుతున్నాడు — వీడునన్ను కొడుతున్నాడు!" అని విలపించటం ఉన్నదుఃఖానికి ఒక అబద్ధాన్ని కలిపినట్లే. అందువలన మనల్నిగురించి ముందు జాగ్రత్త తీసుకోవాలి. ఇతరులను గురించి లెక్కచేయగూడదు. ముందు కారణాలు బాగుచేసుకోవాలి. కార్యం అదే సఫలమవుతుంది! ఇదే కార్యకారణసిద్ధాంతం. మన జీవితాలు నిర్మలములు కావాలి — అజ్ఞానదూరములు కావాలి. అప్పుడు ప్రపంచం నిష్కల్మషం అవుతుంది — తేజోవంతమవుతుంది.

*[అమర గంగావేగంతో కదలిపోయే శ్రీ స్వామి వివేకానందుల భావతరంగాలకు ఇది అక్షరాకృతి.]*

# మంచుకొండపై జవాన్

పైడిపాటి సుబ్బరామశాస్త్రి

మాకోసం కాస్తున్నావా
మంచుమలల మెలికల్లో
మాకోసం రణంచేయ చూస్తున్నావా
మంచుకొండపై జవాన్

'జీరో' డిగ్రీ కింకా
జారిన పెనుసీతులో
'హీరో'గా నిలబడి 'పెం
పేరు'గ కాస్తున్నావా

ఉంటివో లేవో అంటూ
ఉస్సురనే ఆలివిడచి
కంటిలో వత్తులు వేసుక
కాస్తున్నావా దేశం

మసలుతు ఉన్నా కానీ
మా బిడ్డలు మా దగ్గఱ
ముసరుతు ఉన్నది నీపై
మనసంతా మా జవాన్

పొలిమేరల నీ సెంటో
ఇలుమేరల మేమంతే
మా సుకమ్మె నీ సుఖమే
నీ సుఖమ్మె మా సుఖమోయ్

మాకోసం కాస్తున్నావా
మంచుకొండ వటియల్లో
మాకోసం రణంచేయ చూస్తున్నావా
మంచుకొండపై జవాన్. ★

లద్దక్‌లో 18,000 అడుగులు మొదలు 20,000 అడుగుల ఎత్తుగల ఉన్నత పర్వత ప్రాంతాలపై గస్తీకాస్తున్న భారతీయ జవానులు, శత్రువును ఓడించగలమనే విశ్వాసంతో వున్నారు. ఇతర విషయాలలోకూడా వారు ధీమాగా వున్నారు.

వారు ఎవరెస్ట్ పర్వతాన్ని ఆరోహించదలిచారు.

“ప్రాణవాయువు సీసాలు లేకుండా ఇక్కడ మేము వుండగలిగినప్పుడు, పెద్ద పెద్ద బరువులు మోస్తూ పనిచేయగలిగినప్పుడు ఎవరెస్ట్ పర్వతాన్నికూడా మేము ఆరోహించగలం”, అని వారిలో చాలామంది అన్నారు.

తీరికలభించినప్పుడు కొంతమంది జవానులు వేటాడుతారు కూడా. ఉన్నత ప్రదేశాలలో, అందమైన కొమ్ములతో వుండే కొన్ని అడవి మేకలను వారు వేటాడారు. దిగువ ప్రాంతాలలో కౌజులను వారు వేటాడుతారు.

నిర్మానుష్యమైన పర్వతాలపై స్తబ్దతను తొలిగించడానికా అన్నట్లు చంద్రోదయం అయినప్పుడు జవానులు ఆ ప్రకృతిశోభను తిలకించి ఆనందిస్తారు.

కొన్ని దళాలు, జొరవార్ సింగ్ కోట శిథిలాల (13,500 అడుగులు) వద్ద తమ శిబిరాలు నెలకొల్పాయి. జొరవార్ సింగ్ ఈ ప్రాంతాలకు బహుశా 1840 వ సంవత్సరంలోవచ్చి వుంటారు.

## మొక్కవోని మనోధైర్యం

లధక్, నేఫాలలోని అగ్రస్థావరాలలో పర్యటించి వచ్చిన రాజస్థాన్ ముఖ్యమంత్రి శ్రీ మోహన్‌లాల్ సుఖాడియా జైపూర్‌లో ఇలాఅన్నారు: “ఇప్పుడు మన రక్షణశక్తిని చాలా పటిష్ఠ మొనర్చుకున్నట్లు నాకు కనిపిస్తున్నది. చైనీయులు తిరిగి దాడి జరిపినట్లయితే వారిని మనం అత్యంత సాహసంగా, స్థిర సంకల్పంతో ఎదిరించి త్రిప్పికొట్టగలమని నా దృఢ విశ్వాసం.”

ముఖాముఖి పోరాటంలో చైనీయులకంటే మన జవానులు ఎంతో మెరుగైనట్లు స్పష్టపడింది. అయితే కొన్ని కారణాలవల్ల ఆరంభంలో మనం కొంత దెబ్బతినవల్సివచ్చింది. “ఆకస్మికంగా, విద్రోహకరంగా” అలలు అలలుగా చైనీయులు ముందుకు చొచ్చుకొని రావడం దీనికి ముఖ్యకారణం. ఇది మన జవానులకు విస్మయం కలిగించింది.




అంతేగాక మన సైన్యాలకు సహాయంగా పంపబడిన అదనపు బలాలు, ఉన్నత ప్రదేశాలలో తీవ్రమైన చలికి తట్టుకొని అక్కడి వాతావరణ పరిస్థితులకు అలవాటుపడటానికి కొంత సమయం పట్టింది. ఆరంభంలో కొన్ని పరాజయాలు సంభవించినప్పటికీ మన జవానులు ఎంతమాత్రం అధైర్యపడలేదు. దృఢ సంకల్పం, ధైర్యస్థైర్యాలు వారి హృదయాలలో పెల్లుబికాయి.

## మేజర్ ధైర్య పరాక్రమాలు

మేజర్ షెతాన్‌సింగ్ నాయకత్వాన జవానుల దళం ఒకటి ఒక కొండఅగ్రంపై స్థావరం ఏర్పరుచుకొని ఛుషూల్ సమీపంలోని ఒక కీలకమైన రోడ్డును కాపలా కాస్తున్నది. అప్పుడు చైనీయులు ఆ రోడ్డును స్వాధీనం చేసుకునే ఉద్దేశంతో ఛుషూల్ విమానాశ్రయం చుట్టూ దాడులు ప్రారంభించారు. నవంబరు 18 వ తేదీ ఉదయం చైనీయులు ఇరుపార్శ్వాలవున్న రెండు పటాలాలపై ఏక కాలంలో దాడులు సాగించారు. వారి మొదటి దాడిని రెండువైపులనుంచి త్రిప్పికొట్టడం జరిగింది. చైనీయులు తమకు కలిగిన నష్టాలకు లెఖ్ఖ చేయకుండా మళ్ళీ దాడిసాగించారు.

మొదట ఎడమవైపు పటాలమున్న ప్రాంతంలో పోరు భీషణంగా సాగింది. చైనీయులవత్తిడి ఏమాత్రం తగ్గలేదు. ఎడమవైపున జమేదార్ సూర్జా శత్రుమూకలను కాల్పులతో నుగ్గుచేసి చైనీయులతో అతిచేరువులో ధైర్యంగా పోరుసాగించి చివరకు పోరాటంలో అసువులర్పించాడు.

అప్పటికే మనపటాలానికి కుడి పార్శ్వంలో పాక్షికంగా చైనీయులు దిగారు. మరతుపాకులతో వారు వెనుకనుంచి కుడివైపుగా దాడిచేసి మన కేంద్రాన్ని ఇంచుమించు ధ్వంసంచేశారు. కాని వారికి హెచ్చు ప్రాణనష్టం కలిగింది.

ఆ యుద్ధంలో మేజర్ షెతాన్ సింగ్‌కు మరతుపాకి కాల్పులవల్ల తీవ్రమైనదెబ్బ తగిలింది. ఇద్దరుసైనికులు తక్షణమే ఆయన రక్షణకు వచ్చారు. ఒక కాలువవెంట ఆయనను సురక్షితప్రాంతానికి చేరవేయ ప్రారంభించారు. కాని వీరు వెడుతున్న మార్గంలో మరతుపాకులతో కాల్పులు జరుగుతున్నాయి. తానుఎలాగూ గాయాలతో మరణించనున్నానని తెలిసి మేజర్ షెతాన్ సింగ్ తననువదలి వెళ్ళవలసిందని ఆ ఇద్దరు సైనికులనూ ఆజ్ఞాపించాడు.

ప్రతికూల వాతావరణ పరిస్థితిని సైతం

లక్ష్యపెట్టక మన జవానులు సమిష్టిగా ధైర్యంగా పోరాడారు. పోరాటం ఆపడాన్ని గూర్చి వారు ఆలోచించనైనా లేదు. సజీవంగా తిరిగివచ్చిన కొద్దిమందిలో ఒకరైన లాన్స్ నాయక్ రామచంద్ర ఆ పోరాటాన్ని గురించి విపులంగా వర్ణించాడు. ఆయన మేజర్ షైతాన్‌సింగ్ వెంటవున్నాడు. ఆ మేజర్ ఎలాగూ బ్రతికివుండేవాడు కాదని శ్రీ రామచంద్ర చెప్పాడు.

చాలామంది సైనికులు ఏమైపోయారో ఇదమిద్ధంగా తెలియదు. బహుశా వారంతా దేశంకోసం పోరాడుతూ వీరస్వర్గ మలంకరించివుంటారు. వారిలోకొందరు బ్రతికి వుండవచ్చు; యుద్ధ ఖైదీయులుగా పట్టుబడి వుండవచ్చు. కాని వారి శౌర్యప్రతాపాలు మాత్రం కొత్తతరం సైనికులకు ఉత్తేజం కలిగిస్తూనే వుంటాయి.

## "మానవమాత్రులకు అసాధ్యమైన కార్యం మహార్ వీరులు సాధించారు"

మహార్ రెజిమెంటుకుచెందిన జమేదార్ భీమూకాంబ్లే దౌలత్‌బేగ్ ఓల్డీ యోధుడు.

అక్టోబరు 22వ తేదీన ఉదయం, కాంబ్లే ఒక పటాలంతోసహా కొరాకోరం కనుమ సమీపంలోని భారతస్థావరం అయిన దౌలత్ బేగ్ ఓల్డీకి — అక్కడ చైనీయులు భారీ ఎత్తున దాడిజరిపే ప్రమాదం ఏర్పడినందున విమానంద్వారా చేరుకున్నాడు. దిగువ ప్రాంతంనుంచి 16,500 అడుగుల ఎత్తున వున్న స్థావరానికి చేర్చబడిన ఈ మహారాలు అక్కడికిచేరిన తక్షణమే కందకాలు త్రవ్వడం ప్రారంభించారు.

ఉన్నత ప్రదేశంలోని శీతలవాతావరణానికి వారిలో కొంతమందికి సుస్తీచేసినప్పటికీ వారుచాలా దీక్షగా పనిచేసి ఆరోజు సాయంత్రానికే తమ మరతుపాకులను అమర్చుకున్నారు. ఆ వేళరాత్రి 8 గంటల సమయంలో, అధికసంఖ్యలోవున్న చైనీయులతో పోరాడుతూ దౌలత్ బేగ్ ఓల్డీవద్ద కొద్దిమంది సైనికులు నిలద్రొక్కుకొని వుండటం, వీలుకాదుకాబట్టి ఆ స్థావరంనుంచి ఉపసంహరించుకోవలసిందిగా ఉత్తర్వులు అందాయి. తమవద్దవున్న బరువైన ఆయుధసామాగ్రి నంతటినీ నిరుపయోగంచేసి తిరిగి రావలసిందిగా వారికి ఉత్తర్వు చేయబడినది.

కాని భారతీయ ఉత్తమసైనిక సత్సంప్రదాయాన్ని పాటించే జమేదార్ కాంబ్లే, ఆయన జవానులు, మరతుపాకులతో సహా తమ ఆయుధ సామగ్రినంతటినీ తమ వెంటనే తీసుకొని వెళ్ళడానికి నిశ్చయించారు. రాత్రి పూట ఎముకలు కొరికే చలిలో జమేదార్ కాంబ్లే ఆయన బృందం దౌలత్ బేగ్ ఓల్డీ నుంచి బయలుదేరారు. వారు నాలుగు మైళ్లు ప్రయాణం చేసి వచ్చాక తాము కొన్ని మరతుపాకులను మరచి వస్తున్న సంగతి జమేదార్ కాంబ్లే గ్రహించాడు.

అక్టోబరు 23 వ తేదీ ఉదయం ఆయన ఆరుగురు జవానులను వెంటబెట్టుకొని తిరిగి దౌలత్ బేగ్ ఓల్డీవెళ్ళాడు. చైనీయులు ఆ స్థావరంపై గుండ్లు కురిపిస్తున్నప్పటికీ కాంబ్లే ఆయన జవానులు తమ మరతుపాకులు తీసుకొనిబయలుదేరారు. తరువాత తమ జట్టును చేరుకొని అంతాకలిసినాలుగు రోజుల పాటు బరువైన ఆయుధాలను మోస్తూ నిరాహారంగా ప్రయాణం చేశారు. రాత్రిళ్ళు ఆరుబయట తమ ఉన్ని జాకెట్లపై మాత్రమే వారు పడుకునేవారు. వారు మోసిన ఒక్కొక్క మరతుపాకీ బరువు 90 పౌనులు వుంటుంది.

నాలుగవ రోజున భారత విమాన దళానికి చెందిన హెలీకాప్టర్ వారికి బిస్కెట్లు, బ్లాంకెట్లు పడవేసింది. వ్యాధి గ్రస్తులైన ఇద్దరు వ్యక్తులను హెలీకాప్టర్ తీసుకొని వెళ్లింది. ఆయుధాలు వదలి రమ్మనమని మరి కొందరిని కూడా హెలీకాప్టర్ సిబ్బంది కోరింది. కాని వారు "మా తుపాకులు తీసుకోండి. మా దారిన మేము నడిచి వస్తాం," అని సమాధాన మిచ్చారు.

కాంబ్లే ఆయన జవానులు అయిదు రోజుల పాటు 90 మైళ్ళు ప్రయాణం చేసి అచ్చటికి సమీపంలోనున్న మరో స్థావరం చేరుకున్నారు. దుర్గమమైన మార్గం గుండా ప్రయాణం చేసి, ఎట్టి తీవ్రవనష్టానికి గురికాకుండా వారు తమ ఆయుధాలన్నింటినీ వెంట తెచ్చారు.

లధక్ ప్రాంతంలోని ఒక ఉన్నత సైనికాధికారి ఒక ఇంటర్వ్యూ సందర్భంలో సగర్వంగా ఇలా అన్నారు: "మరతుపాకులను మనుషులు కాక సాధారణంగా కంచర గాడిదలు మోస్తాయి. కాబట్టి దౌలత్ బేగ్ ఓల్డీలోని వారు తమ ఆయుధాలన్నింటితోనూ తిరిగి వస్తారని నా మట్టుకు నేను అనుకోలేదు. ఇప్పటివరకూ మానవమాత్రులకు అసాధ్యమైన దానిని మహార్ వీరులు సాధించడం చూసి నేను ఆనందపరవశుడనైనాను. వీరు తమ బరువు మోతలతో 17500 అడుగుల ఎత్తున వున్న క్లిష్టమైన కనుమ దాటవలసి వుంది."

జమేదార్ కాంబ్లేకి విశ్రాంతి అంటే ఎంత మాత్రం గిట్టదు. తన మాతృభూమి రక్షణకై అతను మళ్ళీ ఒక అగ్రస్థావరానికి వెళ్ళాడు.

## వాలాంగ్ సమరం

వాలాంగ్ పరిసరాలలోని కొండ ప్రాంతాలలో ప్రసిద్ధిగాంచిన యుద్ధం జరిగింది. భారత దేశంపై ప్రస్తుతం చైనీయులు జరిపిన దురాక్రమణలో గొప్ప ప్రతిభావంతమైన సంఘటనగా ఇది చరిత్రలో పేర్కొన

బడగలదు. ఇక్కడ భారత సేనలోని సుమారు 3000 మంది ఆఫీసర్లు, సైనికులు, 12000 మొదలు 15000 మంది సైనికులతో వున్న చైనా సేన పూర్తి డివిజను జరిపిన దాదాపు 15 భయంకర దండయాత్రలను తీవ్రంగా ప్రతిఘటించి, నవంబరు 14 నుంచి అహోరాత్రాలు మూడు రోజుల పాటు ఏడు మైళ్ళపొడవున వున్న తమ స్థావరాలను రక్షించుకొని శత్రువుకు మన దేశంలోకి ఇంకా జొరబడితే ఏం ప్రతిఫలితం దక్కుతుందో రుచిచూపారు.

చైనా వారికి మన కన్న మూడు రెట్లు అధికంగా మందుగుండు సామగ్రి వుండటంతో పరిస్థితి వారికే ఒకటికి పది రెట్లు అనుకూలంగా వుంది. రెండవ విషయమేమంటే చైనీయులు కొన్ని నెలలనుండి టిబెట్‌లో యుద్ధానికి సంసిద్ధులవుతున్నందున వారు యుద్ధరంగానికి తండోపతండాలుగా వచ్చి పడ్డారు. మన ఆఫీసర్లను, సైనికులను యుద్ధరంగానికి హడావిడిగా పిలిపించడం జరిగింది. రెండు రోజులు ఎక్కడా ఆగకుండా నడిస్తేనే తప్ప వారు రక్షణ స్థావరాలకు చేరుకోలేక పోయారు. మన జవానులకు మంచినీటి కోసం దుర్గమ ప్రాంతాలలో ఆరు గంటల పాటు నడవవలసి వచ్చేది.

వాలాంగ్ సముద్ర మట్టానికి దాదాపు 3,000 అడుగుల ఎత్తునవుంది. సుమారు రెండు మైళ్ళపైన 13,000 మొదలు 15000 అడుగుల ఎత్తుగల పర్వతశ్రేణు లున్నాయి. వీటి గట్లగుండా లోహిత్ నది తన ఉపనదులతో ప్రవహిస్తుంది. నది పశ్చిమ తీరం (అంటే బర్మా సరిహద్దుపైన) వద్ద ఒక వరుసలో మూడు కొండలున్నాయి. వాటిలో అన్నింటిలోకీ ఎత్తుగా వున్న కొండ, వాలాంగ్ పరిసరాలలోని మూడు ఎత్తయిన గుట్టలకు కూడలి. ఈ కొండలను వశపరుచుకుంటే శత్రువుకు వాలాంగ్‌కు బెడతతెచ్చి పెట్టడానికీ వాలాంగ్‌లోని విమాన స్థావరంపై ఆధారపడివున్న మన సరఫరా మార్గాలను విచ్ఛిన్నం చేయడానికీ వీలుకలిగేది.

## 8 గంటలు సాగిన సమరం

మన జవానులు ఆ కొండలకు ఆకుపచ్చ కొండ, పసుపుపచ్చకొండ, ట్రైజంక్షన్ అని పేర్లుపెట్టారు. ట్రైజంక్షన్ 13,500 అడుగుల ఎత్తునవుంది. ఎత్తులో తరువాతి స్థానం పసుపుపచ్చకొండది. కొండ వంపు లోనూ, అగ్రంపైన విపరీతంగా ఆకులు రాలిపడటంవల్ల దానికా పేరువచ్చినది. అన్నిటికంటే ఆకుపచ్చకొండ చిన్నది. దీనిపైన చెట్లుచేమలు పెరిగాయి. ఎప్పుడూ కూడా పోరాటం 12,000 అడుగులుమించిన ఎత్తులోనే జరిగింది.

చైనీయులు అక్టోబరు 21వ తేదీన కిబుటూవద్ద ఒక భారత గస్తీకేంద్రంపై తమదాడి ప్రారంభించారు. ఆ కేంద్రం స్వాధీనమయ్యాక వారు వాలాంగ్ వైపుకు చొచ్చుకొనిరావడం ఆరంభమైంది. అన్నిటికంటే చిన్నదైన ఆకుపచ్చకొండ శత్రుమూకల వశమైపోయింది. వారిని అచ్చట నుంచి తొలగించాలన్నదే మన ప్రయత్నం.

మొదట కుమానీలు ట్రైజంక్షన్ వైపుకు పురోగమించారు. అక్కడనుంచి పసుపుపచ్చ కొండకూ తిరిగి అటునుండి ఆకుపచ్చ కొండకూ వెళ్ళడానికి పథకం వేసుకున్నారు. వారు నవంబరు 14వ తేదీ ఉదయం బయలుదేరి ఆరోజు సాయంత్రానికి పసుపుపచ్చకొండ అగ్రానికి 50 గజాలు చేరువలోనికి చేరుకున్నారు. పోరాటం ఆరంభమైన వెంటనే కంపెనీ కమాండర్‌కు గాయం తగిలింది. అప్పుడు సెకండ్ లెఫ్టినెంట్ ఖత్రి తన దళానికి నాయకత్వం వహించాడు. నవంబరు 15వ తేదీ ఉదయం చైనీయులు పెద్దపెట్టున దాడి జరిపారు. సుమారు ఎనిమిది గంటలపాటు తీవ్ర పోరాటం సాగింది. మన సైనికులు ప్రతి అంగుళం మేరకూ శత్రువులతో ధైర్యంగా పోరాడారు. కాని చివరకు వారు ట్రైజంక్షన్‌కు ఉపసంహరించుకోవాల్సి వచ్చింది.

ఈ పోరాటంలో కంపెనీ చాలా నష్టపడింది. అయితే మన సైనికులు శత్రువులకు భారీనష్టాలు కలిగించారు. మరి కొద్ది మంది సైనికులు, సాధన సామాగ్రివుంటే కుమానీవీరులకు ఆ 50 అడుగులు కూడా వెళ్ళడానికి సాధ్యపడి వుండేదే. అప్పుడది యుద్ధంలో ఒక మరపురాని ఘటమయ్యేది. ఈ చారిత్రక సంఘటనకు ఏ టెన్నీసన్, బైరన్ మహాకవో తన కవనంద్వారా అమరత్వం ప్రసాదించి, భావితరాలవారు ఈ యుద్ధంలో పోరాడి వీరస్వర్గ మలంకరించిన యోధులను సంస్మరించుకునేట్లూ, కుమానీ శూరులు ప్రదర్శించిన శౌర్య పరాక్రమాలకు ప్రపంచమంతటా సైనికులు ఉత్తేజితులు అయ్యేట్లూ చేసేవారు.

## భారీ యెత్తున యెదురు దాడి

ఈలోగా వాలాంగ్‌లో అప్పుడే దిగిన డోగ్రాలను, శత్రుమూకలు చుట్టుముట్టిన కుమానీలను ఆదుకునేందుకై వెళ్ళవలసిందిగా ఆదేశించ బడింది. మందుగుండు సామగ్రిని ఇతోధికంగా తీసుకొని వెళ్ళేందుకు వీలుగా వీరు బ్లాంకెట్లతో సహా తమ సామానులను వదిలివేసి కొండపైకి వెళ్ళారు. అదే సమయంలో సిక్కు, గూర్ఖాదళాలవారు ఇతర వైపులనుంచి శత్రువులను ఎదుర్కొన్నారు. మన శతఘ్నిదళం, మళ్ళీ సమీకరణ జరుగకుండా వుండేందుకై శత్రుస్థావరాలపై గుండ్లు కురిపించింది.

చైనా సైనిక పంక్తులను ఛేదిస్తూ నిర్విరామంగా 9 గంటలపాట ఆరోహణ సాగించి

నవంబరు 15 వ తేదీ రాత్రి 9–30 గం. లకు డోగ్రాలు ట్రై జంక్షన్ చేరారు. నవంబరు 16 వ తేదీ ఉదయం 2–30 గం. లకు తిరిగి దాడి ఆరంభమైంది. శత్రుమూకలు కుమానీలకు చాలా సమీపంలోకి వచ్చేశాయి.

మరో రెండు డోగ్రా కంపెనీలు ఆరోహణ జరిపాయి. ట్రై జంక్షన్ అగ్రానికి 30 అడుగులు చేరువలోకి శత్రుమూకలు వచ్చేశాయి. ఆ రాత్రంతా వెనుకభాగంలోవున్న బ్రిగేడు నుంచి సంబంధం తెంచివేయడానికి చైనీయులు ప్రయత్నించడం, వారి ప్రయత్నాలను విఫలం చేయడంతోనే సరిపోయింది. సరఫరా శ్రేణులకు అసంఖ్యాక బలగంతో వున్న శత్రువులనుంచి ప్రమాదం ఏర్పడగానే వెనక్కు వెళ్ళడానికి కమాండింగ్ ఆఫీసరు నిశ్చయించాడు. మళ్ళీ వారు చైనీయుల సైనిక పంక్తులను ఛేదించుకుంటూ వెళ్ళవలసి వచ్చింది.

ఈలోగా విమాన స్థావరానికి ప్రమాదం ఏర్పడింది. పర్వత శ్రేణులలో ఒకదానిపై సైనిక దళానికి నాయకత్వం వహించివున్న లెఫ్టినెంట్ విక్రమ్‌సింగ్, మూడువైపులనుంచీ 300 మంది చైనీయులు తమవైపుకు చొచ్చుకొని వస్తున్నట్లు బ్రిగేడుకు వర్తమానం చేశాడు. ఆ కీలక ప్రదేశానికివున్న ప్రాముఖ్యత దృష్ట్యా ఏ విధంగానైనా సరే అక్కడే నిలదొక్కుకుని వుండవలసిందిగా ఆయనకు ఉత్తర్వు వచ్చింది. అరగంటవరకు తానక్కడ శత్రువును నిరోధించగలననీ తన సైనికులెవ్వరూ తమ స్థావరం వదలి వేయరనీ ఆయన సమాధానమిచ్చాడు. గంటన్నరవరకు ఆ ప్రదేశం శత్రువశం కాకుండా నిరోధించబడింది. కాని చాలా మంది సైనికులు తిరిగి రాలేకపోయారు. గాయపడిన వారిని విడిచి వెళ్ళిపోడానికి డాక్టర్ సుబ్బా నిరాకరించాడు. వ్యక్తిగతమైన ధైర్యసాహసాలనూ, సాముహికమైన బలపరాక్రమాలనూ చాటే ఈ గాథలూ ఇంకా ఇలాంటి అనేక కృత్యాలూ ఆ వీర పుత్రులు విగతజీవులైనప్పటికీ మన స్మృతిపథంలో కలకాలం నిలిచివుంటాయి.

వాలాంగ్ రంగంలో జరిగిన యుద్ధంచాలా ముఖ్యమైనది. అది భారతదేశపు యుద్ధ ప్రావీణ్యతను ప్రదర్శిస్తుంది. అంతేగాక చైనా సైనికులను గురించి ప్రచారంలోవున్న భావాలన్నీ వట్టిపుక్కిటి పురాణాలని, అభూత కల్పనలని ఆ యుద్ధం రుజువు చేసింది.

మొదటివిషయంచైనావారినిగురించిగోరంతలు కొండంతలుచేసి చెప్పడం జరిగింది. అసలు సంగతేమంటే అది అతిగా గొప్పచేసి చెప్పడం మూలంగా మనలో కలిగింది ఒక విధమైన భయం. చైనీయులకు సంఖ్యాబలం అధికంగా వున్నమాట నిజం. విధి నిర్వహణో, యుద్ధంలో మరణమోవారికితప్పదు. అయితేయుద్ధంలో పోరాడేవానిగా చైనా సైనికుడు మన జవానుకంటే ఎన్నోరెట్లుతక్కువ. కమాండింగ్ ఆఫీసరు ప్రక్కనవుండి ఉత్తర్వులు ఇస్తూ విధిని సక్రమంగా నిర్వహించకపోతే దండన తప్పదని బెదిరిస్తున్నంత సేపూ ఆ సైనికులు యుద్ధం చేస్తారు. నాయకుడిని తొలగిస్తే వారు చిందర వందరగా అటూ ఇటూ పరుగెత్తుతారు.

రెండవ విషయం, మన సైనికుల సామానులమూట చాలా బరువుగా వుంటుందనీ అందువల్ల వారు త్వరత్వరగా ముందుకు పోవడం కష్టమనీ అంటారు. వాలాంగ్ రంగంలో మనజవాన్లు వారు సాధారణంగా మోసుకువెళ్ళే 50 రౌండ్ల మందుగుండు సామాగ్రేకాక దానికి నాలుగురెట్లు తమవెంట తీసుకువెళ్లారు. అతి యేటవాలుగావున్న లోయలలోకి కూడా దిగారు.

## యువ సైనికుని సాహసం

నేఫాలో కాలికి గాయం తగలడంవల్ల కుంటితనం వచ్చిన ఒకయువ సైనికుడు తాను మరణించడానికి పూర్వం శత్రువుల ఉనికిని గురించి తన సహచరులకు తెలియజేసే నిమిత్తం 3,400 అడుగుల మంచు కొండనుంచి దొర్లిన ఉదంతం ఫరీద్‌కోట వద్దగల అతని స్వగ్రామంనుంచి తెలియ వచ్చింది.

ఆ గ్రామంలో జరిగిన "భోగ్" ఉత్సవం సందర్భంలో హవల్దార్ భజన్‌సింగ్ ఈ వీరకృత్యాన్ని గురించి చెప్పాడు.

జిల్లా మహిళా రక్షణమండలి అధ్యక్షురాలు శ్రీమతి నిర్మల వాసుదేవ అతని గృహాన్ని సందర్శించి ఆయన అర్ధాంగి శ్రీమతి మంజీత్ కౌర్‌కు రూ. 500/–ల రొక్కం, ఒక కుట్టుమిషను అంద జేసింది. అధికార్లు ఆమెకు ఒక ఎకరం భూమి కూడా కేటాయించారు.

తనభర్త సాహసకృత్యానికి గర్విస్తున్న ఆ వీరపత్ని తన గ్రామంలో సాంఘిక సేవికలనుచేర్చి జవానులకు, వారి కుటుంబాలకు బట్టలుకుట్టి ఇవ్వడానికి స్వచ్ఛందంగా కృషి చేస్తున్నది.

## తొమ్మిది బుల్లెట్ దెబ్బలు

తీవ్రమైన బాధనుకూడా చిరునవ్వుతోనే భరిస్తున్న సహనశీలి జె. సి. ఓ. సాంతోక్ సింగ్, చైనీయులకు పట్టుబడి యుద్ధఖైదీగా విడుదల చేయబడిన శ్రీ సింగ్ ఢిల్లీకంటోన్మెంటు ఆసుపత్రిలో చికిత్సపొందుతున్నాడు. నేఫా పోరాటంలో అతని శరీరంలోనికి తొమ్మిది బులెట్లు దూరాయి. వీటిలో అయిదింటిని బయటికి తీశారు. మిగిలిన వాటిని క్రమంగా తీసివేస్తారు. పరాక్రమశాలి అయిన ఈ అధికారి తన మంచంపై కూర్చుని ఓవరు కోటును సరిచేసుకుంటూ సైనిక నియమాల ప్రకారం వేషధారణచేయడానికి ప్రయత్నిస్తూ

ఉండడం రెడ్‌క్రాస్‌బృందం చూసింది.

చైనీయులు తమకు ఏవేవో బోధనలు చేయడానికి విశ్వ ప్రయత్నం చేసినట్లు సైనికులు తమను చూడవచ్చినవారికి చెప్పారు. చైనా అధికార్లు, సరిహద్దు వివాదానికి సంబంధించిన పెకింగ్‌వాదాన్ని వారికి దుబాసీల ద్వారా చెప్పించారట.

## నేఫా ప్రజల విధేయత

నేఫాలోని మొంపా తెగ ప్రజల అభిమానం చూరగొనడానికి చైనీయులు ఎంతగానో ప్రయత్నించినప్పటికీ వారు భారత దేశంపట్లనే భక్తి విశ్వాసాలు కలిగివున్నారు. చైనీయుల ఉపసంహరణ అనంతరం ఈ ప్రాంతాలలో తిరిగి పౌర పరిపాలన నెలకొల్పబడిన తరువాత ఆ ప్రజలకు భారత దేశం పట్లగల భక్తి విశ్వాసాలను చాటే అనేక విషయాలు తెలియ వచ్చాయి:

కామెంగ్ డివిజను ప్రధాన కార్యస్థానమైన బొమ్‌డిలాలో భారత త్రివర్ణ పతాకం ఎగురవేయబడిన కొన్నిగంటలలోనే ఆరు వారాలనుంచీ ఎవరికీ కనిపించకుండా రహస్యంగా వుంటున్న ఒక యువతి తనపాపతో సహా సహాయానికై బొమ్‌డిలా చేరుకున్నది. వెంటనే అధికార్లు ఆమెకు ఒక బ్లాంకెటును, పాపకు ఉన్ని దుస్తులను ఇచ్చారు. చైనీయులు కూడా ఆమెకు సహాయం చేస్తామన్నారట. కాని ఆమె నిరాకరించింది.

బుధవారంనాడు బొమ్‌డిలాకు వచ్చిన కొంతమంది గ్రామస్థులు తమను అస్సాం మైదానాలలోకి వెళ్లిపోనీయకుండ చైనీయులు ఏ విధంగా అటకాయించిందీ అధికార్లకు తెలియజేశారు. చైనీయులదాడి జరిగినప్పుడు వారు డర్రాంగ్ జాంగ్ గ్రామంలోవున్నట్లు తెలిపారు. వారు తమ గ్రామం వదలి తరువాత చాకులోనికి ప్రవేశించినప్పుడు చైనీయులు వారిని తరిమికొట్టారట. తుపాకులు చూపించి డర్రాంగ్ జాంగ్‌కు బలవంతంగా త్రిప్పి పంపారట. గత నవంబరులో ఈచాకువద్దనే చైనీయులు పోరాటంజరిపారు.

కాని ఆ గ్రామస్థులు ఏలాగో తప్పించుకొని ఆ సమీపంలోని కొండలలోకి వెళ్ళి, బొమ్‌డిలాలో పౌర పరిపాలన పునః ప్రతిష్ఠించబడినట్టు తెలిసేవరకూ ఎవ్వరికంటా పడకుండా గడిపారు.

మరో గ్రామంలో ఒక మొంపా పెద్ద, చైనీయులు తనవద్దనుంచి సమాచారం రాబట్టడానికి ప్రయత్నించకుండా వుండేందుకై తన అధికార దుస్తులను ఒక గొయ్యిత్రవ్వి పాతిపెట్టాడు. అధికార దుస్తులలోవున్న నేఫా పరిపాలనకు చెందిన ఇద్దరు ఉద్యోగులను చైనీయులు బాధించడంవల్లనే అతనలా చేశాడు. పౌర పరిపాలన నెలకొన్న వెంటనే ఆ గ్రామపెద్ద తన దుస్తులు పాతిపెట్టిన గొయ్యిత్రవ్వి వాటిని పొలిటికల్ ఆఫీసరుకు సమర్పించడానికై బొమ్‌డిలాకు వచ్చాడు. ఆ దుస్తులకు బురద మరకలు అంటటంవల్ల పొలిటికల్ ఆఫీసరు అతనికి కొత్తదుస్తులు ఇప్పించాడు.

---

# జవానులకు పుస్తకాలు

రచయితలు, కళాకారుల జాతీయ రక్షణ సంఘం (సికింద్రాబాదు) తరపున "ఆంధ్ర జనత" సంపాదకుడు శ్రీ కె. ఎస్. సుబ్రహ్మణ్యం, శ్రీ పి. సాంబశివరావు, శ్రీ ఉషశ్రీ, రక్షణదళాలకు పంపేనిమిత్తం రూ.320=25లు విలువ చేసే 194 కొత్త తెలుగు పుస్తకాలను, 1962 డిశంబరు 29 వ తేదీన సమాచార, పౌరసంబంధాలశాఖ డైరెక్టరుకు అందజేశారు. మొదటి దఫాగా ఈ పుస్తకాలను అందజేయడమైందనీ, ఇంకా ఈ విధంగా దఫాలవారీగా చాలా పుస్తకాలు సమర్పించబడతాయనీ వారు తెలియజేశారు. ఈ సంఘం కొన్ని పోస్టర్లను ముద్రించింది. కవితాసంకలనాన్నొకదానిని వెలువరించింది కూడా.

మాతృభూమి రక్షణకై ప్రతి కళాకారుడు, రచయిత తన సాహితీ కృషిద్వారా తోడ్పడాలనీ, సాధ్యమైనదంతా చేయాలనీ ప్రకటించే ఒక ప్రమాణాన్ని కూడా ఈ సంఘం రూపొందించింది. రాష్ట్రంలోని అందరు కళాకారులు, రచయితలు పౌరుల సంతకాలకై దీనిని వారందరికీ పంపుతున్నారు.

# ఈశాన్యసరిహద్దు-లఢక్ ప్రాంతాలపై మన ఆధిపత్యం యీనాటిదా?

— సంపతి

చైనా – భారతదేశ సరిహద్దు తూర్పు ప్రాంతంలో 30,000 చదరపుమైళ్ళ ప్రాంతంపై హక్కు తమదేనని చైనా అంటున్నది. ఆ హక్కును బలపరుస్తూ సాక్ష్యంచూపమనగా చైనా నొక్కి చెప్పే సమాధానంయిది: "ఆ ప్రాంతాలు అక్రమ సరిహద్దుగీత అయిన మెక్‌మహన్‌గీతకు ఉత్తరంగా వున్నాయని చైనా అనేకసార్లు తిరుగులేని ఋజువు యిచ్చింది."

ఈ తిరుగులేని ఋజువు ఏమిటి? అవి చైనా ప్రాంతాలని పదేపదే చెప్పడం. అది సరైన సాక్ష్యమని చైనాభావం.

ఈశాన్య సరిహద్దు ప్రాంతమంతా మెక్‌మహాన్ గీతవరకూ కొన్ని శతాబ్దాలుగా భారత ప్రాంతమని చెప్పడానికి కావల్సినంత సాక్ష్యమున్నది. పశ్చిమ ప్రాంతంవలెనే సంప్రదాయసిద్ధంగానూ, కట్టుబాటు, ఒప్పందం, పాలక ఆధిపత్యాలరీత్యానూ అది భారతదేశ ప్రాంతమే. తూర్పు ప్రాంతం గురించి భారతదేశం చూపిన ఋజువు వేల సంవత్సరాలనాటి చారిత్రిక సాక్ష్యం.

## ఈశాన్య సరిహద్దు ప్రాంతం భారత దేశంలోదని పురాణాల సాక్ష్యం

కలికిపురాణం, మహాభారతం, విష్ణు పురాణం, నేటి ఈశాన్య సరిహద్దు ప్రాంతం అనబడే గిరిజన ప్రాంతం, ఆది హిందూరాజుల పాలనక్రింద వుండేదని తెలుపుతున్నాయి. హిందూ సామ్రాజ్యమైన కామరూప సామ్రాజ్యం హిమాలయ, శ్రేణులవరకూ ప్రస్తుత టిబెట్ – ఇండియా సరిహద్దు వరకూ విస్తరించి ఉండేదని హూన్‌ట్సాంగ్, 8 వ శతాబ్దం నాటి యోగినీ పురాణం తెలుపు తున్నాయి. పదిహేడవ శతాబ్దంలో రచించబడిన "అస్సాం లోయ రాజకీయ భూగోళం" అన్న గ్రంథంలో ఆ ప్రాంతంలోని గిరిజనులు అహోం రాజులకు పన్ను కట్టేవారనివున్నది. 1826 లో బ్రిటిషు వారు అహోం రాజులను జయించి, ఆ రాజుల పాలన చివరి రోజులలో బలహీనమైన కొండప్రాంతాలను వశపరచుకున్నారు.

ఆ గిరిజన ప్రాంతానికి, టిబెట్‌కు సరిహద్దు హిమాలయ పర్వతాలన్న సత్యాన్ని విదేశ యాత్రికులు శ్రీ టి. టి. కూపర్ (1873), మైకెల్ (1883) రచనలు తెలుపుతున్నాయి. 19 వ శతాబ్దంనాటి చైనీస్ పటాలు, చైనాభాషలోని రచనలుకూడా యీ విషయాన్ని నిరూపిస్తున్నాయి. 1863 నాటి యూట్సింగ్‌పటం, 1910 లో కాంటన్‌లో చియోచుంగ్ అకాడమీ ప్రచురించిన పటం యీ సందర్భంలో పేర్కొనదగ్గవి.

## మెక్‌మహాన్ రేఖ విషయంలో ఒప్పందం

పైవన్నీ చారిత్రిక సత్యాలు. ఈ ప్రాంతం సరిహద్దు విషయమై 1914 లో సిమ్లాలో భారతదేశం, టిబెట్, చైనాల ప్రతినిధులు చేసుకున్న ఒడంబడిక వుంది. ఆ ఒడంబడిక ఫలితంగా చైనా–భారతదేశ సరిహద్దు చూపుతూ పటంలో ఒక గీత గీశారు. ఆ ఒప్పందంపై సంతకంచేసిన బ్రిటిషు ప్రతినిధి కర్నల్ మెక్‌మహాన్ పేరు ఆ గీతకు పెట్టబడింది. ఆ గీతే ఇండియా, చైనాల స్థిరమైన సరిహద్దు,

1914 నాటి సిమ్లా ఒప్పందంపై సంతకం చేసే హక్కు టిబెట్టుకు లేదని, చైనా దాని నెన్నడూ గుర్తించలేదనీ చైనా యొక్క యిటీవలి వాదానికి 1960 లో సరిహద్దు విషయమై భారత, చైనా ప్రభుత్వాల అధికారులు చర్చలు జరిపినప్పుడు భారతదేశం సరైన సమాధానం యిచ్చింది. టిబెట్‌ను చైనా కబళించడానికి ముందువరకూ టిబెట్ ఇరుగుపొరుగు దేశాలతో స్వతంత్రంగా ఒడంబడికలు చేసుకునేదనీ, లోగడ చైనా ఎన్నడూ ఆ హక్కును ప్రశ్నించలేదనీ భారత ప్రతినిధులు ఆనాడే సమాధానం చెప్పారు.

1914 నాటి ఒప్పందం అక్రమమైనదన్న చైనావాదాన్ని ఖండిస్తూ భారత ప్రధాన మంత్రి చౌఎన్‌లైకు 1959 సెప్టెంబరు 26 న, ఒకలేఖ వ్రాశారు. సిమ్లా సమావేశానికి ఏర్పాట్లు చైనా ప్రభుత్వ ఆమోదంతోనే జరిగాయనీ, ఆ సమావేశంలో చైనా ప్రతినిధి మాట్లాడటమేగాక, చైనా, బ్రిటిషు ప్రతినిధులతో సమానస్థాయిలో టిబెట్ ప్రతినిధి మాట్లాడారని కూడా శ్రీ నెహ్రూ తెలియ చేశారు. అట్టి పరిస్థితులలో అంతర్జాతీయ న్యాయసూత్రాల ప్రకారం ఆ ఒప్పందానికి చైనా, టిబెట్టులు రెండూ కట్టుబడి వుండ వల్సినదే.

## పాలక ఆధిపత్యం

ఈశాన్య సరిహద్దు ప్రాంతం అంతటి పైనా, టిబెట్‌తోగల సంప్రదాయమైన సరిహద్దువరకూ పాలక ఆధిపత్యం భారత దేశానిదేనని బుజువు చేయడానికి కావల్సినంత సాక్ష్యంవుంది. శాంతిభద్రతల రక్షణతోసహా పాలక సంబంధమైన అన్ని విషయాలు భారత ప్రభుత్వం చేతులలోనే వున్నాయి. భారత ప్రభుత్వం నియమించిన రాజకీయశాఖ ఉద్యోగులే అక్కడి పాలక యంత్రాంగాన్ని నిర్వహిస్తున్నట్లు భారత ప్రభుత్వం 1873 నుంచి జారీచేసిన అనేక ప్రకటనలు తెలుపుతున్నాయి. ఈశాన్య సరిహద్దు ప్రాంతం భారతదేశ అంతర్భాగమే నని జనాభాలెక్కలకు సంబంధించిన అనేక నివేదికలు తెలుపుతున్నాయి. హిమాలయాల వరకూ విస్తరించివున్న గిరిజన ప్రాంతం అస్సాంలోని భాగమని అస్సాం 1881 లో తయారుచేసిన జనాభాలెక్కల నివేదికలో కూడా వున్నది.

ఈశాన్యసరిహద్దు ప్రాంతంలోని గిరిజన ప్రాంతంపై బ్రిటిషు అధికారులు ఏర్పాటు చేసిన పాలకవ్యవస్థ అంత కట్టుదిట్టంగాలేని మాట నిజమే. తమ అధికారాన్ని తెలియ జేయటానికి బ్రిటిషువారు ఆ ప్రాంతాలకు తరుచువెళ్ళి అక్రమ ప్రవర్తనకు గిరిజనులను శిక్షించి, ఆంతరంగిక వివాదాలను పరిష్కరించి అక్కడ శాంతిభద్రతలను పరిరక్షించే వారు. ఆ ప్రాంతం భారత దేశంలోనిదని అధికార పటాలు చూపుతున్నాయి. భారత దేశపటం 1883, భారత సర్వే శాఖ 1885 లో ప్రచురించి 1903 వరకూ సరిచేసిన పటం, 1909 లో భారత ప్రభుత్వం సంస్థానాల మెమొరాండంతో జతపరిచిన పటాలలో గిరిజన ప్రాంతం యావత్తు ప్రత్యేక రంగులో చూపబడింది. తమ హక్కులను నిరూపించ డానికి భారతదేశం యిన్ని సాక్ష్యాధారాలను చూపించగా చైనా చూపగలిగిందేమిటి? ఈశాన్య సరిహద్దు ప్రాంతంలోని హెచ్చు భాగాలు తమవే ననీ, భారతదేశం పత్రాల రూపంలోనూ, యితరత్రానూ చూపిన సాక్ష్యం కాదనడం మినహా చైనా తమ హక్కును నిరూపించడానికి ఏమీలేదు.

సరిహద్దు సమస్యపై భారత, చైనా దేశాల మధ్య జరిగిన సుదీర్ఘమైన సంప్రదింపులలో సాక్ష్యాధారాలతో నిమిత్తం లేకుండా తమ వాదమే సరియైనదని గ్రుడ్డిగా నొక్కి చెప్పడం చైనీయులకు అలవాటయింది. ఇక, భారత వాదానికో, సరిచూసుకోవడానికి వీలైన ఆధారాలు విస్తారంగా వున్నాయి. కాని, దానికి తాము అంగీకరించ జాలమనీ, లేదా ఆ సాక్ష్యానికి విలువ లేదనీ చైనీయులు తేలికగా కొట్టివేసే వారు.

ఉదాహరణకు, చైనీయులు లడఖ్‌లో అక్సాయ్ చిన్‌నూ, దానికి పశ్చిమాన కొంత ప్రాంతాన్నీ తమదని చెప్పారు. అక్సాయ్ చిన్ ప్రాంతం వరకూ తమ పాలన విస్తరించిందనికూడా చైనీయులు చెప్పుకున్నారు. 1962 డిసెంబరు 19 నాటి తాజా పత్రం (డిసెంబరు 26 న ప్రచురితం) లో భారత ప్రభుత్వం సూచించినట్లు, చైనీయులు తమ వాదానికి యిదివరకటి వలెనే ఆధారం చూప లేదు.

పైపెచ్చు, 1960 లో ఉభయ దేశాల ప్రభుత్వాల ప్రతినిధుల మధ్య జరిగిన సంభాషణలలో చైనా వాదం నిలవలేదనీ, అక్సాయ్ చిన్ ప్రాంతం ఎన్నడూ చైనాకు గానీ టిబెట్‌కుగానీ చెందివుండలేదనీ విస్తృతమైన సాక్ష్యాధారాలతో భారతీయ బృందం నిరూపించింది. సంప్రదాయం, ఆనవాయితీ, చరిత్ర, సంధులూ, ఒప్పందాలూ, పటాలూ, ఇతర పత్రాలూ—వీటి ఆధారంతో భారతీయాధికారులు తమ వాదాన్ని నిరూపించారు. వాస్తవ పాలనాధికారం కూడా భారత దేశానిదే అని వారు చూపారు.

## చరిత్ర, సంప్రదాయం

10-19 శతాబ్దాల మధ్య లడఖ్ టిబెట్‌లో భాగంగా వుండేదని చైనా అధికారులు గట్టిగా వాదించారు. కాని, తమ వాదాన్ని సమర్థించుకోవడానికి వారికి సాక్ష్యాధారం ఏమీ లేకపోయింది పాపం! 17 వ శతాబ్దం వరకూ లడఖ్ స్వతంత్ర సంస్థానంగా వుండే దనీ, 17 వ శతాబ్దంలో అది మొగలాయి సామ్రాజ్యం క్రిందికి వచ్చిందనీ భారతీయాధికారులు సాక్ష్యాధారాలతో చూపారు.

1834-1841 సంవత్సరాల మధ్య జమ్మూకు చెందిన గులాబ్‌సింగ్ లడఖ్‌ను జయించారు. 1846 లో అది భారతదేశంలో బ్రిటిషు పాలన క్రిందికి వచ్చింది.

10 వ శతాబ్దంలో సైతం లడఖ్ స్వతంత్ర సంస్థానంగానే వుండేదనీ, టిబెట్ ఆధీనం క్రింద ఎన్నడూ లేదని కూడా భారతీయ బృందం లడఖీ వ్రాతప్రతుల ఆధారంతో నిరూపించింది.

ఆనవాయితీ రీత్యా కూడా, లడఖ్ ప్రాంతంలో భారత వాదపు సరిహద్దు సరియైనదే అని ఋజువవుతుంది. ఆ సరిహద్దు శ్రేణివరకూ పచ్చిక బయళ్ళలో పశుల కాపర్లూ ఎట్టి అడ్డంకీ లేకుండా తమ పశువులను మేపుకునే వారు. చైనీయుల, లేదా టిబెటన్ అధికారుల అనుమతితో నిమిత్తం లేకుండా, లడఖీలు యీ ప్రాంతంలో స్వేచ్ఛగా తిరిగే వారు.

## రెండు సంధులు

లడఖ్‌కూ, టిబెట్‌కూ మధ్య సరిహద్దు సహజసిద్ధమైనదీ, సంప్రదాయ సిద్ధమైనదీ, ఆనవాయితీగా వస్తున్నదీ అని నిరూపించడమే గాకుండా యీ సరిహద్దు రేఖ 1684, 1842 సంవత్సరాల మధ్య లడఖ్, టిబెట్‌ల మధ్య జరిగిన సంధుల ద్వారా ధ్రువపరచబడిందని కూడా భారతీయాధికారులు సాక్ష్యాలతో చూపారు. 1684 నాటి సంధి అధికారికమైనది కాదని చైనీయులు 1960 సంభాషణలలో వాదించారు. కాని, 1959 సెప్టెంబరు 26 నాటి లేఖలో భారత ప్రధాన మంత్రి ఆ సంధిని గురించి ప్రస్తావిస్తే, చైనీయులు అందుకు ఆక్షేపణ తెలుపనే లేదు. ప్రధానమంత్రి నెహ్రూను కలుసుకున్నప్పుడు సైతం చైనా ప్రధాని చౌ-ఎన్-లై 1684 లో సంధి జరిగిందని అంగీకరించారు. చౌ-ఎన్-లై ప్రకటనకు తప్పు భాష్యం చెప్పబడిందని అదే ఏడాదిలో ఆ తరువాత చైనా అధికారులు చెప్పారు. కాని ఆయన ప్రకటనకు ఎలా తప్పుడు భాష్యం యివ్వబడిందో వారు చెప్పలేదు.

1842 నాటి సంధి నిర్ద్వంద్వ సంధి మాత్రమే అని చైనా అధికారులు వాదించారు. కాని, నిర్ద్వంద్వ సంధి జరిగింది అంటేనే సరిహద్దు స్థిరపడింది అని అర్థం కదా. 1842 నాటి సంధిలో సరిహద్దును గురించి నిర్దిష్టంగా ప్రస్తావించబడలేదంటే, ఆ సరిహద్దు విషయం యిదివరకే పరిష్కృత మవడమే అందుకు కారణం.

## చైనా వాదాన్ని బలపరచని పటాలు తప్పుడు పటాలు?

సరియైన సంప్రదాయసిద్ధ సరిహద్దును చూపే అనధికార చైనా నైసర్గిక పటాలను కూడా భారతీయ బృందం ఆధారంగా చూపింది. కాని అవి 'పాతవి', 'మొదటివి' అని చైనా అధికారులు వాటిని తీసి పారేశారు. ఈ విషయంలోకూడా వారి వాదం నిలకడగా లేదు. చైనీయులు కూడా పాతకాలపు కొన్ని చైనా పటాలను చూపారు. ఆ పటాల ఆధారంతోనే భారతీయ బృందం సంప్రదాయ సిద్ధమైన భారత సరిహద్దును నిరూపించగలిగారు.

ఇతర దేశాలకు చెందిన నిష్పాక్షికులైన పండితులు గీసిన దేశపటాలలోని భారత, చైనా సరిహద్దు రేఖను సైతం వారు అధికారికమని స్వీకరించ అంగీకరించ లేదు. నిజానికి చైనా అధికారులే ఆ పటాలను తమ అధికార వ్యవహారాలలో శతాబ్దాలుగా ఉపయోగిస్తూ వచ్చారు.

చైనా వాదానికి అవి మద్దతు యివ్వనందున చైనీయులు వాటిని పరిగణించ నిరాకరించారు.

ఇతర ప్రాంతాల మాట దేముడెరుగు, కనీసం అక్సాయ్‌చిన్ ప్రాంతంలో తమ పాలన వుందని నిరూపించుకునేందుకు కూడా చైనా అధికారులు 1960 లో జరిగిన ఉభయ దేశాల ప్రభుత్వ ప్రతినిధుల సంభాషణలలో ఏ విధమైన ఆధారమూ చూపలేక పోయారు.

భారతీయాధికారులు తమ వాదానికి ఆధారంగా రెవిన్యూ పత్రాలతో సహా విస్తారమైన లిఖితపూర్వక సాక్ష్యాన్ని చైనా అధికారుల ముందుంచారు. తమకు ఇరకాటంగా వున్నప్పుడు చైనీయులు ఎంత బలవత్తరమైన సాక్ష్యాధారాన్నీ త్రోసి పుచ్చుతారు.

సంభాషణలలో వారు నెగ్గలేక పోవడంతో, వారు మొదట్లో చాటుమాటు దురాక్రమణకూ, ఆ తరువాత భారీ యెత్తు దాడికీ పూనుకున్నారు. తరువాతి సంఘటనలు సర్వులకూ విదితమే. ★

# గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

*1962 నవంబరులో తెలంగాణా సర్కిలులోని దిగువ గ్రామాలకు విద్యుత్ సౌకర్యాలు చేకూర్చారు :—*

1. గున్‌గల్ (ఇబ్రహీంపట్నం తాలూకా); 2. యాచారం (ఇబ్రహీంపట్నం తాలూకా), దోమకొండ (కామారెడ్డి తాలూకా); ముత్యంపేట (కామారెడ్డి తాలూకా); బ్రాహ్మణపల్లి (భువనగిరి తాలూకా).

ఈ నెలలో విజయవాడ సర్కిలులోని ఈ క్రింద పేర్కొన్న గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరాచేశారు :— 1. కందుకూరు తాలూకా పాకాల; 2. కొవ్వూరు తాలూకా పెనుబల్లి; 3. కొవ్వూరుతాలూకా కల్యాకగల్లు; 4. గూడూరుతాలూకా బల్లవానిపాలెం.

అనంతపురం జిల్లా రాయదుర్గం తాలూకాలోని ఉద్దిహాల్ గ్రామానికి ఇదే నెలలో విద్యుత్ సౌకర్యం ఏర్పడింది.

కడపజిల్లా, ప్రొద్దుటూరు తాలూకాలోని కమనూరు గ్రామానికి కూడా ఈ నెలలోనే విద్యుచ్ఛక్తి లభించింది. ★

## మీ సంపూర్ణ

# సహకారం కావాలి!

మనతో మిత్రత్వం నటించిన దేశం మనకు ప్రమాదం కలిగించింది. అందువల్ల, శాంతి కాలంలోకంటే ఇప్పుడు మనకు ఎంతో మంది సైనికులు అవసరం. మన సైన్యాన్ని, విమాన దళాన్ని విస్తృతపరచే కార్యక్రమం చురుకుగా కొనసాగుతున్నది. జవానులు, సైనికాధికారులకు బాసటగా మన సైన్యానికి ఆయుధాల్ని సక్రమస్థితితో ఉంచడం, వాహనాలను నడపడం, సిగ్నల్సు పంపడం, వాటిని స్వీకరించడం, వంతెనలు రోడ్లునిర్మించడం వంటిపనులు తెలిసిన మెకానిక్‌లు, సాంకేతిక నిపుణులు ఇంజినీర్లుకూడా అవసరమవుతారు. కనుక దేహదార్ఢ్యంగల ప్రతి యువకుడూ యుద్ధ సైనికునిగానో లేక విమాన దళంలోనో చేరవచ్చు. శిక్షణపొందిన మెకానిక్‌లు, టెక్నీషియన్లు ప్రతియొక్కరూ సాయుధ దళాల్లో చేరాలి.

రక్షణ సైన్యాలకు డాక్టర్లు, నర్సులు, మెడికల్ అటెండెంట్లుకూడా అవసరమే. పురుషులతోపాటు స్త్రీలుకూడా ఇందులో చేరడానికి అర్హులు. మాతృ దేశరక్షణకై సేవ చేయడానికి దేశభక్తిగల యువతులకు ఇదొక గొప్ప అవకాశం కల్పిస్తున్నది.

సైన్యంలో చేరడానికి మన ప్రజలు చాలమంది అధికోత్సాహంతో ముందుకు వస్తున్నారు. చైనాదాడి ఆరంభమైనప్పటినుంచీ దేశమంతటా రిక్రూట్‌మెంటు ఆఫీసులు యాత్రాస్థలాల్లాగా కన్పించసాగాయి. రిక్రూట్‌మెంటు కార్యక్రమం ఉధృతంగా కొనసాగేట్లు చేయడమే మీ కర్తవ్యం.

పదాతి, విమాన, నౌకాదళాలేగాక ద్వితీయ శ్రేణిరక్షణ సైన్యమనేది మరొకటి వుంది. ఇందులో రెండు ప్రత్యేకమైన సంస్థలు — ప్రాంతీయ సైన్యం, లోక సహాయక సేన అనేవి—వున్నాయి. ఇందులో చేరిన సభ్యులు తుపాకులు ప్రేల్చడంలోను, ఇతర రక్షణ విధులను నిర్వర్తించడంలోను సుశిక్షితులై వుంటారు. రెగ్యులర్ సైనిక దళాలు, ఈ ద్వితీయశ్రేణి రక్షణ దళాల నుంచి సైనికులను తీసుకొంటాయి.

అత్యవసర పరిస్థితుల్లో దేశానికి సేవ చేయడానికై మన యువకులకు సైనిక శిక్షణ ఇచ్చే అవకాశం కల్పించే ఉద్దేశంతో 1949 సం॥లో ప్రాంతీయ సైన్యం ఆరంభించబడింది. ఇందులో ఆర్టిలరీ, పదాతిసైన్యం, ఇంజనీర్లు, ఎలెక్ట్రికల్, మెకానికల్ ఇంజనీర్లు, సిగ్నల్స్, వైద్యుల దళాల యూనిట్లు వున్నాయి. తమ తమ వృత్తులను కొనసాగిస్తూ ఇందులో చేరేవారికి ఆరంభంలో గట్టి శిక్షణ ఇవ్వడం జరుగుతుంది. ఆ తర్వాత ప్రతి సంవత్సరం కొంతకాలం శిక్షణ ఇవ్వడం జరుగుతుంది.

ప్రాంతీయ సైన్యానికి సహాయకారిగా లోక సహాయక సేన అనేది ఆరంభించబడింది. 1955 వ సంవత్సరంనుంచి ఆరేండ్ల కాలంలో లోక సహాయక సేన పథకంక్రింద 6 లక్షలమందికి సైనిక శిక్షణ ఇవ్వడం జరిగింది.

### తొమ్మిది పౌర సంస్థలు

ఆధునిక యుద్ధపరిస్థితుల్లో యుద్ధ భూమిలో యుద్ధం చేయడం యెంత ప్రధానమో, పౌర రక్షణ, ఉత్పత్తి అనేవికూడా అంతే ప్రధానమైనవి. యుద్ధంచేసే జవానుకు వస్తుపరికరాలు తగినంతగా సరఫరా అవుతూండాలి. అంతేగాక పౌరులలో ధైర్యస్థాయి అత్యున్నతంగా వుండాలి. ఆత్మరక్షణావిధులలో పౌరులకు సక్రమమైన శిక్షణ యివ్వడానికి ప్రత్యేకంగా తొమ్మిది సంస్థలు ఏర్పాటు చేయబడుతున్నాయి. ప్రజల శక్త్యుత్సాహాల్ని సక్రమ మార్గంలో వినియోగించే ఆ సంస్థలు ఇవి :—

1. నేషనల్ వాలంటీర్ రైఫిల్స్
2. నేషనల్ కాడెట్ కోర్సు
3. పౌర రక్షణ సంస్థ
4. హోంగార్డ్సు
5. గ్రామీణ స్వచ్ఛంద దళాలు
6. రక్షణ శ్రామిక బ్యాంకు
7. మహిళా స్వచ్ఛంద దళాలు
8. స్వచ్ఛంద సేవాదళాలు
9. స్వచ్ఛంద రవాణా దళాలు

ఈ తొమ్మిది సంస్థల్లో దేనిలోఅయినా మీరు చేరవచ్చు. దృఢ కాయులైన భారత పౌరులు, పట్టణప్రాంతాల్లో గానీ, పల్లెప్రాంతాల్లో గాని సమర్థవంతంగా దేశ సేవచేయడానికి ఈ సంస్థలు ఒక మహా దవకాశాన్ని కల్పిస్తాయి. ఇందుకొరకై దేశమంతటా నెలకొల్పబడనున్న కార్యాలయాల్లో మీ

పేర్లను నమోదు చేయించుకొండి. ప్రతి సంస్థలో జరిగే కార్యకలాపాలు క్లుప్తంగా ఇందు పొందుపరచబడి వున్నాయి.

*1. నేషనల్ వాలంటీర్ రైఫిల్స్ :* జాతీయ రక్షణ దళాలకు సహాయ కారిగా వుంటుంది. 18 నుంచి 35 ఏండ్ల వయస్సు గల స్త్రీలు, పురుషులు ఈ సంస్థలో చేరి, రక్షణ కార్యకలాపాలకు సంబంధించిన వివిధ పనులలో శిక్షణ పొందవచ్చు.

*2. నేషనల్ కాడెట్ కోర్సు :* కాలేజీ విద్యార్థులకు సైనిక, నౌకా, విమాన దళాలకు సంబంధించిన విధులు నిర్వర్తించడానికి శిక్షణ ఇస్తుంది. 1962 జనవరి 1 వ తేది నాటికి యన్. సి. సి. లో 3 లక్షల మంది చేరారు. ఇందులో బాలికల సంఖ్య 33,000. ఇంతేగాక ఎన్.సి.సి. రైఫిల్స్‌లో 27,000 మంది కేడెట్లు, సహాయక కేడెట్ కోర్సులో 12 లక్షల మంది కేడెట్లు వున్నారు. ఎన్. సి. సి., ఎన్.సి.సి. రైఫిల్స్‌లో ఇంకా చాలా మందిని చేర్చుకోవడం జరుగుతున్నది. దీనికి తోడుగా జాతీయ క్రమశిక్షణా పథకం క్రింద హైస్కూలు విద్యార్థులకు క్రమశిక్షణ విషయంలో తగు తర్ఫీదు ఇవ్వడం జరుగుతుంది. దేశంలో హైస్కూలు విద్యార్థులందరికీ నిర్బంధంగా ఈ శిక్షణ ఇవ్వబడుతుంది. 11 ఏండ్ల వయస్సు నుంచి 21 వ యేడువరకు ఈ పదేండ్ల కాలంలో ప్రతి విద్యార్థి నిరవధికంగా యేదో ఒక విధంగా సైనిక శిక్షణ పొందుతాడు.

*3. పౌర రక్షణ సంస్థ :* అగ్ని ప్రమాదాల్ని నివారించడం, అగ్ని ప్రమాదాల నుంచి కాపాడడం, ప్రథమ చికిత్స చేయడం మున్నగు విధులను ఈ సంస్థ నిర్వహిస్తుంది. విమాన దాడులనుంచి రక్షణ (ఏ. ఆర్. పి.) చర్యలు అవసరమయ్యే పట్టణాల్లో, అక్కడి జనాభాలో నూటికి నల్గురు చొప్పున ఇందులో చేరాల్సి వుంటుంది. ఏ. ఆర్. పి. సంస్థలలో ముఖ్యంగా 18 నుంచి 50 ఏండ్ల మధ్య వయస్సుగల వాలంటీర్లు పనిచేస్తారు.

*4. హోం గార్డ్సు :* ఈ అనధికార సంస్థ రాష్ట్రాల్లో చాలా సంవత్సరాలుగా పని చేస్తున్నది. పరిస్థితులు విషమించిన చోట్లలో శాంతి భద్రతలు నెలకొల్పడంలో పోలీసు వారికి తోడ్పడటంలో ప్రశంసనీయ మైన కృషి చేస్తున్నది. ప్రస్తుతం, భద్రతా చర్యల్ని పటిష్ఠంగా అమలు పరచే బాధ్యత కూడా హోం గార్డ్సు పైనవుంది. మొత్తం మీద 15 నుంచి 20 లక్షల మందిని హోం గార్డులుగా చేర్చుకోవాలని సంకల్పం.

*5. గ్రామీణ స్వచ్ఛంద దళాలు :* సామాజికాభివృద్ధి, పంచాయతీ రాజ్, సహకార మంత్రిత్వశాఖ తమ అధీనంలో వున్న పంచాయతీ సంఘాల ద్వారా దేశమంతటా గ్రామాలన్నింటిలో ఇలాంటి సంస్థల ఏర్పాటును ప్రోత్సహిస్తుంది. దేశమొత్తం మీద ఇప్పుడు 203,000 పంచాయతీలు, 212,000 గ్రామీణ సహకార సంస్థలు, 5,200 బ్లాకులు వున్నాయి. వాటిల్లో 10 లక్షల సిబ్బంది పనిచేస్తున్నది. వీరుగాక 30 నుంచి 40 లక్షల వరకు అనధికార సభ్యులు, మరో 40 లక్షల వరకు గ్రామ సహాయకులూ పని చేస్తున్నారు. గ్రామీణ స్వచ్ఛంద దళాల్లో దృఢకాయులైన వారందరూ చేరుతారు. గ్రామ రక్షణ, ఉత్పత్తి, విద్యా వ్యాప్తి – ఈ మూడు రంగాల్లో కృషి చేస్తుంది. గ్రామాల్లోని మహిళా మండలులు గ్రామీణ స్వచ్ఛంద దళాలలో స్త్రీల విభాగాన్ని ఏర్పాటు చేస్తాయి. రక్షణ కృషి కార్యక్రమాలకు తోడ్పడటమే గాక జవానుల కుటుంబాల యోగక్షేమాల్ని కూడా విచారిస్తుంటారు.

*6. రక్షణ శ్రామిక బ్యాంకు :–* దేశంలో అత్యవసరంగా జరుగవలసిన పనికై, నెలకు ఒకరోజు చొప్పున ఉచితంగా పనిచేయాలని గ్రామస్థు లందరూ కోరబడుతారు. అలా చేయలేని పక్షంలో, శ్రమకుబదులు డబ్బులైనా ఇవ్వవచ్చు. ఈ సంస్థకు దేశమంతటా సమీకరించేట్లయితే, సాలీనా రూ 300 కోట్ల విలువగలపని చేయగలదు.

*7. మహిళా స్వచ్ఛంద దళాలు :–* మోటారు నడపటం, టెలిఫోను ఆపరేషన్, వైర్‌లెస్ శిక్షణ, ప్రథమ చికిత్స, క్యాన్‌టీన్లు నడపడం వగైరా బాధ్యతలు నిర్వహించడానికి మహిళా స్వచ్ఛంద సేవకులను ఈ సంస్థ ఏర్పాటు చేస్తుంది.

*8. స్వచ్ఛంద సేవాసంస్థ :–* పౌరరక్షణ కృషికి తోడ్పడగలందులకై వృత్తి పనులలో నైపుణ్యంగలవారి సేవలను ఉపయోగించుకోవడానికి ఈ సంస్థ ప్రయత్నిస్తుంది. ఉదాహరణకు ఎ.ఆర్.పి. వాలంటీర్లకు శిక్షణ ఇచ్చేందుకూ, క్షతగాత్రులను చికిత్స చేయడానికీ మెడికల్ ప్రాక్టీషనర్లు అవసరమవుతారు. వివిధ స్వచ్ఛంద సేవలకు వ్యక్తులను ఎన్నుకోవడానికి డాక్టర్లు అవసరమవుతారు. జవానుల కుటుంబాలకు కూడా సహకార సహాయాలు అవసరమవుతాయి. ఈ విధుల నన్నిటినీ స్వచ్ఛంద సేవాసంస్థ నిర్వహిస్తుంది.

*9. స్వచ్ఛంద రవాణా దళాలు :–* అసాధారణ పరిస్థితుల్లో, అప్పుడప్పుడూ అవసరమయ్యే సందర్భాల్లోగానీ లేక పరిపూర్ణంగా గానీ తమ మోటారుబండ్లను అప్పగించడానికి అంగీకరించే వ్యక్తులు ఇందులో చేరివుంటారు.

దురాక్రమణ దారుని పారద్రోలటానికై, మీకుగల దృఢసంకల్పానికి కార్యరూపం కల్గించాలంటే ఈ తొమ్మిది సంస్థల్లో దేనిలో

నైనా చేరవచ్చు. ఇందులోచేరే సభ్యులు వయోజనులై వుండాలి. కనీసం ప్రైమరీ స్కూలు వరకైనా చదివివుండాలి. ఇవే వీరికుండవలసిన కనీస యోగ్యతలు. సైనిక దళాలు, పోలీసు, ప్రాంతీయ సైన్యం. సహాయకదళాలు, అగ్నిమాపక దళాల్లో చేరినవారు ఎవరుకూడా ఈ సంస్థల్లో చేరడానికి అర్హులుకారు. పౌరశిక్షణ కార్యకలాపాల్లో జరిగేపనులు సాధారణంగా జీత బత్తెములులేని గౌరవపనులై వుంటాయి. శిక్షణ పొందుతున్న కాలంలోకానీ, డ్యూటీలో వున్నప్పుడుకానీ నిర్ణీత అనుమతి లేనిదే సభ్యులెవ్వరు కూడా గైరుహాజరు కాకూడదు. ఈ సంస్థల్లో చేరే ప్రతి సభ్యుడూ, ఇతర ప్రభుత్వోద్యోగుల మాదిరిగానే రహస్యాలు మున్నగు వాటికి సంబంధించిన నియమావళిని ఖచ్చితంగా పాటించాలి. శిక్షణ పొందుతున్న కాలంలో, లేక డ్యూటీలో వున్నప్పుడు, వ్యక్తికిగానీ, లేక ఆస్తికిగానీ నష్టం కలిగితే నష్టపరిహారం చెల్లించబడుతుంది.

వ్యక్తులకు తోడుగా, మనదేశంలోవున్న సాంఘిక సంక్షేమ సంస్థలుకూడా ఈ కార్యకలాపాల్ని దేనినైనా ప్రత్యేకంగా కొనసాగించవచ్చు. మహిళాసంస్థలు, ముఖ్యంగా ప్రథమచికిత్స తరగతులు ఆరంభించవచ్చు. అనధికార సంస్థయైన నేషనల్ రైఫిల్ ట్రైనింగు సంస్థ, అనేక లక్షలమంది పౌరులకు రైఫిళ్ళ ఉపయోగించడం నేర్పడానికి సంకల్పించింది.

పైన పేర్కొన్న తొమ్మిది సంస్థలు చేసే కృషిని జాతీయ రక్షణ సంఘం, దాని అధీనంలో వున్న పౌరసంబంధాల సంఘం ద్వారా సమన్వయం చేస్తుంది. జాతీయ రక్షణ సంఘంలో కేంద్ర ప్రభుత్వంలోని సీనియర్ మంత్రులు, నౌకా, విమాన, పదాతిదళాల ఉన్నతాధికారులు, కొన్నిరాష్ట్రాల ముఖ్య మంత్రులు, రక్షణ, ఉత్పత్తి విషయాల్లో, ప్రజ్ఞానుభవంగల ప్రముఖ పౌరులు కొంత మంది సభ్యులుగావున్నారు. మన ప్రధాన మంత్రి ఈ సంఘానికి అధ్యక్షులు, పౌర సంబంధాల సంఘానికి కేంద్ర ప్రభుత్వ హోంమంత్రి అధ్యక్షులు,

*పౌర సంఘం:* జాతీయ రక్షణ సంఘమేగాక రక్షణ కృషిలో పాల్గొను ప్రజల కార్యకలాపాలను సమన్వయ పరచడానికి మరొక సంస్థ కేంద్ర పౌరసంఘం అనేది ఒకటి పని చేస్తున్నది. ఇందులో కేవలం అనధికారులే సభ్యులుగా వున్నారు. రాష్ట్రం, జిల్లా, లేక పట్టణంలో ఏర్పడే పౌర సంఘాలకు మార్గదర్శకత్వం వహిస్తుంది. పట్టణాల్లో, నగరాల్లో అయితే, మేయరుకానీ, మునిసిపల్ అధ్యక్షులుగానీ ఈ సంఘాలకు అధిపతులుగా వ్యవహరిస్తారు. జిల్లాల్లో అయితే, కలెక్టర్లు అధ్యక్షత వహిస్తారు.

అఖిల పక్షప్రాతిపదికపైన ఏర్పడిన ఈ ప్రజాసంస్థల ప్రధాన విధులు ఇవి :— అధికోత్పత్తి సాధనకై సాయపడడం, జాతీయ రక్షణనిధి, రక్షణ ఋణపత్రాలకు విరాళాలు సేకరించడం, పైన పేర్కొన్న తొమ్మిది సంస్థలలో చేరడానికి ప్రజలను ప్రోత్సహించడం, పౌర రక్షణ ఏర్పాట్లతో సహకరించడానికి ప్రజలకు నచ్చజెప్పడం, ధైర్య స్థైర్యాల్ని ఉన్నత స్థాయిలో వుంచడానికి కృషిచేయడం, పోకిరి పుకార్లను అరికట్టడం, సరుకులను దాచిపెట్టడాన్ని, అధిక లాభాలను ఆర్జించడాన్ని నిరోధించడం, పొదుపరితనానికి తగిన పరిస్థితుల్ని కల్పించడం.



# "వందేమాతరం"

సరిహద్దు ప్రాంతంలోని భారత వీరుల ధైర్య స్థైర్యాలను ప్రతిబింబించే ఏకాంక నాటిక.

రచయిత: గొల్లపూడి మారుతీరావు

వెల: ఒక రూపాయి.

ప్రతులకు: సమాచార కేంద్రం,

సమాచార పౌరసంబంధాల శాఖ, ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు.

కథానిక :

# దేశరక్షణకై...

యం. వి. రావు

అబ్బా! రాత్రి పదిగంటలయ్యింది. యింకా యెన్నిరోజులు ఈ విధంగా యీ గుడారంలో గడపాలో!... హుఁ ఒళ్ళు పేలిపోతోంది. డాక్టరు యింకారాలేదు. యెప్పుడు మళ్ళీమామూలు వీరుడుగా తిరిగి చెలరేగుతానో! యింకా యెన్ని రోజులకి పోరాడి విజయ గర్వంతో గృహోన్ముఖుడనవుతానో! త్వరగా ఆరోగ్యం చేకూరుతే బాగుండును. అబ్బ! డాక్టర్ యింకారాలేదు. పాపం! ఆలస్యమవుతుంది! వాళ్ళేంచేస్తారు. పురుగనక, పుట్టనక, కొండనక, కోననక వేలకు వేల మైళ్లవచ్చి తమ్ముతాము రక్షించుకుంటూ మా సైనికుల్ని రక్షించడానికి యీ డాక్టర్లంతా యెంత శ్రమ పడుతున్నారు! రాత్రనక, పగలనక మాపట్ల ఎంత శ్రద్ధ తీసుకుంటున్నారు. నా బాధకొద్దీ నే ననుకోడం తప్ప డాక్టర్లు యెవరికో ఒకరికి ప్రాణ ప్రదానంచేసే సేవలో నిమగ్నమై ఉన్నారే కాని విశ్రాంతిగా ఎక్కడ కూచున్నారు? నోరుచేదుగా ఉంది. వుసిరికాయ పచ్చడి వుంటే బాగుండును. ఎట్లా? యెక్కడ నుంచి వస్తుంది? అని స్వగతంగా అనుకుంటూ పడుకున్నాడు రామం.

రాత్రి 12 గం॥లు అయింది. డాక్టరు కుమారి ఒకొక్క సైనికుడిని చూస్తూ వస్తోంది. ఆ సైనికులంతా 43 కోట్ల భారతీయుల స్వాతంత్ర్య రక్షణకోసం, పెళ్ళాం బిడ్డలను, తల్లిదండ్రులను అక్కచెల్లెళ్ళను, అన్నదమ్ములను వదిలి, ప్రాణాలకు తెగించి చైనీయులను ఎదురుదెబ్బ కొట్టడానికి కదనరంగంలోదూకి వారితో పోరాడి, కొందరు తీవ్రమైన గాయాలతో తేజ్‌పూర్‌కు 100 మైళ్ళ దూరాన 14 వేల అడుగుల ఎత్తున వున్న కొండలమీద గుడారాలలో ఉన్నారు.

యింతలో డాక్టరు కుమారిని "మిస్ కుమారిగారు" అంటూ కేక వేశాడు రామం. ఆవిడ గబగబా వచ్చింది ఏమైనా జరిగిందేమోనన్న ఆతురతతో.

"వాట్! రామం ఎట్లావుంది?" అంటూ థర్మామీటరు రామంనోట్లో పెట్టింది. టెంపరెచరు చూడటానికి.

"వెరీగుడ్! రామం! నీకు 100 డిగ్రీల జ్వరం,చాలా తొందరగా కోలుకుంటున్నావు. మీరు ఎక్కువ ఆలోచించకండి: ఆలోచించడం కాని, ఉద్రేక పడటంకాని జరిగితే మీరు త్వరలో కోలుకోలేరు! ఆ!... అన్నట్లు మరిచిపోయాను. మీరు యిందాక ఎందుకు పిల్చారు? ఆ సంగతి అడగటమే మరచి పోయా!... అంటూ మిస్‌కుమారి ఒక చిన్న స్టూలు తెచ్చుకుని రామం బెడ్ ప్రక్కనే కూర్చుంది.

"కుమారిగారూ! మీరు తెలుగువారా? మరేమీలేదు మీరు తెలుగువారైతే..." అంటూ మాట మింగేశాడు రామం.

"ఆఁ తెలుగు వారైతే! ఏమిటి? అంటూ ఆశ్చర్యంగా చూసింది రామం వంక తాను తెలుగుదేశంనుండి వచ్చినట్లు ఎట్లా తెలుసా అని.

''ఆఁ ఏమీలేదు. వుసిరికాయ పచ్చడి తినాలని వుందండి. మీరు తెలుగువారు కదా! మీ దగ్గర ఏమైనా వుందేమోనని" అంటూ మెల్లిగా అడిగాడు రామం.

"రామంగారూ! మీకు యిక్కడ వుసిరికాయ పచ్చడి చేయాలన్నా కాయలు దొరకవు కదండీ! ఎట్లా?''—

"ఒక చిన్న స్పూను పచ్చడి చాలండి... నోరు చాలా చేదుగావుంది. పోనీ నిమ్మకాయ అయినాసరే...'' అని అడిగాడు రామం.

"భలేవారే! మొత్తానికి! యుద్ధరంగంలో మీకు వుసిరికాయ పచ్చడి ఎట్లా వస్తుందనుకున్నారు? అయినా మీరు 10 రోజులు బట్టి జ్వరంతో వుండి! మన వూరగాయల మీద మనసు పోతోందే! సరే! ఒక క్షణం ఆగండి! గంటక్రితమే హెలికాప్టరులో సప్లైలు వచ్చాయి. అందులో రెండుడబ్బాలు హైదరాబాదునుండి బహుమతిగా వచ్చాయి చూస్తాను'' అంటూ డాక్టరు కుమారి చకచకా ప్రక్క గుడారంలోకి వెళ్ళింది. పదినిమిషాలలో ఒక డబ్బాతో ప్రత్యక్ష మయింది. దానిమీద ''ఊరగాయలు — మా కొరకు మరియు మా పిల్లల రక్షణకొరకు ప్రాణాలకు తెగించి పోరాడుతున్న వీరులకు —

ఆంధ్ర ప్రజల కానుక" అని ఎర్రటి సీరాతో వ్రాసివుంది.

"రామంగారూ! నాకు దీనిమీద మూత రావడంలేదు ఎట్లా?" అంటూ రామం ముందరపెట్టింది ఆడబ్బా—.

ఎట్లాగైతే నేం అయిదు నిమిషాలలో యిద్దరూకలిసి మూత తీశారు.

"అరే! దేవుడల్లే పంపాడు మనకు వుసిరికాయ, నిమ్మకాయ పచ్చళ్ళు యిదుగో ఒక్కస్పూనే తీసుకొండి—ఎక్కువ తినడం మంచిది కాదంటూ'' కుమారి ఒకచే స్పూను వుసిరికాయ పచ్చడియిచ్చి, ఆడబ్బా మరల ప్రక్క గుడారంలో పెట్టివచ్చి మరల స్టూలుమీదే రామానికి దగ్గరగా కూర్చుని ఆలోచిస్తోంది.

"ఏమిటి కుమారిగారు! ఎంతో దీర్ఘంగా ఆలోచిస్తున్నారు. నేనుకూడా భాగం పంచు కోవచ్చా!''

"అబ్బే ఏమీలేదండి ... యీ పోరాటం మనకూ, చైనీయులకు ఎంతకాలం సాగుతుందీ అని...రామంగారూ. మనం యింత దూరానా. యిటువంటి కొండలమీద యీ గుడారాలలోపడి వున్నాంగదా! ప్రజలు మనల్ని ఒక్కసారైనా తలుస్తారంటారా!... ఏమండీ! యుద్ధం జరిగేటప్పుడు మీకు యింతవరకు మరువలేని సంఘటన ఏమైనా వుంటే చెప్పండి...నాకు యింకా నిద్ర రావడంలేదు...'' అంటూ స్టూలు యింకా దగ్గరగా లాక్కుంది డాక్టరు కుమారి.

"అది అక్టోబరు 21 వ తేదీ! రాత్రి 12 గం॥లు దాటింది, తెగమంచు కురుస్తోంది. వాతావరణం జీరోకు 20 డిగ్రీలు కంటే యింకా తక్కువగానే వుంది. వైర్లెస్‌లో హెచ్చరిక వచ్చింది మా పైస్థావరం నుండి. ''అక్కడ చైనీయులు టాంకులతో తిరుగుతున్నారుట...ఏ క్షణంలోనైనా పోరాటం ప్రారంభం కావచ్చు. తొందరగా వీలుఅయినన్ని ఆయుధాలు తీసుకురండి'' అంటూ! మాదగ్గర ఎక్కువ లేవు. ఎందుకంటే అప్పటికి రెండురోజుల క్రిందట మా స్థావరానికి హెలికాప్టరులో ఆయుధాలు వస్తూండగా చైనీయులు దానిమీద కాల్పులు జరపడంతో అది వెనక్కుతిరిగి వెళ్ళిపోవలసి వచ్చింది. మాకు తిండికూడా లేదు. అప్పటికి రెండురోజుల నుండి. ఆకలి ఒక ప్రక్క, రెండవప్రక్క హెచ్చరిక, ఆరు మైళ్లు నడవాలి యీ ఆయుధాల పెట్టెలు నెత్తిమీద పెట్టుకుని. ఆ ఆరు మైళ్ళలో రెండు కొండలు దాటి మహారణ్యాలగుండా పడిపోవాలి, మాకు ఒక్క మైలుకూడా నడచే ఓపికలేదు యీ ఆయుధాల పెట్టెలతో. యింతలో హెలికాప్టరు శబ్దం దూరంగా వినబడింది. కానీ, దాని లైట్లు కనబడటం లేదు. అది మాదో లేక శతృవులదో తెలియదు. వైర్లెస్‌లో సాంకేతిక భాషలో ఆ హెలికాప్టరు నుండి సమాచారం వచ్చింది. అందులో 10 పెట్టెల ఆయుధాలు, 10 పెట్టెల తిండి పదార్థాలు, 3 బహుమతి పెట్టెలు వున్నాయి అంటూ మమ్మల్ని సమీపించింది. యింతలో నెమ్మదిగా ఒక్కొక్కటే 23 పెట్టెలు దింపింది. తిరిగి వెళ్ళిపోయింది ఒక గంటలో! రాత్రి 2 గం॥ లు. అంత అర్ధరాత్రి లైట్లు లేకుండా, టార్చి లైటు సహాయంతో యిరవై మైళ్ళు కొండలు, లోయలు, మహారణ్యాలు మధ్యగా, నడుపించుకు వస్తున్నాడుట అతను. అతను బయలుదేరినప్పుడే లైట్లు లేవుట. కాని ధైర్యంతో వచ్చాడు ఆ పైలట్; యింతలో మళ్ళీ మా పైస్థావరంనుండి వైర్లెసులో తొందరగా రండంటూ వచ్చింది వార్త. తిండి తినడానికికూడా టైములేదు. వెంటనే ఒక బహుమతి డబ్బా పగలకొట్టాం. దాని నిండా చాకెలెట్లు, సిగరెట్లు, స్వీట్లు వున్నాయి. ఎవరికి కావలసినవి వాళ్ళు జేబులునిండా కుక్కుకుని పెట్టెలు భుజాన వేసుకుని బయలుదేరాం. అప్పుడు మా సంతోషానికి హద్దులు లేవు. ఒక గంట క్రితం ఒక్క మైలు నడవడానికి ఓపికలేదు. కానీ ఆ బహుమతులు మా కోసం ప్రజలు పంపారు, ఎంతో ప్రేమతో, ఆ సంతోషంలో, ఆ ఆనందంలో ఎక్కడలేని శక్తి వచ్చింది. మాకే ఆశ్చర్యం వేసింది. నడవవలసిన ఆరుమైళ్లు 3.30 అయ్యేటప్పటికి చేరాం. మా పైస్థావరానికి, వాళ్ళకు వారం రోజులనుండి తిండి లేదు. కారణం, అక్కడ వాతావరణంలో విమానాలు వెళ్ళలేవు. అక్కడ వున్నది ముప్పైమంది మాత్రమే, మేము వున్నది ముప్పై. గబగబా తిండి పదార్థాలు వున్న డబ్బాలు పగలగొట్టి అందరం పంచుకున్నాం. నెమ్మదిగా కూర్చుని తింటున్నాం. కానీ యింతలోనే చైనీయులు సుమారు ఒక వేయిమంది, ఆటోమాటిక్ ఆయుధాలతో మా పైకి వస్తున్నారు. అది ఒక లోయ. ఒక మైలు దూరం వెనక్కి మాలో ముప్పైమందిని పంపి మేము ఆ అరణ్యంలో దాక్కుని వున్నాం. వాళ్లు మమ్మల్ని దాటి ముందుకు పోయారు. యింతలో మైలు దూరాన వున్న మావాళ్ళు నిలద్రొక్కుకుని, ట్రెంచెస్‌లో నుండి ఆటోమాటిక్ ఆయుధాలతో తీవ్రంగా ఎదురు కాల్పులు జరుపుతున్నారు. మేము వున్నది సరిగ్గా ముప్పైమంది. నోటినిండా చాకెలెట్లు నింపుకుని, స్వీట్లు తిని శత్రుసైనికుల వెనుకవైపు నుండి మా శక్తికొలది ఆపకుండా అగ్నివర్షం కురుపిస్తూ ముందుకు పోతున్నాం. శతృసైనికులకు ముందునుండి, వెనకవైపునుండి మేము అగ్నివర్షం కురుపిస్తూంటే—వాళ్ళు నిలద్రొక్కుకోలేక పోయారు. ఆ విధంగా

సుమారు నాలుగు గంటలు పోరాటం జరిగింది. సుమారు, 800 వందల మంది చైనీయులు చనిపోయారు. మిగితా రెండువందల మంది లొంగిపోయారు. వాళ్లు లొంగారని తెలియగానే మేము మా ట్రెంచెస్‌లో నుండి బయటకు వచ్చి వాళ్ళను బంధించడానికి వెళ్తున్నాము. యింతలో ఒక చైనీయుడు నామీద తుపాకి కాల్చి తప్పించుకు పారిపోయాడు. అదే పదిరోజుల క్రిందట మీరు నా తొడలోనుండి తీసిన తుపాకిగుండు...యిది నేను జీవితంలో మరువలేని సంఘటన..."

"రామంగారూ! మీరు వున్నది అరవై మంది కదా! అందులో వారంరోజుల నుండి సరిగ్గా తిండికూడా లేదు కదా! మరి వాళ్లను చూడగానే అధైర్యం వేయలేదుటండీ!"...

"మాకు అంతకు కొన్ని గంటల క్రితమే స్వీట్లు వచ్చాయి కదండీ!—అవి మాకు ప్రజలు ప్రేమతో పంపినవి కదండీ! ప్రేమతో ప్రజలు మాకుపంపారని తెలియగానే మాకు ఎక్కడలేని శక్తి వచ్చింది. ఉత్సాహం, సంతోషంవుంటే, ఎన్ని గంటలు పోరాడినా అలసట అనిపించదు—ఒక్కటేగుర్తుపెట్టుకోండి: మేము రాత్రింబగళ్లు పోరాడి వుంటామా! అప్పుడు ఎక్కడలేని నిస్పృహ, నిరాశ వస్తాయి. ఏదైనా కాస్త శక్తి వున్నా అదికూడా పోతుంది. "మనం ప్రాణాలు ఒడ్డి పోరాడుతున్నామే! ప్రజల కోసం. కనీసం వాళ్ళు మనల్ని తలచనైనా తలుస్తారా! వాళ్ళకోసం మనం ఎందుకు పోరాడాలి, ప్రజలు విశ్వాస ఘాతకులుగా వ్యవహరిస్తుంటే! అని మనసు పరిపరి విధాల పోతుంది. అమితమైన ఆందోళనగా వుంటుంది — మాకొరకు ఎవరైనా బహుమతులు పంపుతారా! అంత నిస్పృహ, నిరాశ, ఆందోళన ఒక్క క్షణంలో పోతాయి. ఎక్కడలేని శక్తి, సంతోషం, ఆనందం వస్తుంది. నిజంగా ఆనాడు ఆ బహుమతి డబ్బాలు రాకుండా వుంటే అంత శక్తివంతంగా పోరాడేవారము కాదేమో! ఆ బహుమతులు మా శక్తిని మూడింతలు చేశాయి" అంటూ ఆవలించాడు రామం.

"మీకు నిద్ర వస్తున్నట్లుంది! హాయిగా పడుకొండి, 'గుడ్ నైట్'" అంటూ డాక్టరు కుమారి తన గుడారంలోకి వెళ్ళిపోయింది. ఆ మరునాడే రామం డిశ్చార్జ్ అయినాడు. డాక్టరు కుమారి, అతనికి ఒక మఫ్లరు, ఒక ట్రాన్సిస్టరు బహుమతిగా యిచ్చింది. రెట్టింపు శక్తితో మరల కదనరంగంలో దూకాడు రామం భారతదేశ రక్షణకై —



# మీ ప్రేమోత్సుకత

దుర్గమమైన హిమాలయ ప్రాంతంలో ఎన్నో కష్ట పరిస్థితులలో దేశసరిహద్దులను కాపాడుతున్న వీరులైన మనసైనికులు మీరు కానుకలుగా పంపే వెచ్చని బట్టలను ఎంతో గొప్పగా పరిగణిస్తారు.

ఈ క్రింది వస్తువులను పంపండి:

ఉన్ని బట్టలు, లోపల ధరించే బనీన్లు, డ్రాయర్లు, కేప్-కంఫర్టర్లు, స్కార్ఫ్స్, మేజోళ్ళు, గ్లోవ్స్, పుల్లోవర్లు దుప్పట్లు, కాటన్ పిల్లో-స్లిప్పులు (3′ × 1½′) (తెలుపు). నూలు పక్క-దుప్పట్లు (తెలుపు) 'పజమా' సూట్లు (తెలుపు)

శస్త్ర చికిత్స కుపయోగించే కాటన్, వూలు బాండేజీలు (బూడిద, వైమానికదళనీలం, ఖాకీ బీజ్, లేక ఇతర "న్యూట్రల్" రంగులలో వుంటే మంచిది).

ప్యాకెట్లలో వున్న వస్తువుల వివరాలను ప్యాకెట్లపై స్పష్టంగా తెలపాలి. వాటిని ఈ క్రింది చిరునామాకు రవాణా చార్జీలు చెల్లించి పంపాలి.

1. అడ్మినిస్ట్రేటివ్ కమాండెంట్, హెడ్‌క్వార్టర్స్, సికింద్రాబాద్ స్టేషన్, బొలారం.

లేక

2. స్టేషన్ కమాండర్, ఎయిర్ ఫోర్స్ స్టేషన్, బేగంపేట, హైదరాబాద్.

లేక

3. శ్రీ యం. హెచ్. కె. ఘజ్నవీ, గవర్నర్ సహాయ కార్యదర్శి, రాజభవన్, హైదరాబాద్.

# కమ్యూనిటీ రేడియో సెట్లు

1962 అక్టోబరులో దిగువ గ్రామాలు, సంస్థలలో కమ్యూనిటీ రేడియో సెట్లు నెలకొల్ప బడినవి :

నల్గొండ జిల్లా : హుజూర్ నగర్ తాలూకాలోని శ్రీరంగాపురం, కల్లూరు గ్రామాలు, సూర్యాపేట తాలూకా చందెగళ్ళ, పోలుమళ్ళ, మదిరిగల్, వట్టిఖమ్మంపహాడ్; నల్గొండ తాలూకా పలిపలపుల.

మహబూబ్‌నగర్ జిల్లా : కొల్లాపూర్ తాలూకా అంబటపల్లి, నర్సాపూర్ పంచాయతీ (నిమ్న జాతుల కొరకు), మహబూబ్‌నగర్ తాలూకా గార్లపహాడ్, కొల్లాపూర్ తాలూకా పస్పుల్ పంచాయతీ; బిజినపల్లి తాలూకా గోపాలపూర్ పంచాయతీ; గద్వాల తాలూకా పాలవాయ్ పంచాయతీ, కొల్లాపూర్ తాలూకా చెల్లపాడు (హెచ్/ఓ: మంచలకట్ట) (నిమ్నజాతుల కొరకు); అలంపురం తాలూకా పెద్దమామిడియాలపాడు పంచాయతీ.

కర్నూలు జిల్లా : మార్కాపురం తాలూకా ఇస్కత్రిపురం, మళ్ళపేట.

కడప జిల్లా : రాయచోటి తాలూకా పెద్దవీడు, ఒడివీడు, మడితాడు, కొలకుంట చెన్నమురెకపల్లి, నారాయణరెడ్డిపల్లి; పులివెందలతాలూకా సుంకేసల పంచాయతీ; పోలేపల్లి, ఎప్పట్ల, బుచ్చిపల్లి, తొండూరు; కడప తాలూకా ఇట్టపెంట్ల; కమలాపురం తాలూకా కొమ్మెడ్డి.

చిత్తూరు జిల్లా: పుంగనూరు తాలూకా యేటవాకలి, ఊలపాడు, మగండ్లపల్లి; మదనపల్లి తాలూకా భీమగానిపల్లి, బీరంగి, పులికట్ల, ఒయ్యప్పగాని పల్లి, పిచలవాండ్ల పల్లి, బసినికొండ, పంచలమర్రి, గంగిరెడ్డి పల్లి, పాపిపల్లె.

హైదరాబాదు జిల్లా : మేడ్చల్ తాలూకా అత్వెల్లి, దాలిపూర్, కొండెల్లి.

ఆదిలాబాదు జిల్లా : సిర్పూర్ తాలూకా చింతగూడ; ఆసిఫాబాదు తాలూకా వంకెడి, రేచిని.

నిజామాబాదు జిల్లా : బాన్స్‌వాడ తాలూకా దామరంచ; మద్నూర్ తాలూకా ఎక్లోర.

మెదక్ జిల్లా :- గాజోల్ తాలూకా తున్కిబొలారం; సంగారెడ్డి తాలూకా తొగసపల్లి; సిద్దిపేట తాలూకా ఘాటా.

వరంగల్ జిల్లా :- మహబూబాబాద్ తాలూకా వెలికట్టె; పరకాల తాలూకా నేరడుపల్లి.

కరీంనగర్ జిల్లా :- హుజూరాబాదు తాలూకా మామిళ్ళపల్లి; సుల్తానాబాదు తాలూకా రుంపికుంట; మంథని తాలూకా లక్కారం; జగిత్యాల తాలూకా కమలాపురం; సుల్తానాబాదుతాలూకా పాతగూడూరు; మారేడుపల్లి; సిర్సిల్లా తాలూకా అల్మాస్‌పురం.

శ్రీకాకుళం జిల్లా :- పార్వతీపురం తాలూకా తీరమామిడివలస;సాలూరుతాలూకా చెముడు; పాలకొండ తాలూకా పేటపాగు.

విశాఖపట్నం జిల్లా :- నర్సీపట్నం తాలూకా నాతవరం, పెదజగ్గంపేట.

తూర్పు గోదావరి జిల్లా :- రామచంద్రాపురం తాలూకా యెనమడల.

పశ్చిమ గోదావరి జిల్లా :- పోలవరం తాలూకా మైసనగూడెం, పట్టెమపాలెం, శ్రీనివాసపురం, వెంకట రమణగూడెం, ఏలూరు తాలూకా గుడివాకలంక (రెండవ సెట్టు కోమటిలంక గ్రామంలో స్థాపించబడినది).

కృష్ణా జిల్లా :- బందరు తాలూకా గురవిందగుంట; కైకలూరు తాలూకా కొర్రగుంటపాలెం—II.

గుంటూరు జిల్లా :- తెనాలి తాలూకా మోదుకూరు – III పంచాయతీ; ఈమని పంచాయతీ; గుంటూరు తాలూకా కాజా -III, పంచాయతీ చమళ్ళమూడి; తెనాలి తాలూకా చేబ్రోలు – V, పంచాయితీ చేబ్రోలు VI, పంచాయతీ, చేబ్రోలు VIII పంచాయతీ.

ఖమ్మం జిల్లా :- మధిర తాలూకా తాళ్ళపంట, రేజర్ల (అంజనైన్) వెంకటాపూల్, (హెచ్/ఓ: రాజుపాలెం); కొత్తగూడెం తాలూకా దమ్మపేట: మధిర తాలూకా తాళ్ళపంట, వంగవీడు, మిత్తపల్లి, గోకవరం.



# చైనా తిరోగతి

సి. వి. సుబ్బన్న

గగనోద్ఘృష్ట తుషారశేఖరము
గంగామంగళాంభః ప్రచా
ర గరీయః పటు జాట జూట
విలసత్ప్రాలేయ రుక్ఖండ స
మ్య గహీనాభరణుండు శంకరుఁడు
గేస్త్రైకాఁపురంబున్నచో
టు గణేయంబగు దేవతాత్మ
గిరి తట్టుంజేరె రతుస్తుతుల్.

పరమ నిర్వృతి వైభవస్ఫురిత వృత్తి
మురిసి స్వారాజ్య సౌఖ్యానుభూతి బెరసి
స్థిర సమాధి నిర్మగ్నుఁడై తేజరిల్లు
స్వామి శాంత గంభీర భావమును దలఁచి.

కవిసిన అంధ్యపుం బోరలఁ గన్నులు
నెత్తికి వచ్చి కొమ్ముశే
గ్ను వలెఁ జెలంగి, మంచుమలకున్
వెనుకం బడియున్న రక్కసుల్
బవర మొనంగి, యామికులఁ
బాఱఁగఁదోలి, శతఘ్నినాళికా
గ్ర వమదనర్గళాగ్ని విధురమ్ముగ
నార్చి పరాక్రమించినన్.

పరమంబైన ప్రశాంత భావమెడగా
ఫాలమ్మునం దాగ్నవి
స్ఫురణం బేర్పడి కన్బొమల్
ముడివడన్ జూచెన్ త్రిశూలాయుధుం

డరుదే స్వామి సమాధి భంగకలనా
వ్యగ్రస్వనం బే దెసన్
విరిసెన్ దద్దిశఁ జూచె నందియు
సమానీతాద్భుతాభ్యుద్ధతిన్.

మఱియును జూచె దృప్యదభిమాన
పురస్కృత హుంకృతి ప్రచం
డ రవ విధూత శార్వర గణాల్ప
వలాహక లేఖగాఁ జెవుల్
బోరిఁబొరినిక్క, గిట్టలను భూమి
చలింపఁగ నేల రాయుచున్
దిరుగుచుఁ గన్గెలంకుల
నుదీర్ణ మసృగ్రుచి బింక మొప్పఁగన్.

ఇంతలో మఱింత బలమ్మునేచి యొఱచి
దిండి మూక వికట హాస చండిమనెస
రేగి పై పై శతఘ్నులు ప్రేల్చి కొంచుఁ
గడచిరా నంత కంతకు గడుసుదేలి.

ఖర ఖుర పుట ఘట్టనములఁ
బరితః పరివల్గ దుగ్ర వాలాగ్రమునన్
దురితోద్యములన్ జమరుచుఁ
దిరుగం గొట్టుచును నంది తీండ్రించుటయున్.

శకయవన బర్బర పులిం
ద కిరాతాభీర ముఖ్య నానా విలయ
ప్రకట కృపీట భవాకృతు
లు కోటులు జనించి దిక్కులు గపల నడరెన్.

అడరిన విశ్వతోముఖ మహాయుధ
పాణి చమూసమూహాపుం
బొడవునుగాంచి, డొంకలను బొంచిన
దుర్జన సేన వెన్కకున్
నడచినదయ్యో, సుద్ధతి చనన్ దనయంత;
నదేమి చిత్రమో!
పడుట నిజంబకాదె మితిపట్టని
యుచ్ఛ్రియ భావ మందినన్.

భారత సంప్రదాయమును
భారత సంస్కృతి భారతేతర
స్ఫార జగత్ప్రపంచమునఁ
బ్రస్తుతి కెక్కుటఁ జూచి, పాళవా
చారులు కన్ను గుట్టి హిమశైల
తటమ్ములఁ బొంచిపొంచి మా
యా రజనీచరాళి కుహనాహవ
పద్ధతి దాడి వెట్టినన్.

వేణ్వంకూరము భంగి, భిన్న
పరితః పృథ్వీతలోద్వృత్తి రో
దోఽన్వాన్వంతర గాఢ ఘర్షణముగా
నాగ్నేయ శాఖాశిఖా
స్థాణ్వంచద్గతి రేగి, భారత
యుయుత్సారేఖ రణోజగ
త్కిణ్వప్రక్రియ మంచు తుంపురుల
మాడ్కింజూచి మా యింపదే!

అటులే నైనది నేటి యుద్ధ;
మిటుపై హైమాద్రి శృంగాగ్ర ని
ష్కుట నిద్రాణ హరీంద్ర కర్ణ
వివరస్ఫోట ప్రచండాకృతిన్
జటుహధ్వాన మెవండు సేసిన
జటాపాటల్యధారాజ్వల
చ్చటులత్క్ష్వేళ మొనర్చెడున్ ద్రిజగ
దాశ్చర్యైక దుర్వార్యభటిన్.

భువనమ్ముల్ ప్రళయావసానమున
నంభోమగ్నముల్ గా, నతం
ద్ర విభూతిన్ శివురాణివాసము
పవిత్రాఘ్నాఖురన్యాసవై
భవ దూరీకృత విఘ్న, నిఘ్న
శుభలాభస్ఫూర్తి కాశీపుర
ప్రవరంబొప్పెడి భారతక్షితి
సుపర్వస్తుత్యమై నిల్చెడున్.

తగ్గిన యట్లు తగ్గి భయదక్రియ
నొక్కమొగిన్ బయిన్ బడన్.
మ్రొగ్గిన మ్రొగ్గవచ్చు నల
మ్రుక్కిడి మూక లటంచు నంది పి
ప్పగ్గిరి కూట సానుతట
సంతత రక్షణ తత్పరాత్ముఁడై
అగ్గిని పుక్కిలించు ప్రమథావళిఁ
గావలి పెట్టె నల్లడన్.

అదిగో! భారత ధర్మరక్షణ
కళా వ్యాపార దీక్షానము
ద్యుదితోద్యోగులు పౌరు లెల్ల
రభితోవ్యూహప్రకీర్ణారి గూ
ఢ వృథా యోధన నిత్య సన్నహన
మీడంబోక పోరాడియై
నఁ దెగందీయఁగ శస్త్రపాణులయి
యున్నా రుగ్ర జాగ్రత్స్వరన్.

# పారిశ్రామిక విశేషాలు

## రాష్ట్రరంగం

రాష్ట్రంలో హెచ్. టి., ఎల్. టి. ఇన్సులేటర్లను ఉత్పత్తి చేసేనిమిత్తం కొత్త సంస్థ నొకదానిని స్థాపించడానికి ఆంధ్ర ప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి కార్పొరేషనుకు భారత ప్రభుత్వం లైసెన్సు మంజూరు చేసింది.

## పబ్లిక్ రంగం

*సింగరేణి కాలరీస్ కంపెనీ లిమిటెడ్ :* సింగరేణి కంపెనీకి చెందిన బొగ్గు గనుల నుంచి 1962 నవంబరులో 2,95,101 టన్నుల బొగ్గును త్రవ్వి తీశారు. అంత క్రితం నెలలో వీటినుంచి 2,74,265 టన్నుల బొగ్గును వెలికి తీయడం జరిగింది.

1962 నవంబరు మాసాంతం నాటికి ఈ గనులనుంచి మొత్తం 28,19,520 టన్నుల బొగ్గు తీయడం జరిగింది. కాగా క్రిందటి సంవత్సరం ఇదే కాలంలో 25,15,350 టన్నుల బొగ్గు లభించింది.

యెల్లందు కాలరీలవద్ద ముదంపల్లి ప్రాంతంలో నవంబరు 14 వ తేదీన "జవహర్ ఖని'' అనే కొత్త గనులను ప్రారంభించారు. ఈ ప్రాంతంలో 22 మిలియన్ టన్నుల బొగ్గు నిక్షిప్తమై వుంది. దీనిలో 17 మిలియన్ టన్నుల బొగ్గును లాభసాటిగా త్రవ్వి తీయవచ్చు. యెల్లందు స్టేషను నుంచి ఈ ప్రాంతంవరకు రైల్వే మార్గం, రోడ్లు వేస్తారు. ఈ గనులలో ఆధునిక యంత్ర పరికరాలను అమర్చుతారు. ఎలక్ట్రిక్ క్యాప్ లాంపులు, పిట్ హెడ్ బాత్సు సమకూర్చుతారు. కాంటీన్లనూ, కార్మికులకు, అధికార్లకు కాలనీలనూ సంక్షేమ కేంద్రాలనూ, క్లబ్బులను నిర్మిస్తారు. బజార్లు మొదలైన ఇతర సౌకర్యాలు చేకూరుస్తారు. కాలనీలలో పారిశుద్ధ్యం, మంచినీటి సౌకర్యాలు కల్పిస్తారు.

అధికోత్పత్తి సాధించడానికి అనుసరించదగిన సాధారణ సూత్రాల విషయంలో మేనేజిమెంటు, కార్మిక ప్రతినిధులతో ఉత్పత్తి ఉపసంఘానొకదానిని ఏర్పరిచారు. పిట్ షాపు స్థాయిలలో కూడా ఉత్పత్తి సంఘాలను స్థాపించారు. నవంబరు నెలలో సాధించిన ఉత్పత్తి ప్రమాణం ప్రోత్సాహకరంగావుంది.

సింగరేణి కాలరీల రుద్రాపూర్ డివిజనులో 1962 నవంబరు 28 వ తేదీన, బాల్టు, తొట్లద్వారా ఆకాశమార్గంగా (సాండ్ — స్టోయింగ్ ప్రాజెక్టు) సరుకు రవాణా చేసే విధానాన్ని 'ప్రవేశపెట్టారు'.

తృతీయ పంచవర్ష ప్రణాళికాంతానికి 6.1 మిలియన్ టన్నుల బొగ్గు ఉత్పత్తి చేయడానికి మేనేజిమెంటు పెట్టుకున్న లక్ష్యాన్ని సాధించడంలో ఇది చాలా వరకు తోడ్పడగలదనుకుంటున్నారు. దీనికి రూ. 55 లక్షలు ఖర్చయింది.

సింగరేణి కాలరీ, పౌర సంఘం కలిపి జాతీయ రక్షణనిధికి ఇప్పటివరకు రూ 1.5 లక్షలు సమర్పించాయి. కాలరీ ఉద్యోగుల ప్రావిడెంట్ ఫండునుంచి మరో రూ. 50,000/- లను జాతీయ రక్షణ నిధి సర్టిఫికెట్లకు పెట్టుబడి పెట్టారు. సింగరేణి కాలరీల మేనేజిమెంటు రక్షణ నిధికి రూ. 1.10 లు లక్షలు విరాళంగా ఇచ్చింది.

## నిజాం చక్కెర ఫ్యాక్టరీ లిమిటెడ్

1962 నవంబరులో 96,184 టన్నుల చెరకును పిండడం జరిగింది. ఈ నెలలో 97,409 క్వింటాల్సు చక్కెర ఉత్పత్తి అయింది.

1962 నవంబరులో ఫ్యాక్టరీకి స్వంత క్షేత్రాలనుంచీ, రైతులనుంచీ దిగువ తెలిపిన విధంగా చెరకు అందింది :

| | | |
|---|---|---|
| 1. | సెంట్రల్ రైల్వే ద్వారా ... | 18,662 |
| 2. | ఫ్యాక్టరీ లైట్ రైల్వే ద్వారా | 59,859 |
| 3. | రోడ్డు మార్గం ద్వారా ... | 44,429 |
| | టన్నులు | 1,22,950 |

చెరకు సరఫరా చేసినందుకుగాను రైతులకు ప్రతి పక్షంరోజులకూ సక్రమంగా వారి వారి బిల్లులు చెల్లిస్తున్నారు.

1963—64 ఋతువుకై ఫ్యాక్టరీ 1962 నవంబరు నెలాఖరు నాటికి రైతులకు రూ. 17.70 లక్షల మేరకు అడ్వాన్సులు చెల్లించడంద్వారా చెరకును కాంట్రాక్టు చేసింది.

మేనేజింగ్ డైరెక్టరు విజ్ఞప్తిని పురస్కరించుకొని ఫ్యాక్టరీ ఉద్యోగులంతా తమ ఒక నెల బోనసును జాతీయ రక్షణ నిధికి విరాళంగా ఇవ్వడానికి సమ్మతించారు. ఈ మొత్తం రూ. 4.00 లక్షలకు వచ్చింది.

పరిశ్రమల శాఖామంత్రి డాక్టర్ ఎం.ఎన్. లక్ష్మీనరసయ్య 1962 అక్టోబరు 21 వ తేదీన తిరుపతి పారిశ్రామిక వాటికకు శంకుస్థాపన చేశారు.

ప్రభుత్వ చేతి పరిశ్రమ వస్తువుల విక్రయశాలలన్నింటిలోనూ 1962 నవంబరు 10 వ తేదీ నుంచి 17 వ తేదీవరకు ఎనిమిదవ అఖిల భారత చేతి పరిశ్రమల సప్తాహం జరిగింది.



శాసన పరిశోధక శిఖామణి:

# శ్రీ సోమశేఖర శర్మ

జి. వి. రామమూర్తి

[సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులుగా శాసన పరిశోధకులుగా ఆంధ్రదేశ చరిత్రకు మహత్తరమైన సేవ చేసిన అమృతహృదయుడు, సౌజన్యమూర్తి అయిన శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు జనవరి 7 వ తేదీ ఉదయం విశాఖపట్టణం హాస్పటల్‌లో తమ 72 వ యేట కీర్తిశేషులయ్యారు. శ్రీ శర్మగారి పరిశ్రమోన్ముఖమైన జీవితసంగ్రహాన్ని యీక్రింది వ్యాసరూపంలో ప్రకటిస్తున్నాము.]

కీర్తిశేషు లయిన మల్లంపల్లి సోమశేఖర శర్మగారు 1891 సంవత్సరములో పశ్చిమ గోదావరి జిల్లాలోని మినుమించిలిపాడు అగ్రహారంలో నాగమ్మ భద్రయ్యలకు ప్రథమ సంతానంగా జన్మించారు. తల్లిదండ్రులు కడు బీదవారు, గణార్చన చేసికొంటూ కుటుంబపోషణ చేసికొనేవారు వీరి తండ్రి.

వీరి బాల్య కౌమార దశలు అతికష్టంగానే గడచినవి. యౌవన దశలో కొన్నాళ్ళు రాజమండ్రిలో ఉండి కీ. శే. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు నడుపుతూ ఉండే 'దేశమాత' పత్రికకు సంపాదకులుగా పని చేశారు. తర్వాత వీరికి కీ. శే. కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారి ఆదరాభిమానాలు లభించాయి. వారివద్దనే శాసనాలను చదవడం, చరిత్రకు సంబంధించిన విషయాలను సేకరించడం, చారిత్రక పరిశోధనలు చేయడం అలవర్చుకొన్నారు. తరువాత లక్ష్మణరావుగారికి చారిత్రక పరిశోధనలో సహాయకులుగా ఉంటూవచ్చారు. "చాలకాలం క్రితమే కీ. శే. కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు పంతులుగారు ఈ శాసనములలోని తెలుగు భాగమునకు అర్థం తీయుటకై చాలాకృషి చేసియున్నారు. శాసన లేఖకుడు శాసనమును చాలా అశ్రద్ధగా వ్రాసి వుండటంవలన మరల ఈ శాసనపు రేకులను సంపాదించి, వాటి నుంచే మూలమును జదివితే ఫ్లీట్ దొరగారిచ్చిన పాఠంకంటే మంచి పాఠమేర్పడడానికవకాశ ముండునేమోయని వారు లండన్ బ్రిటిష్ మ్యూజియంవారికి రేకుల నిమిత్తం వ్రాసిరి, కాని వారు అసలు రేకులను బంపుటకు వీలులేదనిచెప్పి, ఒక ప్రతి ప్రతిబింబాలను, ఒక ప్రతి శాసనపు ఫొటోలను బంపిరి. నేనును లక్ష్మణరావుగారును ఈ ప్రతులను ముందుంచుకొని శాసనము లందలి యక్షర స్వరూపమును గురించియు, పదములను గురించియు చర్చించుచుండిన నాటి సంగతులు నేడీ సందర్భమున దలపునకు వచ్చుచున్నవి.." అంటూ వారి పూర్వస్మృతులను విభవ శ్రావణమాస భారతిలో వారురచించిన 'అహదనకర' శాసనము అను వ్యాసములో వ్రాశారు.

ముద్రణ వచ్చిన తర్వాత లిపికి ఒక స్థిరత్వము ఏర్పడినదేకాని అంతకుముందు శిల్పుల చేతిలో లిపిమారుతూ వచ్చింది. ఆయా కాలంనాటి లిపులను శ్రద్ధగా గుర్తించి శాసనాలను చదివి అర్థంచేసి కొనడం కష్టమైనపని. లిపుల పరిణామాలను తెలిపే పట్టికలు యిప్పుడున్నవిగాని పూర్వంలేవు. 50 సంవత్సరాలకు పూర్వం కీర్తిశేషులయిన గురజాడ అప్పారావుగారు, కొమర్రాజు లక్ష్మణరావుగారు, జయంతి రామయ్యగారు, గిడుగు రామమూర్తిగారు, మొదలయిన ఏ కొద్దిమందో శాసనాలను చదవడంలో కృషిచేశారు. అయినా అందులో అప్పారావుగారికి యీ విషయంలో ఉత్సాహమున్నా ఓపిక తక్కువగా ఉండేది. రామమూర్తిగారు సవరభాషా వ్యాసంగము మీద వ్యావహారిక భాషావాదము మీద వారిదృష్టిని కేంద్రీకరించవలసి వచ్చింది. లక్ష్మణరావుగారు జయంతి రామయ్యగారు మొదలయిన ఏ కొద్దిమందో ఎక్కువ శ్రద్ధతో ఓపికతో శాసన పరిశోధనలు చేశారు.

బెజవాడ యుద్ధమల్లుని శాసనం మొదట రామమూర్తిగారు చదవాలని ప్రయత్నించి మొదటి పెడ సాధించారు. కాని రెండవ పెడ వారికి విడలేదు. తర్వాత రామయ్య పంతులుగారు ఓపిగ్గా విడదీశారు. మొదటి పెడలో పంక్తులు మీదనుండి క్రిందకు ఉంటే రెండవ పెడలో పంక్తులు క్రిందినుండి మీదకు ఉన్నాయి. ఈ కిటుకు రామమూర్తిగారికి తెలియలేదు. దీనిని తెలుసుకొనడంకూడా ఒక

నేర్పే. ఈ బెజవాడ యుద్ధమల్లుని శాసనం మీద ఒక వ్యాసాన్ని రామయ్య పంతులుగారు ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో ప్రచురించారు. ఆ వ్యాసమే శ్రీ నిడదవోలు వెంకట్రావుగారి కవుల చరిత్రలో ఉంది.

తామ్ర శాసనాలలో కొన్ని అక్షరాలు, శిలా శాసనాలలో కొన్ని పంక్తులు గుర్తింప రానివిగా ఒక్కొక్కప్పుడు ఉంటాయి. వీటిని సరిగ్గా ఊహించుకోగల శక్తి సామర్థ్యాలు శాసనాలు చదివేవారికి చాలఅవసరం. ఇవి.శర్మగారికి బాగా ఉన్నాయి. (చూ. అహదనకర శాసన వ్యాసము).

మన భారతదేశంలో దేశ చరిత్రకు సంబంధించిన గ్రంథాలు పూర్వం లేవనేచెప్పాలి. పూర్వకవులు రచించిన కావ్యాల అవతారికలుతప్ప ఇతరత్రా చరిత్రకు ఆధారాలులేవు. 19వ శతాబ్దారంభంలో దక్షిణదేశానికి అధికారరీత్యా వచ్చిన కాలిన్ మెకంజీ అనే ఆంగ్లేయునికి దేశ చరిత్రకు కావలసిన సామగ్రిని పోగుచేయాలనే సంకల్పం కలిగింది. ఆయన కొద్దిమంది లేఖకులను స్వంత ఖర్చుతో నియమించి తామ్రశిలా శాసనాలను సేకరించి వాటి ప్రతులను వ్రాయించాడు. ఆయనకు యీ విషయములో ఎక్కువగా తోడ్పడినవాడు బొర్రయ్య అనే ఒక తెలుగు వ్యక్తి. తెలుగు వారిలో ఈయనే ప్రప్రథమ చారిత్రక పరిశోధకుడు. మెకంజీ దొరగారు వ్రాయించిన వ్రాత ప్రతులు పాడయిపోతూఉంటే వాటిని తిరిగి వ్రాయించి భద్రపరచినవాడు ఫిలిప్‌బ్రౌన్‌దొర. అవే నేటికీ మన చరిత్రకారులకు ఆధారాలుగా ఉంటున్నాయి. 19వ శతాబ్దం ఆఖరిలో గుంటూరు నివాసి బుక్కపట్నం రాఘవాచారిగారు చారిత్రక పరిశోధనలో చాల కృషి చేశారు. తర్వాత కీ. శే. కందుకూరి వీరేశలింగం పంతులుగారు దేశచరిత్రకని కాకపోయినా కవుల చరిత్రకోసం చేసిన పరిశోధన దేశచరిత్రకు తోడ్పడకపోలేదు. ఇంతకన్న ఎక్కువ ఆధారాలులేని చారిత్రక పరిశోధనలో శర్మగారు ఎంతో కృషిచేసి కొత్త బాటలు వేశారు.

చారిత్రక పరిశోధన చేయాలనే దృఢ సంకల్పంతో లక్ష్మణరావు పంతులుగారు 'విజ్ఞాన చంద్రికా మండలి' అనే సంస్థను స్థాపించారు. చారిత్రక పరిశోధనకు శాసనాల ప్రాముఖ్యము ఎంత ఉందో ప్రజలకు తెలియజెప్పినది వీరే. వీరి సహాయ సంపత్తితోనే కీ॥ శే॥ చిలుకూరి వీరభద్రరావుగారు 'ఆంధ్రదేశ కథా సంగ్రహము' రచించారు. వీరిద్దరితోకూడా ఉంటూ పని చేసిన శ్రీ శర్మగారికి పై యిద్దరి కృషి ఫలితాలను గమనించడంతో ఉత్తేజము కలిగినది. తర్వాత వారి జీవితాన్ని చారిత్రక పరిశోధనకు అంకితము చేశారు. ఇటు చారిత్రక పరిశోధనలు చేస్తూ అటు లక్ష్మణరావుగారి ఆంధ్రవిజ్ఞాన సర్వస్వమునకు సహాయకులుగా పనిచేశారు.

ఆంధ్రదేశములో ఏ మూలను ఏ కొత్త శాసన మున్నదన్నా అక్కడకు వెళ్లేవారు. కాని అందుకు తగిన ఆర్థిక స్తోమతు ఆయనకు ఉండేదికాదు.

“నా మిత్రులు శ్రీ వెంకటరమణయ్యగారి ఆర్థిక సహాయమే లేకపోతే ఈ పర్యటనమే జరగకపోను. ఇందుకు వారి కిందు మూలముగా నా కృతజ్ఞత తెల్పుకొంటున్నాను.” అని వారు వెంకటరమణయ్యగారితో కొన్ని దినాలు కడప జిల్లాలో పర్యటించిన విషయాన్ని తెలియజేస్తూ పొట్లదుర్తి – మాలెపాడు శాసన వ్యాసంలో తెల్పుకొన్నారు. 1939లో ఒకసారి గొబ్బూరి వేంకటానందరాఘవరావుగారి సహాయంతో యెలమంచిలికి సమీపంలో వున్న పంచధారలువద్ద ధర్మలింగేశ్వరస్వామి గుడికి వెళ్ళి అక్కడి శిలాశాసనాలను చూచి వచ్చారు. ఆ రోజున నేనూ వారితో వెళ్ళాను. అక్కడ కొన్ని ప్రాచీన చాళుక్య శిల్పములున్నవి. ఈ విధంగా అనేక కష్టాలను పడుతూనే ఎన్ని ప్రదేశాలకు వెళ్ళి ఎన్ని శాసనాల ప్రతులను సంపాదించారో చెప్పనలవికాదు.

శాసనముల, శిల్పముల ప్రాముఖ్యమును వారు స్వయంగా గుర్తించి నిర్ణయించుకోవలసినదే గాని వేరొకరి సిద్ధాంతముల మీద ఆధారపడేవారుకారు. ఒక్కొక్కరి దృష్టి ఒక్కొక్క కోణమునుంచి శాసన పరిశీలనము మీద ఉంటుందనీ, ఏ ఒక్క కొత్త శాసనంవల్లనైనా అంతవరకు ఊహించిన దేశచరిత్ర తారుమారు కావచ్చునని వారి నమ్మకము. అభిప్రాయ భేదము వచ్చినప్పుడు మిత్రులతోకూడ “నేను ఏకీభవించజాలను”అని చెప్పడానికి వీరు ఎప్పుడూ వెనుకాడలేదు. 'ఆంధ్ర మహాసామ్రాజ్యము' అనే శీర్షికతో వీరు భారతిలో రచించిన వ్యాసాలలో సాతవాహనులు ఆంధ్రులవునా? కాదా? అన్న విషయ పరిశోధన ఎంత నిశితముగా వెళ్ళినదో, యితరుల వాదనలను ఎంత సౌమ్యదృష్టితో ఖండించారో తెలుస్తుంది.

కొన్నాళ్ళు శర్మగారు 'భారతి' మాసపత్రికకు సంపాదకులుగా పనిచేశారు. ఆ రోజులలో కూడా పరిశోధనా వ్యాసాలను వ్రాస్తూ ఉండేవారు. 1940 నుండి 1946 వరకు ఆంధ్రా యూనివర్శిటీలో చారిత్రక పరిశోధకులుగా పనిచేస్తూ అంతకుముందు వారు రచించి 'ఎ ఫర్‌గాటెన్ చాప్టర్ ఆఫ్ ఆంధ్రా హిస్టరీ' అనే గ్రంథ రచన ఫలితంగా కలిగిన పరిశోధనతో “హిస్టరీ ఆఫ్ ది రెడ్డి కింగ్‌డమ్స్'' అనే గ్రంథాన్ని యింగ్లీషులో రచించారు.

1950 నుండి 1957 వరకు తెలుగు భాషా సమితి ప్రచురించిన తెలుగు విజ్ఞాన సర్వస్వం లోని 3,4 భాగాలయిన 'తెలుగు సంస్కృతి' సంపుటాలకు ప్రధాన సంగ్రాహకులుగా ఉండి తెలుగు వారికి మహోపకారం చేశారు. వీలయినంతవరకు విజ్ఞాన సర్వస్వం నిర్దుష్టంగా ఉండాలనే తలంపుతో తొందరపడకుండా చాలా ఓర్పుతో అనేక కష్ట నిష్ఠూరాలకు లోనై ఉత్తమ సంపుటాలుగా వాటిని రూపొందించారు.

1957 నుండి మొన్న స్వర్గస్థులయ్యే వరకూ ఆంధ్ర విశ్వవిద్యాలయములో ఆర్కియాలజిస్టుగా పనిచేశారు.

లిపి పరిణామాలను పూర్తిగా ఎరిగిన వారు గనుకను ఆ శాస్త్రము పూర్తిగా పరిశోధించిన వారు గనుకను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారు వీరి ఆధ్వర్యాన 3 సంవత్సరముల క్రితం ఒక కమిటీని లిపి సంస్కరణ నిమిత్తమై ఏర్పాటు చేశారు. ఆధునిక యంత్రయుగానికి అనువుగా లిపి సంస్కరించబడాలనే విషయాన్ని లెస్సగా గుర్తించి అన్ని దృక్పథాలనుండి వీరు అభిప్రాయాలను సేకరించారు. ముద్రణ దృక్పథమునుండి నా అభిప్రాయాన్ని అందజేసే అవకాశం నాకు కలుగజేశారు.

శర్మగారు మొదటి రోజుల్లో కవిత్వంలో కూడా కొంత కృషి చేశారు. వీరిది కవి హృదయం కనుకనే వీరి వ్యాసాలు, రచనలు, నాటికలు మొదలయినవన్నీ సరళమైన శిష్టజన వ్యావహారిక భాషలో చక్కగా ఉంటాయి.

వీరి రచనలలో ప్రఖ్యాతములైనవి 'A Forgotten Chapter of Andhra History,' 'The History & the Reddi Kingdoms' అనే రెండు యింగ్లీషు గ్రంథాలు. చారిత్రక వ్యాసాలు. ఆంధ్ర వీరులు, అమరావతీస్తూపము హిందూదేశ చరిత్ర మొదలయిన తెలుగు గ్రంథాలు.

పాదుకా పట్టాభిషేకము, అనే నాటకము రోహిణీ చంద్రగుప్తము అనే చారిత్రక నవల, అరణ్య రోదనము అనే మరొక నవల కూడా వీరు రచించారు.

వీరు చూచిన చారిత్రక శిల్పాలవల్ల కలిగిన అనుభూతులతో చరిత్రకు సంబంధించిన నాటికలను కథలను రచించారు. అటువంటిదే 'నాగశిల్పి' నాటిక.

1947 లో మద్రాసు ఆకాశవాణి ద్వారా వీరు విద్యార్థులకోసం చేసిన దేశ చరిత్రకు సంబంధించిన 12 ప్రసంగాలు ఆంధ్ర పుస్తక రూపంలో వెలువడ్డాయి. ఆ ప్రసంగాలు అందరికి సుబోధకమయ్యేటట్టు ఉన్నాయి.

వీరు రచించిన అసంఖ్యాకములైన వ్యాసరచనలు అనేక పత్రికలలో ఉన్నాయి. వీటి నన్నింటిని ఒక చోట చేర్చవలసిన బాధ్యత ఆంధ్రులది.

శర్మగారు కీర్తికోసంకాక నిర్దుష్టమైన ఆంధ్రదేశ చరిత్రకోసం జీవితాన్ని ధారపోసిన వ్యక్తి. మంచి సరసుడు. సహృదయుడు. అతిథి అభ్యాగతులకు ఎప్పుడూ స్వాగతమిచ్చేవారు. సౌహృదయంతో అందర్నీ పలకరిస్తూ, ఛలోక్తులతో నవ్విస్తూ అందరి ఆదరాభిమానాలను చూరగొన్న సౌజన్యమూర్తి, శాసన పరిశోధకుడూ శ్రీ సోమశేఖరశర్మ. వీరు కీర్తిశేషులు కావడం మన చరిత్రకే పెద్దలోపం.

---

# ఒక మనిషికి ఎంత భూమి అవసరం?

టాల్‌స్టాయ్ ఒకసారి ఒక కథ వ్రాశాడు. ఒక మనిషికి ఎంతభూమి అవసరమవుతుందని ఆయన ఆ కథలో ప్రశ్నించాడు. దానికి ఆయనే ఏ మనిషికైనా సరే చిట్టచివరికి అవసరమయ్యేది ఆరడుగుల నేల మాత్రమేనని సమాధానంకూడా ఇచ్చాడు.

'ఇక ఒక జాతి సంగతి? ఒక జాతికి ఎంతో భూమి అవసరమవుతుంది. అయినా మనం మనకు ఉన్న దానితోనే సంతృప్తి పడతాం. చారిత్రకంగా మనకు హక్కులేని భూమిని మనం కోరం. పోతే డబ్బు సంగతేమిటి? తన పురోభివృద్ధికై దేశానికి అధికతరంగా ధనం కావల్సివస్తుంది. యుద్ధాన్ని ఎదుర్కొంటున్న దేశం మాటేమిటి? యుద్ధం సాగిస్తున్న దేశానికి ఏదీకూడా అధికంకాదు. శత్రువుతో పోరాడడానికి నయాపైసాకూడా అవసరం. మనం కొంత మొత్తాన్ని పేర్కొని ఇంత అయితే చాలు అనలేము. దేశ రక్షణకై కంకణం కట్టుకున్న జాతి ఎంత ధనమైనా సమకూర్చుకోగలదు.

ఇప్పటి ప్రయత్నం కేవలం ఆరంభం మాత్రమే. రక్షణ నిధికిగాను మన రాష్ట్రం తొలి లక్ష్యం రూ. 3½ కోట్లు.

రూ. 3½ కోట్లు అంటే రాష్ట్రంలో ప్రతి వ్యక్తీ ఒక రూపాయి చొప్పున ఇవ్వాలన్న మాట. అంటే ప్రతి ఒక్కరూ ఒక రూపాయి ఇవ్వాలని కాదు. ఈ స్వల్ప మొత్తాన్నికూడా ఇవ్వలేని వారు చాలా మంది వున్నారు. కలిగినవారు లేనివారి వంతు కూడా ఇవ్వాలి. మీ శక్తికి తగినట్టు మీ రివ్వండి. ఒక రూపాయి కనీస విరాళం మాత్రమే.

జాతీయ రక్షణనిధికి ఉదారంగా విరాళాలివ్వండి



రాష్ట్ర ఎక్సైజు, మద్యనిషేధశాఖల మంత్రి 1962 డిశంబరు 25 వ తేదీన కృష్ణాజిల్లా మైలవరం తాలూకాలోని చిన్నలపాడు గ్రామాన్ని సందర్శించిన సందర్భంలో లంబాడీలు జాతీయ రక్షణ నిధికై మేకలను, గొర్రెలను కలిపి పదింటిని బహూకరించారు.



నల్గొండజిల్లా చౌటుప్పల్‌లో 1963 జనవరి 5 వ తేదీన ఒక బాలిక రక్షణనిధికై తన కర్ణాభరణాలు సమర్పించింది.



పశ్చిమ గోదావరిజిల్లా నర్సాపూర్‌లో పాఠశాల పిల్లలు రక్షణ నిధికి యథాశక్తి విరాళాలు ఇచ్చారు.



రక్షణనిధికి పూర్తిజీతం సమర్పణ: తూర్పు గోదావరిజిల్లా పిఠాపురం పంచాయితీ సమితిలోని వాకతిప్ప గ్రామమున్సబు శ్రీ జోశ్యుల అప్పారావు, తనకు నెలజీతంగా లభించే రూ. 30/- లను పూర్తిగా జాతీయ రక్షణ నిధికి విరాళంగా సమర్పిస్తున్నారు.



ఝవేరీ సోదరీమణులు రక్షణనిధి సహాయార్థం హైదరాబాదులో 1962 డిశంబరు 25 వ తేదీన అహ్లాదకరమైన నాట్య ప్రదర్శన లిచ్చారు.



కేంద్ర ఆర్థికశాఖా మంత్రి శ్రీ మొరార్జీదేశాయ్ 1962 డిశంబరు 16 వ తేదీన హైదరాబాదులో రాష్ట్ర పౌర రక్షణ సంఘం సమావేశంలో ప్రసంగించారు.



రాష్ట్ర సమాచార, పౌర సంబంధాలశాఖ రక్షణ కృషిపై నిర్మించిన "సత్యమే జయం" (అన్ టు అవర్ లాస్ట్) అనే డాక్యుమెంటరీ చిత్రాన్ని 1963 జనవరి 7 వ తేదీన విడుదలచేశారు. డాక్యుమెంటరీ ప్రదర్శనకు హాజరైన ప్రముఖులలో కొందరిని ఈ చిత్రంలో చూడవచ్చు.



బాలభటులు జంటనగరాలలో రక్షణ
పోస్టర్లను పంచిపెడుతున్న దృశ్యం.



రష్యా చారిత్రకులు : రష్యా చారిత్రకులు (ప్రాచీన పత్రాలు) శ్రీయుతులు వి. ఆర్. కాపిలోవ్, జి. ఎల్. డిమిట్రీవ్ 1962 డిశంబరు 12 వ తేదీన హైద్రాబాదులో రాష్ట్ర ప్రాచీన పత్రాల భాండాగారాన్ని సందర్శించారు.



కేంద్ర సహకార, సమాజాభివృద్ధి శాఖలమంత్రి శ్రీ ఎస్. కె. డే హైదరాబాదులో 1962 డిశంబరు 22 వ తేదీన అధికార్ల సమావేశంలో గ్రామీణ స్వచ్ఛంద దళం, రక్షణ శ్రామిక బ్యాంకు పథకాల అమలు విషయమై ప్రసంగించారు.



ప్రీమియం ప్రైజు బాండ్లు: కొత్త ప్రైజ్ బాండ్ల అమ్మకానికి ధర్మాదాయశాఖ మంత్రిణి 1963 జనవరి 1 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు.

# జాతీయ రక్షణ కృషికి మీ పొదుపు ధనం అవసరం

మీరు ఎంత పొదుపు చేయగలిగితే అంత చేయండి. ఆ విధంగా పొదుపుచేసిన మొత్తాలను

దిగువ సెక్యూరిటీలలో దేనికైనా పెట్టుబడి పెట్టండి.

*12 సంవత్సరాల జాతీయ రక్షణ సర్టిఫికెట్లు :*

సంవత్సరానికి $6\frac{1}{4}$ శాతం సాధారణ వడ్డీ లేక $4\frac{3}{4}$ శాతం చక్రవడ్డీ. రూ. 5 మొదలు రూ. 25,000 ల వరకు వివిధ డినామినేషన్లలో లభ్యమవుతాయి. విడిగా ఒక వ్యక్తి అయితే రూ. 35,000 ల వరకూ, ఇద్దరు వ్యక్తులు కలిసి అయితే రూ. 70,000 ల వరకు పెట్టుబడి పెట్టవచ్చు. (పోస్టల్ సేవింగ్స్ సర్టిఫికెట్లకు లోగడ ఏమైనా పెట్టుబడి పెట్టివుంటే దానితో కలుపుకొని).

*10 సంవత్సరాల రక్షణ డిపాజిటు సర్టిఫికెట్లు :*

ఏటా $4\frac{1}{2}$ శాతం వడ్డీ చెల్లించబడుతుంది. రూ. 50 ల గుణిజములలో లభ్యమవుతాయి. విడిగా ఒక వ్యక్తి అయితే రూ. 35,000 ల వరకూ, ఇద్దరు వ్యక్తులు కలిసి అయితే రూ. 70,000 ల వరకూ ఎక్కువలో ఎక్కువ పెట్టుబడి పెట్టవచ్చు. ($3\frac{1}{2}$ శాతం. 4 శాతం ట్రెజరీ సేవింగ్స్ డిపాజిటు సర్టిఫికెట్లకు లోగడ ఏమైనా పెట్టుబడి పెట్టివుంటే దానితో కలుపుకొని).

*క్యుమ్యులేటివ్ టైమ్ డిపాజిటు పథకం :*

5, 10 లేక 15 సంవత్సరాలవరకు ప్రతినెలా రూ. 5, 10, 20, 50, 100, 200 లేక 300 చొప్పున డిపాజిటు చేసినట్లయితే తరువాత చక్రవడ్డీతోసహా పెట్టుబడి అధిక మొత్తంగా తిరిగి చెల్లించబడుతుంది.

*పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు అకౌంట్లు :*

రూ. 25 లు మొదలు రూ. 20,000 ల వరకు నిలువవుంచే మొత్తాలకు 3 శాతం చొప్పునా, రూ. 20,000 లకు మించి నిలువవుంచే మొత్తాలకు $2\frac{1}{2}$ శాతం చొప్పునా వడ్డీ చెల్లించబడుతుంది. ఒక వ్యక్తి రూ. 15,000 ల వరకూ నిలువ చేయవచ్చు.

*15 సంవత్సరాల ఆన్యుటీ సర్టిఫికెటు :*

జారీచేసే ధర : రూ. 1,330, రూ. 3,325, రూ. 6,650, రూ. 13,300, రూ. 26,600. సంవత్సరానికి 4.25 శాతం చక్రవడ్డీ చొప్పున, 15 సంవత్సరాలలో నెలవారీ చెల్లింపుల రూపంలో డబ్బు తిరిగి ఇవ్వబడుతుంది. ఒక వ్యక్తి రూ. 26,600 ల వరకు పెట్టుబడి పెట్టవచ్చు.

చిన్న మొత్తాల పొదుపు పత్రాలకు పెట్టిన పెట్టుబడులపై లభించే వడ్డీకి

ఆదాయపు పన్ను, సూపర్ టాక్సులు వుండవు.

**"మీరు చేసే పొదుపుమీదనే మీ భద్రత, మీ పిల్లల శ్రేయస్సు ఆధారపడి వుంది."**

ఇతర వివరాలకొరకు, హైదరాబాదు 10—2—2, ఏ. సి. గార్డ్సు రోడ్డులోని ఆంధ్రప్రదేశ్ నేషనల్ సేవింగ్స్ ప్రాంతీయ డైరెక్టరు (భారత ప్రభుత్వం)ను కానీ లేక మీ కలెక్టరేటులోనిజిల్లా ఆర్గనైజరునుకానీ లేదా మీ సమీపంలోని తపాలా కార్యాలయాన్నికానీ దయచేసి సంప్రదించండి.

# పబ్లిక్ వర్క్సు శాఖ కార్యకలాపాలు



కడప జిల్లాలో కడప—బాలపల్లి రోడ్డులో 27/2—8 వ మైలువద్ద చెయ్యేరుపైన కాజ్వే :—పెన్నార్ నదికి ముఖ్య ఉపనదులలో చెయ్యేరు ఒకటి. ఇది కడప—బాలపల్లి రోడ్డును 27/2—8 వ మైలువద్ద దాటుతుంది. ఇక్కడ దీని వెడల్పు 5 నుంచి 6 ఫర్లాంగుల వరకూ వుంటుంది. యం. యఫ్. ఏల్ పరిస్థితుల్లో ఇక్కడి ప్రవాహపులోతు 10 అడుగుల వరకు వుంటుంది. ఈ నదిలోకి 2453 చ. మై. ప్రాంతంలోని వర్షపునీరు ప్రవహిస్తుంది. ఇక్కడ సగటు వర్షపాతం 20 అంగుళాలు. సాధారణ వరదలు వచ్చినప్పటికీ, రాకపోకలకు తరచుగా యిబ్బంది యేర్పడుతున్నందువల్ల ఈ నదికి ఒక కాజ్వే నిర్మించాలని సంకల్పించబడింది. పని ఆరంభమైంది కూడా. దీని నిర్మాణంవల్ల మద్రాసు కర్నూలుల మధ్యగల దూరం చాలా తక్కువవుతుంది.

దీని నిర్మాణానికి రూ. 10.33 లక్షల అంచనా మొత్తాన్ని సాంకేతికంగా మంజూరు చేశారు.

ఈ కాజ్వేలో, నదికి బాలపల్లివైపు 60 తూములు వుంటాయి. ఒక్కొక్క దాని వెడల్పు 10 అడుగులు. స్తంభాల ఎత్తు 6.17 అడుగులు. ఇవతల కడపవైపు 10 తూములు వుంటాయి. వీటి వెడల్పు 10 అడుగులు. స్తంభాలయెత్తు 6.17 అడుగులు. కాజ్వేలు తూముల భాగంపొడవు 700 అడుగులు, తూములేని భాగంపొడవు 2761 అడుగులు వుంటుంది.

తూముల భాగంలో పునాదికి కొయ్య మొద్దులు ఉపయోగించ బడ్డాయి. అడుగు నుంచి భూమి వత్తిడికి తట్టుకొనే విధంగా ఈ పునాదిని పదిలపరచడం జరిగింది. నదికి ఎగువ భాగంలోనూ, ఏటవాలు ప్రాంతంలోనూ ఇరువైపులా పునాదులు త్రవ్వి 3 అడుగుల వెడల్పు, $1\frac{1}{2}$ అడుగుల మందంతో గోడలు నిర్మించారు. నదికి ఎగువ భాగంలోనూ దిగువ భాగంలోనూ పునాదికి కొయ్య మొద్దులు వాడిన చోట్లలో $13' \times 1' \times 4\frac{1}{4}''$ సైజులో ఆర్. సి. సి. షీట్లు పేర్చారు. కడప వైపున వున్న తూము మార్గంలో ర్యాఫ్టుకు కొంతదూరంలో ఇరువైపులా, ఈ ఆర్. సి. సి. షీట్లను 50 అడుగుల మేరకు విస్తృత పరచడం జరుగుతుంది. బాలపల్లి తూము మార్గంలో నదివైపుగా 100 అడుగుల వరకూ ఒడ్డువైపున 30 అడుగుల వరకూ విస్తృత పరచడం జరిగింది. నేలమట్టంనుంచి స్తంభాలు 5′—8″ ఎత్తు వరకు నిర్మించబడినాయి. వాటిపైన 6 అంగుళాల మందంతో లెవెలింగు చేయడం జరిగింది.

ఈ కాజ్వే నిర్మాణంపని చురుకుగా కొనసాగుతున్నది. తూములులేని భాగంలో పునాదులు త్రవ్వి అందులో కావలసిన మట్టం వరకు ఆర్. సి. సి. షీట్లు వుపయోగించ బడ్డాయి. ఒక యింజను సహాయంతో వీటిని పునాదులలోపలికి వేసేపని కొనసాగుతున్నది. ఈ ఇంజనుకు ఒక గొట్టం, రెండు వాటర్ జెట్లు అమర్చబడినాయి. రోజుకు సగటున 10 ఆర్. సి. సి. షీట్లకట్టల చొప్పున వీటిని పునాదిలోపలికి వేయడం జరుగుతున్నది. 

# మన భారత దేశం

జూలూరి హనుమంతరావు

[తెర లేచేటప్పటికి రంగస్థలంలో - భారతదేశపటం — పటానికి ఒకప్రక్క- యువకులు-మరొక ప్రక్క- యువతులు పుష్పాంజలులతో ఉంటారు — గానంచేసేటప్పుడు పుష్పాంజలి సమర్పించాలి. వెలుతురు దేశపటంపై కేంద్రీకరించాలి]

బృందగానం : ఓంకార త్రిగుణ స్వరూపా
జయ జయ జయ భారతమాతా

యువతి : ఉదయ ప్రభారుచిర - విజ్ఞాన దీపా
మలయ - మారుత సుఖద - వరదక్షిణాశా
పశ్చిమాశా ఙ్ఞాపి - తాదర్శమార్గా
హిమశైల - కమనీయ - కళ్యాణధామా ॥ఓం॥

యువకుడు : హిమనద నదీ ప్రపూతా
సస్య శ్యామల రూపా
వర గుణ గణ - మయ భాసిత
పవిత్ర భారతమాతా - ॥ఓం॥

యువకుడు : నాల్గువేదముల - నాగరకత - దే
శాల - చాటినది ఏదేశం ?

యువతులు : మనదేశం భా - రతదేశం.

యువకుడు : యుగయుగాల వి - జ్ఞాన తేజముల
జగమున నిల్పిన దే దేశం ?

యువతులు : మనదేశం భా - రతదేశం.

యువకుడు : నానా మతముల - సమ్మేళనమున
ఐక్యత నిల్పిన దే దేశం ?

యువతులు : మనదేశం భా - రతదేశం.

యువకుడు : ప్రపంచ మానవ పరిణతికై - మా -
ర్గములను నిల్పిన దే ధర్మం ?

యువతులు : మా - నవ ధర్మం భా - రత ధర్మం

యువకుడు : వీర పుత్రులకు - త్యాగ మూర్తులకు
ఆలవాల మగు నే దేశం ?

యువతులు : మన దేశం భా - రతదేశం

యువకుడు : శాంత్య హింసల - కాంతి చంద్రికల
హాయి నొసంగిన దే ధాత్రి ?

యువతులు : జనయిత్రి - భా - రత ధాత్రి
భా - రత ధాత్రి
భా - రత ధాత్రి

బృందగానం : భారతావనీ ! పరమపావనీ
వీరపుత్ర జననీ
కొనవే - వందనమ్ము జననీ

యువకులు : మనసులందు - మా -
మాట లందు - ని -
త్యమ్ము నిలచునది - నీయశమే

యువతులు : తలపులందు - మా -
తనువులందు - దీ -
పించు నెప్పుడును - నీ హృదియే

బృందగానం : నీయశమే — మా — బాటల వెలుగై
నీ హృదియే — మా — బ్రతుకుల విలువై
ఎనలే — నివిగా — అలరా - రునుగా
ఆహా - భారత ప్రియ జననీ.

["నీయశమే మా బాటకు వెలుగై" అన్న నాలుగు పాదాలు రెండు సార్లు పాడాలి. ఇట్లా పాడుతున్న సమయంలోనే నేపథ్య గానం మొదలు పెట్టాలి.]

నేపథ్యగానం : [విషాద సూచకంగా]
తరతరాల స్వా - తంత్ర్య జీవనపు
చరిత్ర క్రమమే - మారిందా ?
మరువలేని సుఖ - జీవనసారము
మటుమాయమ్మై - పోయిందా !
పరదేశస్థుల - కుట్రలు - మోసపు

తెరలు – భారతిని కప్పేనా !
పరపాలనమున – క్రమ్మిన దాస్యపు
కారు చీకటులు – విచ్చేనా ? విచ్చేనా ?

["తెరలు భారతిని కప్పేనా ?'' అని పాడుతున్నపుడు నెమ్మదిగా తెరలను వేసి తిరిగి వెంటనే తీయాలి. రంగస్థలంలో అంతా చీకటి ఉండాలి. నటీనటు లెవ్వరు ఉండరు.]

[ఉత్సాహంతో]

అదిగది గదిగో – దేశంలో – నవ
చైతన్యంపె – ల్లుబికింది –
నవనాడులలో – విరుగని దీక్ష
స్వతంత్ర కాంక్ష – హెచ్చింది –

[నేపథ్యంలో జన సమూహం "వందేమాతరం – మనదే రాజ్యం మున్నగు Slogans పలకాలి.]

[వరుసగా యువతులు, యువకులు పాడుతూ రంగప్రవేశం చేస్తారు. రంగస్థలంపై సగం చీకటి సగం లేత ఎఱుపు రంగు వెలుతురు మాత్రమే ప్రసరించుతుండాలి.]

యువకులు : లే – నవభారత – యువకా
లే – చైతన్య – ప్రతిభా
యువతులు : లే – నవభారత – యువతీ
లే – జాగృతనవ – శక్తీ
యువకుడు : ఎన్నాళ్ళీ పర – పాలనము ?
యువతి : ఎన్నాళ్ళీ బా – నిస తనము ?
యువకుడు : స్వరాజ్య మన్నది – జన్మహక్కని
యువతి : స్వతంత్ర మన్నది – సౌఖ్యదం బని
బృందగానం : చాటిచెప్పి సం – క్షేమ రాజ్యమును
స్థాపింప – కొనసాగింప – ॥లే॥
యువకుడు : ముక్తి లేదురా – పరదాస్యములో
శక్తి రాదురా – పరపాలనలో
యువతి : ఎదిరింప – పరదేశీయుల
జయింపగా – ॥లే॥
నేపథ్యగానం : అదిగో కనరా – అదిగో వినరా –
తిలక్ మహాశయు – నా దర్శం
గాంధి మహాత్ముని – సందేశం
అదిగో – అదిగో –
భారతి దీనాలాపం –
మాతృదేశ పరితాపం –
అదిగో – అదిగో –
నడుము బిగించి – ముందుకు దూకి –
స్వార్థత్యాగము – చేసి –
దేశ కష్ట దశ – చూచి
రథసారథులై – జవహరులాల్
సుబాసుబోసు – లజపతిరాయ్
అరుగో – అరుగో –
వల్లభాయి – అడుగో
దుగ్గిరాల – అడుగో
టంగుటూరి – అడుగో
పట్టాభీ – అడుగో –
దేశదాస్య – బం – ధాలు త్రెంచ – సం
దేహ మెంచకే – లే లెండి –
బృందగానం : [రంగస్థలంపై యువతీ యువకులు]
లే – లెండీ – లే – లెండీ
భారత యువకుల్లారా !
భారత యువతుల్లారా !
స్వదేశమునకై – స్వరాజ్య మునకై –
స్వయం శక్తి చూపండీ –
త్యాగంతో – స్వార్థ
త్యాగంతో – దేశ
స్వాతంత్ర్యం తిల – కించండి
ఆభరణాలూ – ఆస్తులు సర్వం
ఆత్మార్పణములు – కొనవే
కొనవే – భారతమాతా
కొనవే – హిందూ మాతా

[శరీరాల పైని ఆభరణాలూ మున్నగునవి తీసి దేశపటాని కెదురుగా రాసులుగా పోస్తారు.]

దేశభక్తితో – దాస్యముక్తికై
ముందు ముందు కిక – నడవండి –
"హిందూ ముస్లిం భాయీ భాయీ
ఆగే కదం బఢావో –''
కొందఱు : ''దూర్ హటో ఏ దునియా వాలో
హిందుస్థాన్ హమారా హై''
కొందఱు : తొలగుడు ప్రపంచవాసుల్లారా
హిందూస్థానము మాదే – మాదే –
అందఱు : దేశభక్తితో – దాస్యముక్తికై

ముందుముందు కిక - నడవండీ -
నడవండీ -

[క్రమంగా అందరూ నిష్క్రమిస్తారు. రంగస్థలంపై ఎఱ్ఱని కాంతి ప్రసరింపజేయాలి. నేపథ్యగానం పాడేటప్పుడు మధ్య మధ్య Slogans చెప్పాలి ]

నేపథ్యగానం :

సత్యాగ్రహముల - శాంతిపథములో
స్వరాజ్య శక్తి - కదలింది.
గుండెలు - తుపాకి - గుండ్లకు చూపి
కండలు - హింసా - కాండకు చూపి
ఎదిరించీ - సహియించీ -
పరపాలనమును - ఖండించీ
స్వతంత్రరాజ్య - స్థాపనకై
స్వరాజ్య భావ - ప్రేరితమై
ప్రజాశక్తి కదలింది
పరిపాలనము వణకింది -
పటపట - పటపట - దాస్యబంధములు
భారతదేశము - త్రెంచింది
భారతదేశమ ! నమస్కారమని
పరపాలనము - తొలగింది -
ఆనందముతో - ఉత్సాహముతో
హాయిగ - హృదయము - విరిసింది
జాబిలి వెన్నెల - విరిసింది
స్వతంత్ర భారతి - నిలచింది.

["పరపాలనము తొలగింది" అని పాడుతున్నప్పుడు రంగస్థలంపై ఎఱ్ఱని కాంతి పోయి తెల్లని కాంతి ప్రసరించాలి.]

[యువతీ యువకులు రంగస్థలంపై ప్రవేశిస్తారు.]

బృందగానం : భారతావనీ - పరమ పావనీ
వీరపుత్ర జననీ -
కొనవే - వందనమ్ము జననీ

యువకులు : మనసులందు - మా -
మాటలందు - ని -
త్యమ్ము నిలచునది - నీ యశమే

యువతులు : తలపులందు - మా -
తనువులందు - దీ -
పించు నెప్పుడును - నీ హృదియే

బృందగానం : నీ యశమే - మా - బాటల వెలుగై
నీ హృదియే - మా - బ్రతుకుల విలువై
ఎనలే - నివిగా - అలరా - రునుగా -
ఆహా - భారత ప్రియజననీ -

యువకులు : స్వతంత్ర భారత దేశంలో -

యువతులు : స్వతంత్ర శ్రేయోరాజ్యంలో -

బృందగానం : బానిస లెవరో - చూపండి -
పాలకు లెవరో - తెలియండి
మనమే పాలిత ప్రజలం
మనమే పాలక ప్రజలం -

యువకులు : గలగల గలగల నదుల నీరు - బం -
గారు పంటలను - పండింప -
తళతళ తళతళ - దేశ భాగ్యములు -
శాంతి సౌఖ్యములు - హెచ్చింప -

యువతులు : ఆర్థిక సంపద - నాగరకత - దే -
శానకు - పుష్టిని - చేకూర్ప
స్వేచ్ఛా జీవిత - సహకారోన్నత -
మార్గము - తుష్టిని - చేకూర్ప

బృందగానం : ధరించి శక్తిని - శ్రమించి నిత్యము
సుఖించు బాటలు - నిర్మిద్దాం.

యువకులు : దేశ పునర్ని - ర్మాణములో సం -
దీప్తులు చిమ్మిన - వసుంధరా

యువతులు : స్వయం సమృద్ధి - ప్రజాభివృద్ధి -
సమభావం కొను వసుంధరా.

బృందగానం : నిశ్చయమ్ముగా - నిశ్చలమ్ము - మా -
అనంత శక్తీ - నీదే - నీదే -
నిర్భయమ్ముగా - నిరంతరముగా -
నిర్మల భావము - నీదే - నీదే
విజ్ఞులమై - నీ - ఆజ్ఞతోడ ని -
ర్నిద్రులమై - శ్రమియించి -
మించు భాగ్యముల - పెంచెదమను మా -
ప్రతిజ్ఞ - లిక పాలించు - ॥దేశ॥

నేపథ్యగానం ; అవిగో - అవిగో
భాక్రానంగల్ నాగార్జున సా
గరములు స్వతంత్ర చిహ్నలు
పవిత్ర భారతి నేత్రాలు

పవిత్ర భారతి నేత్రాలు
స్వతంత్ర భారత చిహ్నాలు
యంత్రాగారాల్ - కర్మాగారాల్
స్వతంత్ర భారత సంపదలు
అవిగో - అవిగో -

[నేపథ్యంలో తుపాకి కాల్పుల శబ్దం - అలజడి. రంగస్థలంలో నటీనటులు నిర్వేదం - శంక - ధైర్యం ప్రదర్శించాలి. మధ్యమధ్య ఎఱుపురంగు ప్రసరించాలి.]

నేపథ్యంలో : దేశ పునర్ని - ర్మాణపు దశలో
తుపాకి కాల్చిన దెవడో

బృంధగానం : ఎవడో ! వా - డెవడో !

నేపథ్యంలో : అడుగో వాడే చైనీయుడు ఈ
శాన్య హద్దులో అడుగో - అడుగో

బృందగానం : మిత్రత్వంతో శతృత్వమ్మును
గర్భంలో - దా - చినవాడే -

నేపథ్యంలో : పచ్చని భారతదేశం పై
పడ్డవి చైనా కళ్ళు
రాజ్య దాహమున కబళింపంగా
పెట్టుచున్న దీ పరవళ్ళు.
సమరస భావము చూపిన భారత
శాంతి వాక్యములు వినునా ?
వినాశకాలం దాపురించగా
మంచి మాటలను వినునా ?
శాంతి వాక్యముల ప్రక్కకు నెట్టి
సరిహద్దుల పై నిలచింది
చైనాతోడే - లీ భా - రతమును
మేకపిల్లగా తలచింది.

యువకులు : నిద్దురపోయే సింహాలని తా
నింకనైన తెలియాలి
తెలుసుకొనుచు మెలగాలి.

[తిరిగి నేపథ్యంలో తుపాకి కాల్పుల శబ్దం]

నేపథ్యంలో : దురాక్రమణకై పరాక్రమించిన
దుర్మతి చైనా అదుగో - అదుగో -
మర తుపాకులను శతఘ్ని దండుల
వేల సైన్యముల కూర్చి

బృందగానం : కూర్చి ?

నేపథ్యంలో : హిందూదేశపు సరిహద్దులపై
దురాక్రమించుచు అదుగో - అదుగో
దురాక్రమణలను ఎదిరింప
దురాత్ములను భంజింప

బృందగానం : (వీరత్వంతో)
ఎదిరింప - భంజింప

నేపథ్యంలో : లే - నవభారత - శక్తీ
లే - స్వతంత్ర వర - భక్తీ

బృందగానం : లే. లే - లే - లే

యువకులు : లే లే వీరయువకా

యువతులు : లే లే వీరనారీ

బృందగానం : శత్రుమూకలను భంజించి - నీ -
స్వరాజ్య రక్షణ కావించి
స్వాతంత్ర్యము పెం - పొందింప
స్వతంత్రమును పెం - పొందింప

యువకులు : లే లే వీరయువకా
తలచుకొమ్ము ఆ - స్వాతంత్ర్యపు దిన -
ధైర్యసాహసముల
లే లే వీరయువకా

యువతులు : లే లే వీరనారీ
నిలుపుకొమ్ము నీ - స్వతంత్ర భారత
నిఖిల సద్గుణముల -
లే లే వీరనారీ.

నేపథ్యగానం : జట్టులు గట్టి - గుట్టల మెట్టి
అడవులు కోనలు దాటి
సమర భూమిలో - శత్రు బలంతో
సాహసమున పో - రాడ
స్వరాజ్య రక్షా - కంకణులై
స్వతంత్ర దీక్షా - కంకణులై
సాగిరండు - సమ - యమ్ము మీరకే
శత్రుమూకలను - చెండాడ.

యువకులు : లే లే వీరయువకా

యువతులు : లే లే వీరనారీ

యువకులు : హిమాలయోత్తర - సీమలలో
హిమాలయోన్నత - భావములో -
ప్రజ్వరిల్లినది వీరత్వం

ప్రస్ఫుటించినది ధీరత్వం
లే లే - వీరయువకా
యువతులు : లే లే - వీరనారీ
స్వరాజ్య - మది యిక - అడుగంటినచో
సమ భావమ్మే - లేదు
స్వతంత్ర - మదిపో - గొట్టుకొన్నచో
సమాధానమే - లేదు
లే లే వీరనారీ
యువకులు : లే లే వీరయువకా
తగవులు మాని - స్పర్థలు మాని
సంఘ శక్తి చేబూని
చేయి చేయికొని - భావభావమును
సాగికూడి పెన - వేసికొని
లే లే వీరయువకా
యువతులు : లే లే వీరనారీ.
నేపథ్యగానం : స్వార్థ బుద్ధివిడు
దేశ భక్తి - సం -
క్షేమవృద్ధి - కొనియాడు
శక్తిచూపి - నీ
భక్తిచూపి - నీ
పరునితోడ - పోరాడు
తనువుపైన - నీ
ధనముపైన - నీ
మమతలెల్ల - విడనాడు
స్వేచ్ఛపోగ - నీ
ఆశ అణగ - నీ
కెన్నడేని మఱిరాదు
లేలే - లేలే -
బృందగానం : లేలే వీర యువకా
లేలే వీర నారీ
స్వదేశమునకై - స్వరాజ్యమునకై
స్వయంశక్తి చూపండి
త్యాగంతో - స్వార్థ
త్యాగంతో - దేశ
స్వాతంత్ర్యం ర - క్షించండి
ఆభరణాలూ ఆస్తులు సర్వం
ఆత్మార్పణములు కొనవే
కొనవే భారత మాతా !
కొనవే హిందూ మాతా !
[శరీరాలపైని ఆభరణాలు మున్నగునవి తీసి దేశ పటాని కెదురుగా రాసులుగా పోస్తారు]
నీ యశమే - మా - బాటల వెలుగై
నీ హృదియే మా - బ్రతుకుల విలువై
ఎనలే - నివిగా - అలరా - రునుగా
ఆహా ! భారత ప్రియజననీ !
నేపథ్యగానం : భారత హృదయము నెప్రాహా మనకై
సారథ్యము వహియించె నదే
భారత మాతను పరిరక్షింపగ
వీర కంకణము కట్టె నదే
వీరసింహులై ధీరశక్తులై
భారత యువకులు కదలండి
భారత యువతులు కదలండి
గర్జించిన యీ సింహాలకు మఱి
ఎదురే లేదని తెలుపండి -
బృందగానం : జాగృతి పొందిన సింహాలం
స్వతంత్ర భారత సింహాలం
స్వతంత్ర భారతి వీరమాతరా
భారత పౌరులు వీరులురా !
ప్రతి కణమున వీరత్వము పొంగే
ప్రతి పదమున శూరత్వము పొంగే
స్వతంత్ర భారత దేశము రా
పవిత్ర భారత దేశమురా
ప్రతి హృదయం రణరంగము కాగా
చైనా రానీ మఱేది రానీ
భారత శక్తిని చూపిస్తాం
స్వతంత్ర శక్తిని రక్షిస్తాం -
దాస్యములే దెన్నడు తల్లీ !
ఓటమిలే దెన్నడు తల్లీ !
ఇదె మా నిశ్చల దీక్ష
ఇదె నీకై మా రక్ష.
యువకులు : నీ హృదయమ్మున శక్తుల నన్నిటి
మా హృదయాలకు చొప్పించు

నీ హృదయమ్మున భావము లన్నిటి
మా హృదయమ్ముల పూరించు
అమ్మా ! భారతజననీ –
వందన
మమ్మా ! భారతజననీ –

బృందగానం : భారతావనీ పరమపావనీ
వీరపుత్ర జననీ
కొనవే – వందనమ్ము జననీ

యువకులు : మనసులందు – మా
మాటలందు – ని
త్యమ్ము నిలచునది – నీయశమే

యువతులు : తలపులందు – మా
తనువులందు – దీ
పించు నెప్పుడును – నీహృదియే

బృందగానం : నీ యశమే మా బాటల వెలుగై
నీహృదియే మా బ్రతుకుల విలువై
ఎనలేనివిగా అలరారునుగా
ఆహా ! భారత ప్రియజననీ
ఆహా ! భారత ప్రియజననీ

[ జయ స్వరాజ్య భారతీ – జయ
జయ స్వతంత్ర భారతీ – జయ
జయ వీరభారతీ. జయ – అని
తెర వేయబోయే ముందు జయధ్వానాలు పలకాలి ]

సూచన : బృందగానాలన్నీ రంగస్థలమందున్న యువతీ యువకులు పాడాలి.



# ఇనుప ఖనిజం ఎగుమతుల ద్వారా రూ. 50 లక్షల విదేశ మారకం ఆర్జన

## తొలి సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ మైనింగ్ కార్పొరేషన్ కృషి

ఆంధ్రప్రదేశ్ మైనింగ్ కార్పొరేషను ముడి ఇనుమును త్రవ్వి తీసే పని 1962 జనవరిలో ఆరంభించింది. ఒక సంవత్సర కాలంలోనే ఇది కృష్ణాజిల్లా గంద్రాయ ప్రాంతంలో 200,000 టన్నులకు పైగా ఈ ఖనిజాన్ని త్రవ్వి తీసి, భారత స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్ ద్వారా మచిలీపట్నం, కాకినాడ రేవుల నుంచి 100,000 టన్నులకు మించి దీనిని ఎగుమతి చేసింది. ఈ ఎగుమతుల ద్వారా కార్పొరేషను దేశానికి రూ. 50 లక్షలకు పైగా విదేశ మారకాన్ని ఆర్జించి పెట్టింది. సరుకును రేవులకు చేర వేయడానికి తగినంతగా రవాణా సౌకర్యాలు వున్నట్లయితే ఎగుమతులను మరింత హెచ్చించడానికి వీలుకలిగేది. వచ్చే సంవత్సరం కర్నూలు, అనంతపురం జిల్లాలలో గనులను తెరవడం ద్వారా, ముడి ఇనుమును ఇతోధికంగా వెలికి తీసి, సుమారు 300,000 టన్నుల ఖనిజాన్ని ఎగుమతి చేయడానికి కార్పొరేషను సంకల్పించింది.

వచ్చే ఏడాది అస్బెస్టాస్, సున్నపురాయి, బారైట్స్ మొదలైన ఇతర ఖనిజాలను త్రవ్వి తీయడానికి కూడా ఈ కార్పొరేషను పథకాలు రూపొందించింది. మైకా ఇటుక ఉత్పత్తి, యంత్రశక్తి ద్వారా బంకమన్ను శుభ్రం చేయడం, సున్నం కాల్చడం వంటి మధ్యతరహా పరిశ్రమలను అభివృద్ధి పరిచే పథకాలను కూడా కార్పొరేషను పరిశీలిస్తున్నది.

# ప్రశ్నోత్తరావళి

శ్రీ కె. శ్రీరాములు,
తువ్వాచలకరాయుడుపాలెం, చింతలపూడి తాలూకా, పశ్చిమ గోదావరి జిల్లా

ప్రశ్న : పశ్చిమగోదావరిజిల్లా, చింతలపూడి తాలూకాలో ఎర్రంపల్లి, నాగిరెడ్డి గూడెంల మధ్య తమ్మిలేరు రిజర్వాయరుకు 1962 ఫిబ్రవరి 13 వ తేదీన శంకుస్థాపన జరిగింది. ఆఫీసర్లకు నివాసగృహాలుకూడా నిర్మించారు. కాని ఈ రిజర్వాయరు పనులను ఇంకా ఆరంభించలేదు. వీటిని ఎప్పుడు ప్రారంభించేదీ, రిజర్వాయరు ఎప్పటికి పూర్తయ్యేదీ తెలుపుతారా?

సమాధానం : ఎర్రంపల్లి వద్ద తమ్మిలేరు రిజర్వాయరు నిర్మాణానికి పరిపాలనా సంబంధమైన ఆమోదం ఇంకా లభించలేదు. ఉత్తర్వులు వచ్చిన తరువాత ఈ పనులను ఆరంభిస్తారు.

ప్ర: పొదుపరి తనంతగా వుండవలసిన అవసరాన్ని ఈనాడు నొక్కిచెబుతున్నారు. ఈ విషయంలో అవలంబించాల్సిన కొన్ని విధానాలను గూర్చి తెలుపుతారా?

స : ఇందుకు దిగువ తెలిపిన చర్యలు తీసుకోవచ్చు :—

(1) ఆహారం దుబారా చేయకండి. ఎప్పుడూ బియ్యం వాడేవారు బియ్యం వాడకం తగ్గించి గోధుమ వాడకం హెచ్చించవచ్చు. ఈ మార్పువల్ల మనదేశానికి విదేశ మారకం మిగిల్చిన వారవుతారు.

(2) విందులు తగ్గించండి. వివాహాలు నిరాడంబరంగా జరపండి. జన్మదిన కానుకలకు స్వస్తి చెప్పండి. ఒకవేళ మీరు ఈకానుకలుసమర్పించడం అవసరమనుకుంటే వాటిని రక్షణ సర్టిఫికెట్ల రూపంలో ఇవ్వండి.

(3) ఉక్కు, సిమెంటు, కలప, లోహాలు, కిరసనాయిలు, కాగితం, విద్యుచ్ఛక్తి మొదలైన పరిమిత సాధన సామగ్రిని పొదుపుగా వాడండి.

(4) టీ, కాఫీ, వస్త్రం, గోనెసంచులు, నూనెలు, జీడిపప్పు వంటి ఎగుమతి చేయబడే పదార్థాలను ఎక్కువగా కొనకండి.

(5) ప్రయాణాలు తగ్గించండి.

శ్రీ ఆర్. సి. నటరాజన్, బొబ్బిలి.

ప్ర: బొబ్బిలి తాలూకాలో కమ్యూనిటీ రేడియో సెట్లులేవు. ప్రస్తుత అవాంతర పరిస్థితిలో జాతీయ సమైక్యతను పెంపొందించడానికి ఇవి చాలావరకు తోడ్పడతాయి కదా. వీటిని నెలకొల్పే ప్రతిపాదనలేమైనా వున్నాయా?

స : శ్రీకాకుళంజిల్లా బొబ్బిలి తాలూకాలో ఇదివరకే 67 కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పడం జరిగింది. వీటిలో బొబ్బిలి బ్లాకులో 18 సెట్లు, తెర్లం బ్లాకులో 11 సెట్లు, మరదం బ్లాకులో 22 సెట్లు, బలిజిపేట బ్లాకులో 16 సెట్లు పనిచేస్తున్నాయి.

---

## "వందే మాతరం"
### నాటక ప్రదర్శనం

నేఫా అగ్రప్రాంతంలోని ఒక గస్తీ కేంద్రంలో మన సైనికుల కృషిని చిత్రించే "వందే మాతరం" అనే నాటకం ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌర సంబంధాలశాఖ అధ్వర్యంలో 1963 జనవరి 20 వ తేదీన హైద్రాబాదులోని ఎగ్జిబిషన్ థియేటరులో ప్రదర్శించబడింది. ఈ నాటక రచయిత శ్రీ గొల్లపూడి మారుతీరావు, నాటకంలో ముఖ్యపాత్ర అయిన "కల్నల్" భూమిక నిర్వహించారు. ఆయనే దీనికి దర్శకత్వంకూడా వహించారు. హిమాలయ ప్రాంతంలోని యుద్ధపరిస్థితులను ఈ నాటకం వాస్తవికంగా చిత్రించింది. మన జవానులు ప్రదర్శించిన శౌర్య పరాక్రమాలను, త్యాగనిరతినికూడా ఇది దిఙ్మాత్రంగా చిత్రీకరించింది.

ఈ ప్రదర్శనానికి ప్రేక్షకులు అధిక సంఖ్యలో వచ్చారు. జాతీయ రక్షణ నిధికి వసూళ్ళ నిమిత్తం ప్రవేశానికి తక్కువ రేట్లకు టిక్కెట్లు విక్రయించారు.

# త్యాగానికి సమయమిదే!

ఉత్పల సత్యనారాయణాచార్య

ఛీ యుద్ధ మదోన్మాదీ !
చీనా సామ్రాజ్యవాది !
తిరిగిపో తిరిగి పో —
సరిహద్దులు విడిచి పో —

భరతావని నీ పాపపు పాదాలను ఉంచినావు
భారత జనతా హృదయము ప్రజ్వరిల్ల జేసినావు
పంచశీల ఒప్పందము వంచన కావించినావు
శాంతికాముకుల మీదను శస్త్రాలను వైచినావు
స్నేహ సామరస్యములను చెడ గొట్టుక పోయినావు
పొరుగునున్న దేశాలను దురాక్రమణ జరిపినావు
శాంతిదూత నెహ్రూతో పంతమాడ దొడగినావు
అమాయికుల నీ ప్రజలను సమూహముగ చంపినావు
ప్రజ కన్నము పెట్టలేక ప్రాజెక్టులు కట్టలేక
సకల దేశములమాదిరి సభ్యత సాధింప లేక
శాంతిగ పదిమందితోడ సహజీవనమిష్టపడక
విజ్ఞానపు వీధిలోన వెస పురోగమించ లేక
యుద్ధమనే నెపమున సరిహద్దుల నీదు ప్రజల
ప్రాణాలను వ్యర్థముగా బలిపెట్టగ పూనినావు
ప్రజాస్వామ్య పాలనలో భారతదేశాభివృద్ధి
నీ వొకడవె చూపోపక నిప్పులు చెరిగించినావు
అంతర్జాతీయ రంగ మందశాంతి రేపినావు
నేటి యీ ప్రపంచమెల్ల నిన్నొకనినె నిన్నొకనినె
దురాక్రమణదారునిగా మరియాదకు దూరునిగా
ఒక మిత్ర ద్రోహినిగా యుద్ధమదోన్మాదునిగా
వ్రేలిడి చూపిస్తున్నది వేయి కండ్ల చూస్తున్నది.

నవ భారత యువకులార !
నౌ జవానులార ! రండు !
రండో రా రండు రండు !
రణభేరీ నినదం బదె
త్యాగానికి సమయమిదే ! ధైర్యానికి సమయమిదే !
శౌర్యానికి సమయంబిదె ! స్థైర్యానికి సమయంబిదె !
చైనా ఒక జపానుకే శత్రువగుట కాదిప్పుడు
స్వేచ్ఛగోరు జగతికెల్ల చీనా ఒక్కటె శత్రువు
బంగారమె కాదు మాదు ప్రాణాలను ధారపోసి
సరిహద్దుల రక్షింతుము శత్రువులను శిక్షింతుము
అంగుళమైనను శత్రువు హస్తగతము కానీయము
దగాకోరు చైనీయుని దరిదాపుల రానీయము
చైనా విస్తరణ కాంక్ష సామ్రాజ్యపు క్షుద్రవాంఛ
ఇంచుకైన సాగనీము ఏలాగుననుసాగనీము.
వీరాగ్రేసరులారా !
భారత సైనికులారా !
నలభై కోటుల భారత నరనారీ జన మెల్లను
మీ వెంబడి నిలుచున్నది మీకు రక్షగా నున్నది.
దురాక్రమణ దారులపై ద్రోహులపై దుష్టులపై
శతశతఘ్నులను ప్రేల్చుడు చాపకట్టుగా కూల్చుడు
చైనా సామ్రాజ్యవాద జడులను మాఱొడ్డి చెండి
హిమాలయములందే పెను సమాధులను గట్టించుడు
రండో రా రండు రండు ! రణభేరీ నినదంబదె !
త్యాగానికి సమయమిదే ! ధైర్యానికి సమయమిదే !
శౌర్యానికి సమయమిదే ! స్థైర్యానికి సమయమిదే !




### ఇనాము భూములపై శిస్తువిధింపు

1955 వ సం. పు. ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర ప్రాంతం) ఇనాముల (శిస్తు) చట్టం క్రింద ప్రభుత్వం, ఇనామ్‌దార్లు ఇదివరలో ప్రభుత్వానికి చెల్లిస్తున్న "క్విట్ రెంట్" అనే శిస్తు స్థానే చిన్నపాటి ఇనాములపై రైత్వారీ సూత్రాల ప్రాతిపదికపై పూర్తి శిస్తు విధించి, వసూలు చేస్తున్నది. 1956 వ సం. పు. ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర ప్రాంతం) ఇనాముల (రద్దు, రైత్వారీ క్రింద మార్పు) చట్ట నిబంధనల క్రింద రైత్వారీ శిస్తుకు లోబడిన రైత్వారీ పట్టాలను అనేక చిన్న ఇనాముల విషయంలో ఇనామ్ దారుకుకానీ లేదా సేద్యంచేస్తున్న కౌలు దారుకుకానీ మంజూరు చేయడంకూడా జరిగింది.

పైన పేర్కొన్న చట్టాలక్రింద ప్రస్తుతం వసూలు చేయబడుతున్న పూర్తి శిస్తురేట్లు, పొరుగునవున్న ఆదేరకమైన రైత్వారీ భూములపై ప్రస్తుతం అమల్లోవున్న రైత్వారీ సెటిల్మెంటు లేక రీసెటిల్మెంటు నోటిఫికేషను క్రింద విధిస్తున్న సెటిల్మెంటు రేట్ల కంటే చాలా అధికంగా వున్నాయని కొన్ని ప్రాంతాలలోని కొందరు ఇనామ్ కౌలుదార్ల నుంచి లేదా వారి తరపున ఇటీవల ప్రభుత్వానికి విజ్ఞాపనలు అందాయి. ప్రభుత్వం యీ పరిస్థితిని జాగ్రత్తగా పరిశీలించి, ఇట్టి సందర్భాలన్నింటిలోనూ, ఇనాముల శిస్తు చట్టం లేదా ఇనాముల రద్దుచట్టం క్రింద ప్రస్తుతం విధిస్తున్న శిస్తురేట్లను పొరుగున వున్న అదేరకపు భూములపై విధించే రైత్వారీ సెటిల్మెంటురేట్ల స్థాయికి తగ్గించి రైతులకు సహాయం కల్పించాలనే అభిప్రాయానికి వచ్చింది.

కాబట్టి పైన తెలిపిన రెండు చట్టాల క్రింద అధిక శిస్తు రేట్ల విధింపుకు గురైన చిన్న ఇనామ్‌దార్లు లేదా రైతులందరూ తమ తమ ప్రాంతానికి సంబంధించిన అసిస్టెంట్ సెటిల్మెంటు ఆఫీసరుకు వ్యక్తిగతంగా దరఖాస్తులు ఇవ్వాలి. ఈ విషయంలో తగుచర్య తీసుకోడానికి వీలుగా దరఖాస్తులలో ఇనాము భూములకు సంబంధించిన సమస్త వివరాలను, ఇప్పుడు కలిగిన ఇబ్బంది, అందుకు పొందగోరే సహాయాన్ని స్పష్టంగా తెలియజేయాలి. దరఖాస్తులు ఆయా అసిస్టెంట్ సెటిల్మెంట్ ఆఫీసర్లకు 1963 ఫిబ్రవరి 28 వ తేదీన కానీ అంతకు పూర్వంకాని దాఖలు చేయాలి.

### చెరకు సలహా సంఘం

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం యీ క్రింది సభ్యులతో చెరకు సలహా సంఘాన్ని ఏర్పాటు చేసింది :— వ్యవసాయశాఖామంత్రి ; పరిశ్రమలశాఖామంత్రి ; సహకారశాఖామంత్రి; వ్యవసాయశాఖ డైరెక్టరు ; వాణిజ్య, పరిశ్రమలశాఖ డైరెక్టరు ; సహకార సంఘాల రిజిస్ట్రారు ; శ్రీ ఆర్. వి. జి. కె. రంగరావు, ఎం. పి. బొబ్బిలి; శ్రీ సి. సుదర్శనరాజు, విశాఖపట్నం, శ్రీ ఎస్. బి. పి. బి. కె. సత్యనారాయణరావు, సర్వారాయ షుగర్స్ లిమిటెడ్, చెల్లూరు, శ్రీ ఎం. హరిశ్చంద్ర ప్రసాద్, తణుకు ; శ్రీ ఎం. సీతారామారావు, ఉయ్యూరు ; శ్రీ కె. రఘునాధరెడ్డి, చిత్తూరు; శ్రీ డి. వి. జి. కృష్ణమూర్తి, షక్కర్‌నగర్ ; శ్రీ ఆర్. ఎల్. ఎన్. దొర, శ్రీకాకుళం ; శ్రీ బంగారరాజు, విశాఖపట్నం ; శ్రీ వి. ముత్యాలరావు, ఎం. ఎల్. ఎ. నరేంద్రపురం, శ్రీ కాకాని వెంకటరత్నం, ఎం. ఎల్. ఎ; శ్రీ యార్లగడ్డ అంకినీడు ప్రసాద్, చల్లపల్లి; శ్రీ వి. రాజారెడ్డి, వల్లినేదు ; శ్రీ లక్ష్మీ చంద్, బోధన్.

ఈ కమిటీకి చెరకు పరిశ్రమశాఖ డిప్యూటీ కమీషనరు ఎక్స్ – అఫిషియో కార్యదర్శిగానూ, వ్యవసాయశాఖామంత్రి ఎక్స్ – అఫిషియో అధ్యక్షులుగానూ ఉంటారు. ఈ కమిటీ కాలపరిమితి మూడేళ్ళు. అయితే అవసరమనుకుంటే ప్రభుత్వం దీనిని యీ లోపలే ఉత్తర్వుద్వారా రద్దు చేయవచ్చు.

### సిమెంటు పంపిణీ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సిమెంటు పంపిణీపై స్టాకిస్టు స్థాయిలో పూర్తి కంట్రోలు విధించింది. కాబట్టి ప్రజలు నిర్మాణాల నిమిత్తం సిమెంటు తీసుకోడానికి ఈ సూచనలను పాటించవలసిందిగా కోరడ

మైనది. నివాస గృహాల నిర్మాణానికి కానీ, కొద్దిపాటి మరమ్మతుల కొరకు కానీ 200 సంచులకంటె తక్కువ పరిమాణంలో సిమెంటు అవసరమైన హైద్రాబాదు, సికింద్రాబాదు కార్పొరేషను మునిసిపల్ హద్దులలోని సిమెంటు వాడకందార్లు హైద్రాబాదులోని ఆంధ్రప్రదేశ్ కంట్రోలు సరకుల డైరెక్టరుకు దరఖాస్తులివ్వాలి. ఈ విధంగా దాఖలుచేసే దరఖాస్తుపై ఒక రూపాయి కోర్టు ఫీజు స్టాంపును అంటించాలి.

హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాలు మినహా హైద్రాబాదు జిల్లాలోని సిమెంటు వాడకందార్లు హైద్రాబాదు కలెక్టరుకు దరఖాస్తులు ఇవ్వాలి. రాష్ట్రంలోని ఇతర జిల్లాలకు చెందిన సిమెంటు వాడకందార్లు 100 మొదలు 199 సంచుల వరకు సిమెంటు అవసరమైనవారు – ఆయా జిల్లా కలెక్టర్లకు దరఖాస్తులు దాఖలుచేయాలి. 99 సంచుల వరకు సిమెంటు అవసరమైనవారు ఆయా తహశీల్దార్లను కలవాలి.

నిర్మాణాల నిమిత్తం 200 సంచులకు మించి సిమెంటు అవసరంవున్న రాష్ట్రంలోని సిమెంటు వాడకందార్లందరూ హైద్రాబాదులోని కంట్రోలు సరకుల డైరెక్టరుకు ఆయా తహశీల్దార్లద్వారా దరఖాస్తులు ఇవ్వాలి. అర్హతగల ఇంజనీరు తయారుచేసిన ధ్రువీకృత ప్లానులను, అంచనాలను దరఖాస్తుతో జతచేసి పంపాలి. దరఖాస్తుపై ఒక రూపాయి కోర్టు ఫీజు స్టాంపు అంటించాలి.

స్టాకిస్టుల స్థాయిలో సిమెంటుపై పూర్తి కంట్రోలును విధించినందునా, కొన్ని ప్రాంతాలలో కొందరు అమ్మకం దారులు బ్లాక్‌మార్కెట్, సిమెంటును కల్తీచెయ్యడం వంటి అక్రమ చర్యలకు పూనుకునే అవకాశం వున్నందునా, 1962 వ సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ సిమెంటు కంట్రోలు ఉత్తరువులోని 13 వ నిబంధన క్రింద రెవిన్యూశాఖలోని తహసీల్దారు హోదాలోని అధికారులకూ కంట్రోలు సరకుల డైరెక్టరు కార్యాలయంలోని అసిస్టెంటు డైరెక్టర్లకూ అధికారాలను దత్తంచేస్తూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉత్తరువు జారీచేసింది.

అందువల్ల ఆ నిబంధన క్రింద దానిలో తెలిపిన విధంగా ఎంట్రీ, పరిశీలన మొదలైన అధికారాలు దిగువ అధికారులకు ఇవ్వబడ్డాయి :–

హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషన్ హద్దులలో :

1. అసిస్టెంటు డైరెక్టరు (కంట్రోలు సరకుల డైరెక్టరు కార్యాలయం–) ఉక్కు.

2. అసిస్టెంటు డైరెక్టరు. – (కంట్రోలు సరకుల డైరెక్టరు కార్యాలయం–) ప్రధాన కార్యస్థానం

3. కంట్రోలు సరకుల డైరెక్టరు కార్యాలయంలో నియమింపబడే ఏ ఇతర అసిస్టెంటు డైరెక్టరయినా.

హైదరాబాదు కార్పొరేషన్ హద్దులు మినహా అన్ని జిల్లాలలో :

1. జాయింట్ కలెక్టర్లతో సహా ఆయా జిల్లాలలోని కలెక్టర్లు, గెజిటెడ్ హోదాగల వారి పర్సనల్ అసిస్టెంట్లు.

2. ఆయా సబ్ డివిజన్‌లలోగల డిప్యూటీ కలెక్టర్లు, లేక రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్లు, అసిస్టెంటు కలెక్టర్లు, సబ్ – కలెక్టర్లు.

3. ఆయా తాలూకాలు లేదా, సబ్ తాలూకాలలోగల తహశీల్దార్లు లేక సబ్–తాలూకా పనిని స్వయంగాచూసే డిప్యూటీతహసీల్దార్లు.

## మోటారు శకటాల సేకరణ

భారతరక్షణ నియమావళి క్రింద, మోటారు శకటాలను ఇవ్వమని కోరడానికీ, ఆ శకటాలను స్వాధీనం చేసుకోడానికీ సంబంధించిన అధికారాలను దిగువ పేర్కొన్న వారికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సంక్రమింపజేసింది.

1. ట్రాన్స్‌పోర్టు కమీషనరు, హైద్రాబాదు – రాష్ట్రమంతటా. 2. పోలీసు కమీషనరు (హైద్రాబాదు) హైద్రాబాదు, సికిందరాబాదు నగరాలలో, 3. కలెక్టరు, జిల్లా మెజిస్ట్రేట్లు – తమతమ అధికార పరిధులలో.

## ట్రాన్సిస్టర్ రేడియో సెట్లు

మన సరిహద్దులను సంరక్షిస్తున్న మన సాయుధ సైనికుల సౌకర్యార్థమై పెద్ద మొత్తంలో ట్రాన్సిస్టర్ రేడియో సెట్లు అత్యవసరంగా కావలసి ఉన్నాయి. ట్రాన్సిస్టర్ రేడియో సెట్లను వెంటనే విరాళంగా ఇవ్వాలని ప్రజలకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం విజ్ఞప్తి చేస్తున్నది. ట్రాన్సిస్టర్ రేడియో సెట్లను విరాళంగా ఇవ్వదల్చిన పౌరులు దిగువ వివరాలను టెలిగ్రాంద్వారా గానీ, ఉత్తరంద్వారాగానీ, డైరెక్టర్, సమాచార పౌర సంబంధాలశాఖ, హైదరాబాదు–౧ అనే చిరునామాకు వెంటనే తెల్పాలని విజ్ఞప్తి.

౧. తయారి, ౨. మోడల్‌నెంబరు, ౩. బ్యాండ్స్ సంఖ్య, ౪. దాతపేరు, తపాల చిరునామా, ౫. దాత టెలిగ్రాఫ్ అడ్రసు, ౬. దాతలు హైదరాబాదు, సికింద్రాబాద్ నగరాలవారైతే టెలిఫోను నెంబర్లు. ★

ఈ సంచికలోని శ్రీ పి. వి. నరసింహారావుగారి వ్యాసం ఆలిండియా రేడియో హైదరాబాద్ కేంద్రంవారి సౌజన్యంతో ప్రచురితమైంది.



# ప్రగతి పథంలో

(జిల్లాలనుంచి అందిన అభివృద్ధి కార్య క్రమాలను గురించిన సంక్షిప్త వార్తలు)

## ఆదిలాబాదు

*రక్షణ ప్రదర్శనం :*

ఆదిలాబాదు కలెక్టరు 1962 డిశంబరులో జిల్లా కేంద్ర గ్రంథాలయంలో రక్షణ ప్రదర్శనాన్ని ప్రారంభిచారు.

*రక్షణనిధికి గడియారం సమర్పణ :*

భైన్సాలో జరిగిన బహిరంగ సభలో జిల్లా కలెక్టరు తమ చేతిగడియారాన్ని విరాళంగా ఇచ్చారు. దానిని వేలంవేయగా రూ. 2,652 లు లభించాయి. ఈ మొత్తాన్ని జాతీయ రక్షణనిధికి సమర్పించారు.

## చిత్తూరు

*నేత్ర చికిత్సా శిబిరం :*

డా. ఎం. సి. మోడి, తిరుపతి కొత్త సత్రంలో, 1962 డిశంబరు 7 వ తేదీనుంచి పక్షం రోజులపాటు ఉచిత నేత్ర చికిత్సా శిబిరం నిర్వహించారు. తిరుమలై - తిరుపతి దేవస్థానం ఆధ్వర్యంలో ఇది నిర్వహించబడింది. ఈ దేవస్థానం దీనిపై ఏటా రూ. 15,000 లు ఖర్చు చేస్తుంది.

## హైద్రాబాదు

*విద్యార్థి ఔదార్యం :*

ప్రొఫెసర్ సయీదుద్దీన్ అఖిలభారత అంతర్ కళాశాల వక్తృత్వ పోటీలో బహుమతి పొందిన ఉస్మానియా విశ్వ విద్యాలయ ఆర్ట్సు కళాశాల విద్యార్థి శ్రీ ఎం. జె. అభిశంకర్ తనకు బహుమతిగా లభించిన పుస్తకాలను, సరిహద్దులలో పోరాడుతున్న జవానులకు పంపడానికై అధ్యక్షునికి విరాళంగా అందజేశారు.

## కరీంనగరం

*నేత పనివారల విరాళము :*

సమాచార, న్యాయశాఖల మంత్రి డిశంబరు మూడవ వారంలో మెట్పల్లికి వెళ్ళిన సందర్భంలో, జగిత్యాల, హుజూర్, బోయినపల్లిలలోని ఖాదీ ఉత్పత్తి కేంద్రాలకు చెందిన నేత పనివారలు ఆయనకు రక్షణనిధి నిమిత్తమై రూ. 1,000 లకు ఒక చెక్కు సమర్పించారు.

*నెల జీతం సమర్పణ :*

మెట్పల్లిలోని ఎక్సైజు డిపోలో బంట్రోతుగా పనిచేస్తున్న శ్రీ అల్లాబక్ష్ అనే వ్యక్తి తన నెల జీతమైన రూ. 50/- ల మొత్తాన్ని రక్షణనిధికిగాను మంత్రికి సమర్పించాడు. మంత్రి, శ్రీ అల్లాబక్ష్‌ను అభినందిస్తూ, "మీలాంటి వదాన్యులు వర్ధిల్లుగాక" అన్నారు.

*సమితి సభ్యుల సిటింగ్ ఫీజు :*

కరీంనగరం పంచాయతీ సమితి సర్వ సభ్య సమావేశం జనవరిలో జరిగింది. తమకు లభించే సిటింగ్ ఫీజు మొత్తాలను జాతీయ రక్షణ నిధికి సమర్పించడానికి ఈ సమావేశంలో సభ్యులు నిర్ణయించారు.

## కృష్ణా

*సహాయార్థక ప్రదర్శనం :*

జాతీయ రక్షణనిధి సహాయార్థం, బొంబాయికి చెందిన సుప్రసిద్ధ కళాకారులు ఝవేరీ సోదరీమణులు డిశంబరు 22న విజయవాడలో నాట్యప్రదర్శన లిచ్చారు. ఈ కార్యక్రమానికిరూ. 50,000 లు వసూలయ్యాయి. ఆరోగ్యశాఖామంత్రి ఈ ప్రదర్శనకు అధ్యక్షత వహించారు.

## కర్నూలు

*ఆలూరు రక్షణ సంఘం విరాళం :*

ఆలూరు బ్లాకుస్థాయి రక్షణ సంఘం, డిసెంబరు 19 వ తేదీన జాతీయ రక్షణ నిధికై రూ. 5,000 లకు ఒక చెక్కును ఆంధ్రప్రదేశ్ గవర్నరుకు సమర్పించింది.

## మహబూబ్‌నగరం

*కొల్లాపూర్ బ్లాకు :*

కొల్లాపూర్ పూర్వ విస్తరణ బ్లాకు 1956 ఏప్రిల్ మొదటి తేదీన ఏర్పడింది. 1956 సెప్టెంబరు 1వ తేదీన ఇక్కడ పంచాయతీ సమితిని ఏర్పరిచారు. ఇది ప్రథమ దశను విజయవంతంగా పూర్తి చేసుకొని 1962 ఏప్రిల్ 1 వ తేదీన ద్వితీయదశలో ప్రవేశించింది. ఈ బ్లాకులో 80 గ్రామాలు, 40 పంచాయతీలు వున్నాయి.

## మెదక్

*విద్యార్థుల ఉత్సాహం :*

మెదక్ విద్యార్థులు, ఉపాధ్యాయులు జాతీయ రక్షణనిధి సహాయార్థం, రామాయంపేటలో "దేశాభిమానం" అనే నాటకం ప్రదర్శించారు. ఈ ప్రదర్శనకు వసూలైన నికర మొత్తం రు. 2,148 లను రక్షణనిధికి సమర్పించారు.

## నల్గొండ

*పశుప్రదర్శనం :*

ఆలేరు పంచాయతీ సమితిలోని యాదగిరిగుట్టలో డిసెంబరు 4,5 వ తేదీలలో జిల్లా పశుప్రదర్శనం జరిగింది. రాష్ట్ర నీటి వనరులు, విద్యుచ్ఛక్తి శాఖల మంత్రి డిసెంబరు 5 వ తేదీన బహుమతులు అందజేశారు.

*బ్లాకు ప్రారంభోత్సవం :*

తురకపల్లి పూర్వ విస్తరణ బ్లాకును ప్రణాళికా పంచాయతీ రాజ్య శాఖల మంత్రి డిసెంబరు 2 వ తేదీన ప్రారంభించారు.

*భూరి విరాళం :*

ముఖ్యమంత్రి డాక్టర్ నీలం సంజీవరెడ్డి జనవరి 5 వ తేదీన చౌటుప్పల్, నల్గొండలను సందర్శించారు. ఈ సందర్భంలో నల్గొండలో జరిగిన బ్రహ్మాండమైన బహిరంగ సభలో ముఖ్యమంత్రికి జాతీయ రక్షణనిధి నిమిత్తమై రూ. 4.56 లక్షలు అందజేశారు. ముఖ్యమంత్రికి వేసిన పూలదండను వేలం వేయగా రూ. 1,116 లు వచ్చాయి.

## విశాఖపట్నం

*కాల్టెక్స్ విరాళం :*

భారత దేశంలోని కాల్టెక్స్ మార్కెటింగ్, రిఫైనింగ్ కంపెనీల తరపున, కాల్టెక్స్ ఇండియా లిమిటెడ్ ఉపాధ్యక్షుడు శ్రీ హెచ్. డి. డెన్నిస్ రక్షణనిధికై రూ. 5 లక్షలకు ఒక చెక్కును జనవరి 3 వ తేదీన ఆంధ్రప్రదేశ్ గవర్నరుకు అందజేశారు.

## వరంగల్

*రూ 43,000 ల సమర్పణ :*

డిసెంబరు 21 వ తేదీన తొర్రూర్‌లో జరిగిన సభలో నెల్లికుదురు పంచాయతీ సమితి ప్రజలు, సంస్థల పక్షాన క్యాష్ బ్యాంక్ డ్రాఫ్టులు మొదలైన వాటి రూపంలో దాదాపు రూ. 43,000 లను రెవెన్యూ మంత్రికి సమర్పించారు.

*విద్యుచ్ఛక్తి సరఫరా :*

సమాచార, న్యాయ శాఖల మంత్రి డిశంబరు 5 వ తేదీన మడికొండలో విద్యుచ్ఛక్తి సరఫరాకు ప్రారంభోత్సవం చేశారు.

*ములుగు సమితి విరాళం :*

ములుగు పంచాయతీ సమితి ప్రజలు, సంస్థలతరపున డిశంబరు మూడవ వారంలో జాతీయ రక్షణనిధికై రూ. 25,000 ల మొత్తం రెవెన్యూ మంత్రికి ములుగులో సమర్పించ బడింది.

*బీదవ్యక్తి విరాళం :*

బహిరంగ సభలో చెన్నప్ప అనే బీదవాడైన ఒక కుంటివ్యక్తి తాను పొదుపుచేసిన రూ. 30 లను రక్షణనిధికై మంత్రికి సమర్పించాడు. అతని ఔదార్యం అక్కడ వారందరినీ ముగ్ధులను చేసింది.

## పశ్చిమ గోదావరి

*సమాచార కేంద్రం ప్రారంభం :*

ఏలూరులోని జిల్లా పౌర సంబంధాధికారి కార్యాలయంలో డిసెంబరు 30వ తేదీన పశ్చిమ గోదావరి జిల్లా కలెక్టరు, జిల్లా సమాచార కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు.

---

**వదంతులను వినకండి!**
**వదంతులను ప్రచారం చేయకండి!**

---

# మహాకవి "కాటూరి"

బాలాంత్రపు రజనీకాంతరావు

"బందరులో పింగళి కాటూరు కవుల 'తొలకరి'లో కొంత జాతీయోద్యమ ప్రభావం కనపడినా 'సౌందరనందం'లోనూ తరువాత కాటూరి 'పౌలస్త్యహృదయం' 'గుడిగంటల' లోనూ మానవోద్యమవికాసం బాగా స్ఫురిస్తుంది. పూర్వాంధ్ర మహాకావ్యాలన్నీ మనస్సులో ఇంకగా ఇంకగా తయారయిన శిల్పమూ, బాణీ వీళ్లది. శాంత సుందరంగా గంభీరంగా, మహా హుందాగా నడుస్తాయి వీరి భావనా, పద్యమూ కూడా. వ్యక్తిపరమైన ప్రేమ సంఘాన్ని ఉజ్జీవింపజేసే కరుణగా ఎలాగ మారిందో 'సౌందర నందము' లో వర్ణిస్తారు. దీనిలో గాంధీ యుగ ప్రభావం కనిపిస్తుంది. 'ఆకుల్ రాలని పూలు వాడని వసంతారామం' లాగ ఉంటుంది వీళ్ళ కావ్యం.'

పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము అనే వ్యాసంలో కృష్ణశాస్త్రిగారు వ్రాసిన యీ సమాలోచనా వాక్యాలు పింగళి కాటూరుల కావ్యాలకు ఆధునికాంధ్ర సాహిత్య చరిత్రలోని ప్రత్యేక స్థానాన్ని ప్రకటిస్తున్నాయి. పురాలబ్ధ ప్రతిష్ఠులైన యీ జంట కవులలోని కాటూరి మనకింక కనిపించరు- వినిపించరు.

రావీ వేపలలాగ జంటకవులు తెలుగుతల్లి పొలములో మాత్రము అపరూపముగా పెరిగిన విశిష్ట సంప్రదాయం. ఆంగ్ల సాహిత్యంలో బోమా, ఫ్లెచర్ జంటకవులని వింటూంటాం. సంస్కృతంలోగాని, ఇతర ప్రపంచ భాషలలోగాని ఈ సంప్రదాయం లేదు. తెలుగులో మధ్యయుగం వారయిన నంది మల్లయ్య, ఘంట సింగనలు దారితీయగా ఆధునిక యుగసంధ్యలో దేవులపల్లి సోదర కవులు, తిరుపతి వేంకటకవులు, కొప్పరపు సోదరకవులు, వారితర్వాత వేంకట పార్వతీశ్వరులు, పింగళికాటూరులు – ఆ సంప్రదాయాన్ని అనుసరించి ప్రసిద్ధి పొందారు.

ఈ జంటలలో చివరి రెండు జంటలకు స్వరూప స్వభావాలలోను, కవితారీతులలోను చాల పోలికలున్నాయి – ఈ రెండు జంటలలోను ఒకరు నాకు తండ్రికావడమూ, ఒకరు గురువుకావడమూవలన సన్నిహితులనేమాట అటుంచండి: ఒక జంటలో పార్వతీశంగారూ, రెండవ జంటలో కాటూరివారూ వెళ్ళిపోయి, వేంకటరావుగారూ, పింగళివారూ మనతో పాటు తమ సహచరులకోసం దిగులులోపడి మిగిలారు. వారికావ్యాలు మిగిలాయి.

జంటకవులు ఉభయులూ కలిసి చేసి, ప్రకటించిన కావ్యాలుంటాయి. వారు విడివిడిగా ఒక్కొక్కరూ వ్రాసి ప్రకటించిన వుంటాయి. ఉభయులూ కలిసి వ్రాసి ప్రకటించిన కావ్యాలు–ఎలావ్రాస్తారో– ఒకరొక పద్యమూ మరొకరొకపద్యమూ వ్రాస్తారా, ఒకరొక పంక్తి మరొకరొక పంక్తీ వ్రాస్తారా? ఎవరికివారు వేరువేరుగా వ్రాసి అన్నిపద్యాలూ కలిపి ఇద్దరిపేర్లూ పెట్టుకుంటారా?' అని యీ విధంగా పాఠకులు వింతగా ప్రశ్నించుకుంటూంటారు. ఆ జంటకవులలో వొక్కొక్కరిని అభిమానంగా చూసుకొనే శిష్యులు 'ఇదిగో ఈ పద్యం, లేక, ఈ పాదం మా గురువుగారు వ్రాసిందీ, ఆ మిగిలినది రెండో ఆయన వ్రాసినదీ' అంటూంటారు. ఇవన్నీ అభిమానంతోటో, తమ పరిశోధనా పాటవం చాటుకోడానికో అనే మాటలేకాని, వాస్తవానికి ఎంతో దూరాన ఉండేమాటలు.

'నేను ఆత్మ – అతను శరీరం; అతను ఆత్మ – నేను శరీరం.' – 'వేంకటేశ్వరరావే నేను – నేనే వెంకటేశ్వరరావు' అని పింగళి లక్ష్మీకాంతంగారు అన్నమాటల అంతరార్థం అవగాహన చేసుకుంటే జంట కవులెంత అవినాభావంగా ఉంటారో తెలుస్తుంది. ఒకే విషయంపైని ఇద్దరినీ వేరు వేరు గదుల్లో కూర్చోపెట్టి పద్యం చెప్పమన్నా – ఒకే పద్యం తయారయేటంత ఏకత్వం వారి భావనలోను, పదశిల్పంలోను కుదిరినప్పుడే వారు జంటకవులు కాగలుగుతారు. నవ్య సాహిత్యోద్యమపు తొలకరియైన తొలకరిని గురించీ, గాంధీ యుగతత్త్వానికి ప్రతిబింబాలయిన 'సౌందర నందము' 'గుడిగంటలు' కావ్యాలను గురించీ, సాహిత్య పరులయిన చదువరులందరూ ఎన్నిసార్లయినా ఎందరి పొగడ్తలో వినిఉంటారు. ఆ చదువరులకు అంత పరిచితిలేని – కాటూరివారి కృషిలోని మరొక రంగం గురించి పరిచయం చేస్తానిప్పుడు.

కాటూరివారికి జంటకవులుగా ఉన్నప్పుడు పింగళి వారితో ఎలాంటి అవినాభావసంబం

ధమో అలాంటి సాన్నిహిత్యం పాతికేళ్ళుగా దేవులపల్లి కృష్ణశాస్త్రిగారితో ఏర్పడి పోయింది. ఉభయులూ కలిసి అనుకొని జంట కవిత్వం వ్రాసినా అపూర్వ శిల్పకావ్యాలు వెలువడేటంత ఏకత్వం వారి భావనలో పదాల కూర్పులోకూడా వెల్లివిరిసింది. అందుకే అన్నారనుకుంటాను — కాటూరివారు తమ మువ్వగోపాల నాటికల సంపుటి కృష్ణశాస్త్రి గారికి అంకితంచేస్తూ ఇలాగ:

"బావగారూ, నాటకమంటూ మొదటి సారిగా 'మువ్వగోపాల' అనేది ఆకాశవాణి కోసం వ్రాసాను. దాన్నివిని మీ ఒడుపులు కొన్ని నేను కొట్టివేసానని మీరన్నారు. అవును. పదిహేనేళ్ళుగా మీ స్నేహం చేసి నందుకు మీ పాటల లగువు బిగువులు మీ పద్యాల సాపుమోపులు మీ మాటల ఒడుపు వాటములు వీటన్నిటికీ మించిన మీ అమేయ ప్రతిభా పట్టుపడకపోయినా ఏదో మీ వాసన కొంచెం తగిలింది కనుకనే — మరి నాల్గు నాటికలు వ్రాసాను. ఇవి మీకు మెప్పు గూరుస్తవని కాదుగాని రేపటి మీ పుట్టిననాటి పండక్కి నాకాన్కగా గ్రహిస్తారని వీటిని మీకు అంకితం చేసాను."

'మీ అమేయ ప్రతిభ పట్టుపడకపోయినా, ఏదో మీ వాసన కొంచెం తగిలింది' అని సాటికవిని ప్రశంసించడం కాటూరివారివలె మరేకవీ చెయ్యలేడనుకుంటాను. అటువంటి ఉదార హృదయమూ వినయసంపత్తి ఏ కొద్ది మంది మహాకవులకు మాత్రమో ఉంటుంది. అది కాటూరివారికే చెల్లింది. నన్నయ్యగారి "సరససారస్వతాంశ ప్రశస్తికొంత తన్ను జెందుటయు"అన్న వారి పూర్వికుడైన మహా కవి ఎర్రాప్రెగ్గడకు చెల్లింది.

జంట కవిత్వం చెయ్యడానికి కాకపోయినా, కాటూరి, దేవులపల్లి వార్ల పాతికేళ్ళ సాహచర్యం కొంతవరకు సాటికవి మిత్రుల్లో 'మధురమైన' మచ్చరం రేపినప్పటికీ, ఈ మధ్య కాలంలో వ్రాసిన దేవులపల్లి వారి నాటికల్లోను, కాటూరివారి నాటికల్లోను ఒకరి ప్రభావం ఒకరిపై గట్టిగా పడిందని మాదృశులం అనుకుంటూంటాము. కాటూరివారి నిగమశర్మ నాటకంలోని ఈ పాట చూస్తే తెలుస్తుంది :

వాడినపూలకై వగచేవురాజా!
విడివడిన మొగ్గలు పుడుకుకోరాదా?
ఆకుమాటునదాగి ఆసలూరంగ
వాసనల జిమ్మేను వగల సంపెంగ!
కాటిలో కూర్చుండి కలలు గంటావు
కన్నీటిలో మెరపుకాంతు లీనేవు!

* * *

స్త్రీ :— వినలేదా ముని మతంగు? ఊఁ—
నిగమ :— ఆఁ— వినకేమి కృపానుషంగు
స్త్రీ :— కనినాడాతడు కూతుల — ఊఁ—
నిగమ :— ఆఁ—కరి మొయిలంపిన దూతల
స్త్రీ :— ఆముని మా కొలముసామి. ఊఁ—
నిగమ :— ఆఁ, అవునవునా చెప్పవేమి?
స్త్రీ :— రాల్గరగే యీ కిన్నెరగానం
నిగమ :— పూల్గురిసే నీ కన్నులరాగం
స్త్రీ :— వెన్నతోడ మా నేర్చిన విద్దియ
నిగమ :— కన్నులాన దక్షిణనే ముద్దియ!

ఇలాగ, నాటకంలో వచ్చే పాటలలో గేయ సుభగత్వం (లిరికల్ బ్యూటీ) నాటకీయతా, పోగారూ కాటూరివారికీ దేవులపల్లి వారికీ లొంగినట్లు చాల తక్కువమంది కవులకు లొంగుతాయనుకుంటాను.

గేయ కవితా చక్రవర్తియైన క్షేత్రయ్య పదరచనలోని 'లగువు బిగువులూ, సాపు మోపులూ, ఒడుపు వాటములూ' కాటూరి వారికి అబ్బినట్లుగా మరెవ్వరికీ అబ్బలేదనుకుంటాను. క్షేత్రయ్య పదాల శైలిలోనుంచి, ఆమొవ్వవరదయ్యా,ఆయనగారి ప్రియురాలు అన్యోన్యముగా ఆడుకొనే ప్రియాలాపాలలోనేకాదు, కేవలం శృంగారకవి చక్రవర్తిగా కనిపించే క్షేత్రయ్య పాత్రను నిగూఢమైన ఆధ్యాత్మిక భక్తి నిష్ఠగల యోగీశ్వరునిగా మలచడంలోకూడా కాటూరివారు అపారమైన పారదర్శిత్వాన్ని ప్రకటించారు తమ మువ్వగోపాల నాటకంలో.

కూచిపూడివారి యక్షగాన ప్రదర్శనాలను తమ తరంవారు ఎందరో దర్శించి ఉంటారు గాని, ఆ యక్షగాన ప్రక్రియ ఆధునిక కవులకుకూడా ఉదాత్తమైన రచనలు చేయడానికి ఆలంబం కాదగినదని కాటూరివారికే తొలి సారిగా తోచి, ఆయన శ్రీనివాస కల్యాణం యక్షగానం రచించారు. ఆ సందర్భంలో ఆయా దరువులను రచించేటప్పుడు వాటివాటి తాళ నిర్ణయంలోను, రాగ నిర్ణయంలోను వారికి నా సంగీత కృషి కొంత తోడ్పడిందని గర్విస్తుంటాను నేను. అంతేకాదు, ఆ తర్వాత దేవులపల్లి వారికికూడా యక్షగాన ప్రక్రియపైని ఆదరం కలిగి, క్షీరసాగరమధనం, విప్రనారాయణ, మాళవిక అనే యక్షగానాలు రచించడానికికూడా కాటూరివారే మార్గదర్శి, ప్రత్యక్షప్రోత్సాహకుడు.

మహాకవులలో మహాకవిగా, యువకవులలో యువకవిగా ధీశాలురలో ధీశాలిగా ఉంటూ, సాహితీ కృషిచేసేకవులు, రచయితలు ఏ అంతస్థులోనివారైనా అందరినీ ప్రేమాదరాలతో అభిమానించి ప్రోత్సహించే కాటూరివారు ఏ వూరువెళ్ళినా అక్కడి సాహితీ కృషికులలో ఎంత సామాన్యునైనా సరే పాదచారియై వెళ్ళే పలకరించి, యోగక్షేమాలు తెలుసుకోకుండా వెళ్ళేవారు కారు. అదికాక ఆయన గుప్తదానాలవల్ల నెలవారీగా వర్ధిల్లుతూవచ్చిన సాహితీ శిష్యులెందరో! కాటూరివంటి ఒక్కవ్యక్తి లేని లోటు తీరడం సాధ్యంకాదు. ★

# పంచాయతీరాజ్య పురోగమనం

### ప్రజల విరాళం

కర్నూలు జిల్లా నందికొట్కూరు బ్లాకు లోని కొండియాలలో దాదాపు రూ. 7,600 ల వ్యయంతో నిర్మించిన ఎలిమెంటరీ పాఠశాలా భవనాన్ని 1962 డిసెంబరులో ప్రారంభించారు. ఈ వ్యయంలో సగం మొత్తాన్ని ఆ ప్రాంతం ప్రజలు భరించారు.

కర్నూలు జిల్లా, నందికొట్కూరు పంచాయతీ సమితిలోని తలముడిపిలో దాదాపు రూ. 10,400 ల వ్యయంతో నిర్మించిన మరో ఎలిమెంటరీ పాఠశాలా భవనానికి డిసెంబరు 6 వ తేదీన కర్నూలు జిల్లా పరిషత్తు అధ్యక్షుడు ప్రారంభోత్సవం చేశారు. ఈ వ్యయంలో సగం మొత్తాన్ని ప్రజలు ఇచ్చారు.

### సమితి ప్రారంభోత్సవం

విశాఖపట్నం జిల్లాలోని చోడవరం పంచాయతీ సమితిని డిసెంబరు 24 వ తేదీన రెవెన్యూ బోర్డు ప్రథమ సభ్యుడు శ్రీ కె. ఎన్. అనంతరామన్, ఐ.సి.ఎస్. ప్రారంభించారు.

### రైతులకు సహాయం

మెదక్ జిల్లా పరిషత్తు రెండవ స్థాయీ సంఘం, డిసెంబరు 21 వ తేదీన సమావేశమై బీద రైతుల సహాయార్థం రు.3000లు మంజూరు చేసింది. ఎరువులు మొదలైన వాటి రూపంలో ఈ గ్రాంట్లు ఇస్తారు. ఇంతే గాక ఈ సంఘం ట్రాక్టర్లతో దున్నకానికి రూ. 52,000 లు, బుల్డోజర్లతో దున్నకానికి రూ. 30,000 లు, విత్తనాలు, ఎరువులకు రూ. 10,000 లు, తీవ్రంగా ఎరువుల వాడకానికి రూ. 10,000 లు కూడా కేటాయించింది. ఆహార ధాన్యాల ఉత్పత్తిని హెచ్చించడానికై సేద్యపు నీటి బావులు త్రవ్వే నిమిత్తం రూ. 2 లక్షలను కూడా సంఘం మంజూరు చేసింది.

రోడ్డు నిర్మాణం

నల్గొండ జిల్లా పరిషత్తు చేపట్టిన తిప్పర్తి-సర్వవరం రోడ్డుకు 1963 జనవరిలో నీటి వనరులు, విద్యుచ్ఛక్తి శాఖల మంత్రి ప్రారంభోత్సవం చేశారు. దీని నిర్మాణ వ్యయం రూ. 27,000 లు. ఇందులో ప్రజల విరాళం రూ. 9,000 లు.

### రాకపోకల సౌకర్యాలు

ఆదిలాబాదు జిల్లాలో రోడ్లు నిర్మించే నిమిత్తం, ఆ జిల్లాపరిషత్తు ఆయిదవ స్థాయీ సంఘం, డిసెంబరు 24 వ తేదీన జిల్లా కలెక్టరు అధ్యక్షతన జరిగిన సమావేశంలో రూ. 6,11,112 లు మంజూరు చేసింది.

### నీటి సరఫరా పథకం

గ్రామీణ ప్రాంతాల నీటి సరఫరా పథకాలను అమలు పరిచే నిమిత్తం ప్రతి సమితికీ రూ. 10,000 ల చొప్పున కూడా పరిషత్తు మంజూరు చేసింది. ఆదిలాబాదు జిల్లా పరిషత్తు రెండవ స్థాయీ సంఘం, డిసెంబరు 24 వ తేదీన జరిగిన సమావేశంలో బావుల సబ్సిడీ పథకం క్రింద 1962-63 వ సంవత్సరంలో 160 బావులు నిర్మించడానికి రూ. 60,000 లు మంజూరు చేసింది.

### మేలుజాతి విత్తనాల పంపిణీ

మహబూబ్‌నగర్ జిల్లా కొల్లాపూర్ బ్లాకులో రైతులకు 688 మణుగుల మేలు జాతి విత్తనాలు, 201 మణుగుల రసాయనిక ఎరువులు పంపిణీ చేశారు. 161 ఎకరాలలో జపాను పద్ధతిలో వరి సేద్యం చేశారు. పశుపోషణ కార్యక్రమం క్రింద 61 పశువులకు విత్తులు కొట్టారు, మంచి రకం పక్షులను పదిహేడింటిని సరఫరా చేశారు.

ఈ నెలలో 16 ఫర్లాంగుల కచ్చా రోడ్లు నిర్మించారు. 8 ఫర్లాంగుల మేరకు రోడ్డు మరమ్మతులు చేశారు. యెల్లూరు గ్రామంలో 12 మంది సభ్యురాండ్రతో ఒక మహిళా

మండలిని స్థాపించారు. 15 మంది సభ్యులతో ఒక యువజన క్లబ్బును నెలకొల్పడం కూడా జరిగింది.

### రసాయనిక ఎరువులు

చిత్తూరు జిల్లాలోని నగరి బ్లాకులో 1962 డిసెంబరులో ఆధునిక వ్యవసాయవిధానాలను ప్రచారం చేసే ఉద్దేశంతో పురోగాములైన రైతులు 1088 మణుగుల రసాయనిక ఎరువులు ఉపయోగించారు. స్థానిక కోళ్ళ జాతిని అభివృద్ధి పరచడానికి చర్యలు తీసుకోడం కూడా జరిగింది. 8 ఫర్లాంగుల పక్కా రోడ్డు నిర్మించారు. 15 ఫర్లాంగుల మేరకు రోడ్డు మరమ్మతులు చేశారు.

### సహకార రంగం విస్తరణ

రూ. 1960 ల వాటా ధనంతో కొత్తగా 52 మంది సభ్యులను సహకార పరిధిలోకి తేవడం జరిగింది. "గ్రామీణ డిపాజిట్ల" క్రింద రూ. 6,816 లు సేకరించారు.

### మహిళా మండలుల స్థాపన

గుంటూరు జిల్లా ఈపూర్ బ్లాకులోని రైతులకు 213 మణుగుల రసాయనిక ఎరువులు పంపిణీ చేశారు. ఈ నెలలో రెండు మహిళా మండలులను స్థాపించడం కూడా జరిగింది. వీటిలో 23 మంది సభ్యురాండ్రుగా చేరారు.

### చాపల అల్లకం కేంద్రం

అనంతపురం జిల్లా ముదిగుబ్బ బ్లాకులో 1962 డిసెంబరులో స్త్రీల కొరకు ఒక తుంగ చాపల అల్లకం కేంద్రాన్ని ప్రారంభించారు. కేంద్రంలో 10 మంది మహిళలు నూతన విధానాలలో శిక్షణ పొందుతున్నారు. వీరికి నెలకు తలా రూ. 20/- ల చొప్పున స్టయిఫండులు చెల్లించబడుతున్నాయి. అంతేకాక 50 శాతం సబ్సిడీ ధరలకు వారికి మగ్గాలను సరఫరా చేయడంకూడా జరుగుతుంది.

---

## "సత్యమే జయం" డాక్యుమెంటరీ ప్రదర్శనం

మన రక్షణకృషి కథఅయిన "సత్యమే జయం" అనే డాక్యుమెంటరీనీ, "ఆంధ్రప్రదేశ్" "కృష్ణానది" మొదలైన ఇతర డాక్యుమెంటరీ చిత్రాలనూ హైద్రాబాదు దిల్షాద్ టాకీసులో 1963 జనవరి 7 వ తేదీన సా. 3 గం॥ లకు ప్రథమంగా ప్రదర్శించారు. ముఖ్యమంత్రి డాక్టర్ నీలం సంజీవరెడ్డి ప్రధాన అతిథిగా వున్నారు.

చిత్ర ప్రదర్శనం ఆరంభించడానికి పూర్వం సమాచార పౌరసంబంధాలశాఖ డైరెక్టరు శ్రీ నరేంద్ర లూథర్, భారత ప్రభుత్వ ఫిల్మ్స్ డివిజను వారితోకలిసి ఈ డాక్యుమెంటరీ చిత్రాలను నిర్మించడానికి తీసుకున్న చర్యలను గురించి వివరించారు.

ప్రదర్శనానంతరం ముఖ్యమంత్రి డాక్టర్ సంజీవరెడ్డి, మన రక్షణకృషిపై తొలి డాక్యుమెంటరీ చిత్రాన్ని విజయవంతంగా నిర్మించినందుకు సమాచారశాఖనూ, భారత ప్రభుత్వం వారినీ అభినందించారు. ప్రస్తుత క్లిష్ట తరుణంలో మన మాతృభూమి రక్షణకై ఇతోధికంగా పాటుపడడానికి ఈ ప్రయత్నం ప్రజలను ఉత్తేజ పరచగలదనడంలో ఎట్టి సందేహం లేదని కూడా ఆయన అన్నారు. కృష్ణానదిపై నిర్మించిన డాక్యుమెంటరీలో ఆ నది వైభవం, ఉపయోగాలను చక్కగా చిత్రీకరించినందుకు ముఖ్యమంత్రి అభినందనలు తెలిపారు.

''అన్‌టూ అవర్‌లాస్ట్'' (సత్యమే జయం) డాక్యుమెంటరీ చిత్రానికి సమాచార పౌర సంబంధాలశాఖ డైరెక్టరు శ్రీ నరేంద్ర లూథర్ స్క్రిప్టు వ్రాశారు. వ్యాఖ్యానంకూడా ఆయనే చదివారు.

# కొలంబో సమావేశం ప్రతిపాదనలు

ఆసియా, ఆఫ్రికాలకు చెందిన ఆరు తటస్థ దేశాల వారు 1962 డిసెంబరు 10 నుంచి 12 వ తేదీ వరకు కొలంబోలో సమావేశమై రూపొందించిన ప్రతిపాదనలను 1963 జనవరి 20 వ తేదీన విడుదల చేశారు. 1962 నవంబరు 21, 28 తేదీలలో చైనా ప్రధాన మంత్రి శ్రీ చౌ-ఎన్-లై భారత ప్రధాన మంత్రికి వ్రాసిన లేఖలలో ప్రతిపాదించిన విధంగా పశ్చిమరంగం (లడక్)లో చైనా తన సైనిక స్థావరాలను 20 కిలోమీటర్లు వెనక్కి ఉపసంహరించుకోవాలనీ, నేఫా రంగంలో తాగ్లా కనుమ, లాంగ్జూ రెండు ప్రాంతాలు మినహా యిరుపక్షాలు మక్‌మాహన్ రేఖ వరకు వెళ్ళ వచ్చుననీ వారా ప్రతిపాదనలో సూచించారు.

ప్రతిపాదనల పూర్తి పాఠం దిగువ ఇవ్వబడింది :—

1. యుద్ధ విరమణ ఏర్పడి ఉన్న ప్రస్తుత కాలం, భారత చైనా వివాదాన్ని శాంతి యుతంగా పరిష్కరించు కోవడానికి వీలుగా ప్రయత్నాలు ఆరంభించడానికి మంచి సమయమని సమావేశం భావిస్తున్నది.

2. (ఎ) పశ్చిమ రంగానికి సంబంధించి, 1962 నవంబరు 21, 28 తేదీలలో ప్రధాన మంత్రి శ్రీ చౌ-ఎన్-లై ప్రధాని శ్రీ నెహ్రూకు వ్రాసిన లేఖలలో ప్రతిపాదించినట్లుగా చైనా తన సైనిక స్థావరాలను 20 కిలో మీటర్లు వెనక్కి ఉపసంహరించుకోవాలని ఈ సమావేశం చైనా ప్రభుత్వాన్ని కోరు తున్నది.

(బి) తన సేనలను ప్రస్తుతం ఉన్న స్థానాలలోనే ఉంచాలని సమావేశం భారత ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నది.

(సి) సరిహద్దు వివాదానికి తుది పరిష్కారం కుదిరేవరకు, చైనా సేనల ఉపసంహరణ వల్ల ఏర్పడిన ప్రాంతం నిస్సైన్యీకృత మండలం అవుతుంది. యీ ప్రాంతంలో ఉభయ దేశాల నివాస హక్కులకు భంగం కలగని రీతిగా ఇరు పక్షాలు అంగీకరించిన ప్రకారం ఉభయ పక్షాల పౌరస్థావరాల ద్వారా యీ ప్రాంతం పరిపాలనను నిర్వహించాలి.

*తూర్పు రంగం :* 3. తూర్పు రంగంలో ఉభయ ప్రభుత్వాలు గుర్తించిన వాస్తవ అధీనప్రాంత శ్రేణి ఉభయ సేనల మధ్య యుద్ధ విరమణ రేఖగా ఉపయోగపడగలదని సమావేశం భావిస్తున్నది. ఈ రంగంలోని తక్కిన ప్రాంతాల స్థితిని ముమ్ముందు చర్చల ద్వారా పరిష్కరించుకో వచ్చు.

4. మధ్య రంగానికి సంబంధించిన సమస్యలను బలప్రయోగానికి తలపడకుండా, శాంతియుతంగానే వాటిని పరిష్కరించుకో వచ్చునని సమావేశం సూచిస్తున్నది.

5. ఈ ప్రతిపాదనలను ఒకసారి అమలు జరిపినట్లయితే యుద్ధవిరమణను స్థిరీకరించడానికి తోడ్పడి, యుద్ధ విరమణ పరిస్థితిలో ఉండే సమస్యల పరిష్కారానికై ఉభయ పక్షాల ప్రతినిధుల మధ్య సంప్రదింపులకు దారి కల్పిస్తుందని సమావేశం భావిస్తున్నది.

6. ఈ విజ్ఞప్తికి క్రియాత్మక సుముఖతను ప్రకటించినంత మాత్రాన సరిహద్దు రేఖల తుది స్థానాన్ని గురించి ఉభయ ప్రభుత్వాలలో ఏ ఒక దాని వాదానికి కూడా భంగం వాటిల్లదని సమావేశం స్పష్టం చేయదలచింది.

## వివరణలు

కొలంబో ప్రతిపాదనలు 'అంత వివరంగా' లేని కారణంగా, వాటి స్వరూప స్వభావాలను స్పష్టంగానూ, సరిగానూ అర్థం చేసుకోవడానికి వీలుగా ప్రతిపాదనలు రూపొందించిన వారిని భారత ప్రభుత్వం వివరణలను కోరింది.

భారత ప్రభుత్వం కోరికపై సిలోన్, సమైక్య అరబ్ రిపబ్లిక్, ఘనా ప్రతినిధులు కొలంబో సమావేశం ప్రతిపాదనలలోని 2,3,4 వ అంశాలకు సంబంధించి దిగువ వివరణలను ఇచ్చారు :—

*పశ్చిమ రంగం :* (i) నవంబరు 21 వ తేదీన చైనా ప్రధానమంత్రి శ్రీ చౌ-ఎన్-లై, ప్రధానమంత్రి శ్రీ నెహ్రూకు పంపిన చైనా ప్రభుత్వ ప్రకటనలో ప్రతిపాదించిన విధంగానూ, 1962 నవంబరు 28 వ తేదీన ప్రధానమంత్రి శ్రీ చౌ-ఎన్-లై వ్రాసిన లేఖలో ప్రతిపాదించినట్లుగానూ ఇరువైపులా 1959 నవంబరు 7 వ తేదీనాటి ప్రత్యక్ష అధీన రేఖనుంచి 20 కిలోమీటర్ల వరకు చైనా సేనలను ఉపసంహరించుకోవాలని కొలంబో సమావేశం ప్రతిపాదించింది. చైనా ప్రభుత్వం సర్క్యులేటుచేసిన iii, iv మ్యాపులలో యీ అధీనరేఖ నిర్వచించబడింది.

(ii) ప్రస్తుతం ఉన్న భారత ప్రభుత్వ సైనిక స్థావరాలను పై (i) వ అంశంలో పేర్కొన్న రేఖవరకూ ఉంచవచ్చు.

(iii) చైనా సేనలు 20 కిలోమీటర్లు వెనక్కు ఉపసంహరించుకోవడంవల్ల ఏర్పడిన నిస్సైనిక ప్రాంతాన్ని ఉభయపక్షాల పౌర కేంద్రాలు పరిపాలిస్తాయి. ఇది కొలంబో సమావేశం ప్రతిపాదనలోని ప్రధాన భాగం. ఎక్కడ, ఎన్ని కేంద్రాలను ఏ విధంగా నెలకొల్పాలనే విషయాలను భారత, చైనా ప్రభుత్వాలు పరస్పర అంగీకారం ద్వారా తేల్చుకోవాలి.

కొలంబో ప్రతిపాదనల ప్రకారం, భారత చైనా ప్రభుత్వాల మధ్య అభిప్రాయ భేదం ఉన్న రెండు ప్రాంతాలు మినహా ప్రత్యక్ష అధీన రేఖ-మక్‌మాహన్ రేఖకు దక్షిణం వరకూ భారత సేనలు వెళ్ళవచ్చు. అదే విధంగా చైనా సేనలు, యీ రెండు ప్రాంతాలు మినహా మక్‌మాహన్ రేఖకు ఉత్తరంవరకూ వెళ్ళవచ్చు. కొలంబో ప్రతిపాదనలలో మిగతా ప్రాంతాలుగా ఉదహరించబడిన యీ రెండు ప్రాంతాలు ఇవి: చిలాంగ్ లేక తాగ్లా కనుమ, లాంగ్జు.

యీ ప్రాంతాలలో ప్రత్యక్ష అధీన రేఖ గురించి ఉభయ ప్రభుత్వాల మధ్య అభిప్రాయభేదాలు ఉన్నకారణంగా భారత, చైనా ప్రభుత్వాలు యీ సమస్యను పరిష్కరించుకోవాల్సి ఉంది.

*మధ్యరంగం:* యీ రంగంలో యథాస్థితిని కొనసాగించాలనీ, ఈ ప్రతిపత్తికి భంగంకల్గే రీతిగా ఏ ఒక్క పక్షమూ ప్రవర్తించరాదనీ కొలంబో సమావేశం కోరుతున్నది.

---

# మీ కృతజ్ఞతకు చిహ్నాలు

హిమాలయ సరిహద్దులలో అత్యున్నత శిఖరాలపై తమ విధిని తాము నిర్వహిస్తున్న సాహసికులైన మన సైనికులు ఆహార పదార్థాలు, ఇతర సౌకర్యాల కానుకులకు సహృదయంతో స్వాగతమిస్తారు.

ఈ క్రిందివాటిలో వేటినైనా పంపవచ్చు:

1. త్రాగే చాక్‌లేట్ బోర్న్-విటా, లేక ఇంకా అటువంటివి. 2. డబ్బాలలో నిల్వచేసిన కాఫీ, పాలు. 3. బాదం కాయలు, వాల్నట్లు, జీడిపప్పు. 4. బిస్కెట్లు, స్వీట్లు (వండినస్వీట్లు ఉదా: లోజొంజెస్, లెమన్ డ్రాప్స్ మొదలైనవి). 5. బ్యాటరీ రేడియో సెట్లు (ముఖ్యంగా 2 వేవ్ ట్రాన్సిస్టర్లు) 6. ఇండోర్ ఆటవస్తువులు. 7. స్పోర్ట్స్‌గేర్. 8. టాయిలెట్ వస్తువులు. 9. పిరియాడికల్స్, పత్రికలు, పుస్తకాలు.

ప్యాకెట్లలోపల వున్న వస్తువుల వివరాలను ప్యాకెట్లపై స్పష్టంగా తెలుపుతూ రవాణా చార్జీలను చెల్లించి ఈ క్రింది వారికి పంపవచ్చు.

1. అడ్మినిస్ట్రేటివ్ కమాండెంట్, హెడ్‌క్వార్టర్సు, సికింద్రాబాద్ స్టేషన్, బొలారం.

లేక

2. స్టేషన్ కమాండర్, ఎయిర్‌ఫోర్స్ స్టేషన్, బేగంపేట, హైదరాబాద్.

లేక

3. శ్రీ యం. హెచ్. కె. ఘజ్నవీ, గవర్నరు సహాయ కార్యదర్శి, రాజభవన్, హైదరాబాద్.

# గ్రామీణ స్వచ్ఛంద దళాల త్రివిధ కార్యక్రమాలు

మన వీర సైనికుల కుటుంబాల సంక్షేమాన్ని చూచే పంచాయతీలకు కూడా యీ విభాగం సహాయ పడుతుంది. గ్రామీణ స్వచ్ఛంద దళంలోని సభ్యు లందరికీ శారీరక వ్యాయామం, డ్రిల్లు శిక్షణ ఇవ్వబడుతుంది. దీనివల్ల రక్షణ కార్యక్రమాలలో పాల్గొనడానికి, ఉత్తేజాన్నీ, క్రమ శిక్షణగా మెలిగే దృక్పథాన్నీ ప్రజలలో కలిగించ వచ్చు.

ప్రతి గ్రామంలోని 18-50 సంవత్సరాల మధ్య వయస్కులైన ప్రతి వయోజనుడు గ్రామీణ స్వచ్ఛంద దళంలో సభ్యులుగా చేరవచ్చు. ఉత్పత్తి, జనబాహుళ్యానికి విద్య, గ్రామ రక్షణ కార్యక్రమాలలో పాల్గొనడానికి వీలుగా సభ్యులందరూ ఎల్లవేళలా సంసిద్ధులుగా ఉండాలి. పంచాయతీ రాజ్య వ్యవస్థలోని మూడుశాఖలైన పంచాయితీ, పంచాయితీ సమితి, జిల్లా పరిషత్తు - యీ మూడుకూడా గ్రామీణ స్వచ్ఛంద దళంతో సన్నిహిత సంబంధం కలిగి ఉండడమేకాక వివిధ స్థాయిలలో యీ దళం కార్యక్రమాలను సమన్వయ పరచి, అమలు జరపడంలో సహకరిస్తాయి. యీ పథకం సంస్థాగతంగా సాధారణమయినదీ, జనరంజకమైనది మాత్రమే కాక రక్షణ కృషికి యెంతో ముఖ్యమయినది కూడా.

## రక్షణ శ్రామిక బ్యాంకులు

గ్రామీణ స్వచ్ఛంద దళం పథకంలో రక్షణ శ్రామిక బ్యాంకు అంతర్భాగంగాఉంది. ప్రతి గ్రామంలో గ్రామీణ స్వచ్ఛంద దళంద్వారా గ్రామీణ భారతాన్ని సమీకరించడమే యీ పథకం లక్ష్యం. శారీరక యోగ్యులైన ప్రతి వయోజనుడు నెలకు కనీసం ఒక రోజు చొప్పున శ్రమదానం కానీ, దీనికి బదులుగా డబ్బునుకానీ విరాళంగా ఇచ్చే ప్రాతిపదిక పైననే యీ బ్యాంకు నిర్వహింపబడుతుంది. యీ పథకం మనకు కొత్తదికాదు. సమాజాభివృద్ధి కార్యక్రమ ఉద్దేశాలలో నిర్దేశించిన శ్రమదానం ఆదర్శమే యీ పథకం ముఖ్య లక్ష్యం. శ్రమదానంయొక్క ఫలితాలు అద్భుతంగా ఉన్నాయని చెప్పలేకున్నా, గ్రామీణులలో ఆత్మవిశ్వాసం కలిగించడం, నిర్మాణాత్మకమైన పనులను చేపట్టడం, సమాజాభివృద్ధి లక్ష్యాలను, తత్వాన్ని ప్రచారం చేయడంలో శ్రమదానం ముఖ్యమయిన పాత్ర వహించిందనిచెప్పవచ్చు. గ్రామీణ స్వచ్ఛంద దళం రక్షణ శ్రామిక బ్యాంకుల లక్ష్యాలను, ఉద్దేశాలను గ్రామాలలోని మన సోదరులకు శ్రమదానం ద్వారా తెలియజేయవచ్చు.

## సంస్థాగత కార్యక్రమాలు

ప్రతి సభ్యుడూ పాల్గొనే సంస్థాగత కార్యక్రమాలను యీ బ్యాంకు రూపొందిస్తుంది. జాతియొక్క ప్రస్తుత ఉత్సాహాన్ని ఇది లాభదాయకంగానూ, సక్రమంగానూ వినియోగించుకుంటుంది. వ్యవసాయోత్పత్తులను అధికం చేయడానికి వీలుగా తీవ్రతర కృషి చేయడానికి మానవశక్తిని సమీకరించడం, సామాజిక ఆస్థులను అభివృద్ధి చేయడం వంటి లక్షలాది గ్రామీణులు ఇవ్వగలిగిన శక్తియుక్తులను సద్వినియోగం చేసుకోవడానికి దేశంమొత్తంలో రక్షణబ్యాంకులు సాధనాలుగా ఉపయోగపడతాయి. యీ విధంగా వారు రక్షణ కార్యక్రమాలలో పూర్తిగా పాల్గొనగలగడానికి వీలు కలుగుతుంది.

ప్రతినెలా ఒకరోజు చొప్పున ఉచితంగా పని చేయదలచిన, లేక దీనికి బదులు డబ్బు విరాళంగా ఇవ్వదలచిన వయోజనులందరితోనూ యీ రక్షణ బ్యాంకులను ఏర్పాటు చేస్తారు. భూమిలేని కార్మికులు మినహా తక్కిన సభ్యులందరూ నెలకు ఒకరోజుకు మించి ఎక్కువ రోజులు ఉచితంగా శ్రమదానం ఇవ్వడానికీ, దీనికి బదులు డబ్బు విరాళంగా ఇవ్వడానికీ ప్రోత్సహించాలి. ఒకరోజుకు మించి ఎక్కువరోజులు పనిచేసిన భూమిలేని కార్మికులకు మామూలు కూలి ఇవ్వాలి.

పోరంబోకు భూముల అభివృద్ధి, కంపోస్టింగ్, కూరగాయలు, ఫలాలు ఉత్పత్తి చేయడం, వంటచెరకు చెట్ల పెంపకం, చేపల పెంపకం, గ్రామరక్షణ, గ్రామీణ పనులు, అధిక వ్యవసాయోత్పత్తికై ప్రత్యేక పథకాలు, భూసార సంరక్షణ, చిన్నతరహా నీటి వనరులకు పంట కాలువల త్రవ్వకం మొదలయిన కార్యక్రమాలను రక్షణ శ్రామిక బ్యాంకు సభ్యులు అమలు జరుపుతారు. బ్యాంకు సరఫరా చేసిన కార్మికులను పనులలో నియోగించడం ద్వారా ఈ పనుల అమలును గ్రామీణ స్వచ్ఛంద దళం నిర్వహిస్తుంది.

## పొరపాటు అభిప్రాయం

వ్యవసాయమే జీవనాధారంగా గల గ్రామీణ ప్రజలు, ఒకరోజు శ్రమను ఉచితంగా ఇవ్వలేరని తరుచుగా వాదించడం జరుగుతున్నది. గ్రామ జనాభా మొత్తం వ్యవసాయంపైన్నే ఆధారపడి ఉన్నదనీ, ఒకరోజు శ్రమను ఉచితంగా ఇచ్చే స్థితిలో వారు లేరనికూడా చెప్పబడుతున్నది. అయితే నిజంగా ఇది తప్పుడు భావన. సమాజాభివృద్ధి కార్యక్రమాన్ని

అమలుచేసిన తర్వాత గత కొన్ని సంవత్సరాలకాలంలో ప్రజలు స్వచ్ఛందంగాముందుకు వచ్చి ఉచితంగా శ్రమదానం చేసిన ఉదాహరణలు ఎన్నోఉన్నాయి.

1957 వ సం॥ లో రామచంద్రాపురం తాలుకాలో సర్వే జరిపిన కార్యక్రమం మదింపు సంస్థ పేర్కొన్న విషయాలను కూడా యీ సందర్భంలో దృష్టాంతరంగా తీసుకోవచ్చు.

గ్రామీణ ప్రజలలో నిరుద్యోగ పరిస్థితి ప్రబలంగా ఉందని యీ సర్వేవల్ల వెల్లడయింది. అంతేగాక సంపాదన ఉన్నవారందరిలో 72.9 శాతం ఉన్న వ్యవసాయ కార్మికులలోనే నిరుద్యోగం ఎక్కువగా ఉందని కూడా దీనివల్ల తెలిసింది. 80 శాతం వ్యవసాయ కార్మికులు నిరుద్యోగులుగా ఉన్నారని చెప్పబడుతున్నది. 1953 మే నుండి 1954 జనవరి వరకు జరిపిన సర్వే కాలంలో మూడవ వంతు లేక సగటున 92 రోజులు నిరుద్యోగులుగానే ఉన్నారు.

పూర్తిగా పనిపాటలు లేకుండా వున్న రోజులలో వ్యవసాయ తరుణం మందగించడం, పనులు దొరకకపోవడం ఉద్యోగ అవకాశాలు తగినంతగా లేక పోవడం,ముఖ్య కారణాలు అయ్యి. 93.7 శాతం రోజులు వారు నిరుద్యోగులుగా ఉండటం జరుగుతున్నది. ఖరీఫ్ పంటల కోతలు, రాబి సేద్యం ప్రారంభించే అక్టోబరు నుండి మార్చి వరకు గల ముఖ్య తరుణంలో 20 రోజులు మాత్రమే పనులు దొరుకుతాయని లెక్కకట్టడం జరిగింది.

ఎక్కువ భాగం మాగాణి భూములలో రెండు పంటలు సేద్యంచేసే తూర్పు గోదావరి జిల్లాలోని రామచంద్రాపురంవంటి తాలూకాలో పరిస్థితి యీ విధంగా ఉంటే ఇటువంటి తీవ్రతర వ్యవసాయ ప్రయత్నాలు లేని, ఇన్ని మాసాలు వ్యవసాయ తరుణం కాని యితర ప్రాంతాల గ్రామాలలోని నిరుద్యోగ పరిస్థితి ఎట్లా వుంటుందో సులభంగా తెలుసుకోవచ్చు.

గ్రామంలోని వ్యవసాయ కూలీలు నెలలో ఒకరోజు శ్రమదానం చేసినంత మాత్రాన వారి ఆర్జనకు అంతరాయం కలగదనీ, వారి సంపాదన కుంటుపడదనీ పై అంశాలవల్ల స్పష్టమవుతుంది. సంవత్సరం మొత్తంలో తన ఆదాయానికి భంగం లేకుండానే గ్రామీణ స్వచ్ఛంద దళం, రక్షణ శ్రామిక బ్యాంకులో సభ్యులుగాఉండి ప్రత్యేక సేవను చేయవచ్చు.

1961వ సం॥ జనాభా లెక్కలను అనుసరించి మన రాష్ట్ర జనాభా 359.83 లక్షలు. ఇందులో 297.08 లక్షలు గ్రామీణ జనాభా ఉంది. యీ గ్రామీణ జనాభాలో 155.48 లక్షల మంది పనిపాటు చేసేవారు ఉన్నారు. వీరిలో స్త్రీల సంఖ్య 74.63 లక్షలు. అందువల్ల మన రాష్ట్రంలోని గ్రామీణ జనాభాలో 80.85 లక్షలు పనిపాటలు చేసే పురుషులు ఉన్నారు. వీరందరూ గ్రామీణ స్వచ్ఛంద దళంలో చేరి నెలకు ఒకరోజు చొప్పున ఉచితంగా శ్రమదానం చేయవచ్చు. ప్రతి వ్యక్తికీ రోజుకు రు. 1-25 చొప్పున యీ మొత్తం శ్రమదానానికి విలువకడితే సంవత్సరానికి రు. 1,112.75 లక్షలు అవుతుంది.

గ్రామీణ స్వచ్ఛంద దళం, రక్షణ శ్రామిక బ్యాంకులు, పంచాయితీ స్థాయిలోనూ గ్రామ సేవకుని సర్కిల్ స్థాయిలోనూ, బ్లాక్ స్థాయిలోనూ, జిల్లా స్థాయిలోనూ దిగువ విధంగా పని చేస్తాయి.

సర్‌పంచ్‌తోపాటు, పంచాయతీ సభ్యులందరూ ఆత్యయిక సంఘంలో సభ్యులుగా వుంటారు. గ్రామప్రజలలో వివిధ వర్గాలన్నింటికీ ప్రాతినిధ్యం లభించేవిధంగా ఇది ఏర్పాటు చేయబడుతుంది. గ్రామీణ స్వచ్ఛంద దళ నాయకుడు అంటే దళపతి ఈ ఆత్యయిక సంఘానికి కార్యదర్శిగా వ్యవహరిస్తారు. పంచాయతీ సర్పంచ్ సాధారణంగా ఈసంఘానికి అధ్యక్షుడుగా వుంటాడు. ఈ సంఘం గ్రామీణ స్వచ్ఛంద దళం, రక్షణ శ్రామిక బ్యాంకు కార్య కలాపాలను నిర్వహిస్తుంది.

గ్రామ సేవకుల పరిధిలో పంచాయతీల సర్పంచ్‌లు, గ్రామీణ స్వచ్ఛంద దళాల దళపతులు అందరూ ఆత్యయిక సంఘ సభ్యులుగా వుంటారు. గ్రామసేవకుడు కన్వీనరుగా వుంటాడు. బ్లాకు స్థాయిలోని ప్రజారక్షణ సంఘపు అధ్యక్షులుగానీ, బ్లాకు డెవలప్మెంటు ఆఫీసరు గానీ, లేక సోషియల్ ఎడ్యుకేషన్ ఆర్గనైజరుగానీ, ఎవరు హాజరుగా వుంటే వారు, ప్రజారక్షణ సంఘ సమావేశాలకు అధ్యక్షత వహిస్తారు. తమ యాజమాన్యంలో వుండే ప్రతి గ్రామీణ స్వచ్ఛంద దళం, రక్షణ శ్రామిక బ్యాంకు కృషిని ఈ ప్రజారక్షణ సంఘం పరిశీలిస్తుంది. అవసరమైనప్పుడల్లా తగిన సలహాలిస్తుంది.

## బ్లాకు స్థాయిలో

ఇందుకై ప్రత్యేక సంఘం అంటూ ఏర్పాటుకాదు. బ్లాకులోని ప్రజారక్షణ సంఘం, బ్లాకులోని యితర సర్కిల్ స్థాయిలోవున్న సంఘాల కార్య కలాపాలను పరిశీలించి, పంచాయతీ సమితి నివేదికలు పంపుతుంది. పంచాయతీ సమితి ఈ నివేదికల్ని చర్చించి, అవసరమైతే, సలహాలిచ్చి. గ్రామీణ స్వచ్ఛంద దళం, రక్షణ శ్రామిక బ్యాంకు కృషిని విజయవంతంగా అమలు పరచడానికి సంపూర్ణ సహకార మిస్తుంది.

జిల్లా స్థాయిలో ప్రజారక్షణ సంఘం తాలూకు ఉప సంఘం ఒకటి వుంటుంది.

దీనికి జిల్లా కలెక్టరు అధ్యక్షులుగాను, జిల్లా పరిషత్తు అధ్యక్షుడు ఉపాధ్యక్షుడుగాను, జిల్లా పరిషత్తు కార్యదర్శి కన్వీనరుగాను వుంటారు. జిల్లా అధికారులు, రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్లు సభ్యులుగా వుంటారు. బ్లాకులనుంచి అందే నివేదికల దృష్ట్యా ఈఉప సంఘం గ్రామీణ స్వచ్ఛంద దళం, రక్షణ శ్రామిక బ్యాంకు కృషిని పరిశీలిస్తుంది.

## ముఖ్య కార్యకర్త

గ్రామీణ రక్షణ దళం, రక్షణ శ్రామిక బ్యాంకుల ద్వారా కార్యక్రమాలను రూపొందించి, వాటిని అమలుపరచడానికి దళపతి ముఖ్య కార్యకర్తగా వ్యవహరిస్తాడు. తాను త్రివిధ కార్యకలాపాల్లో ముందుగా తగిన శిక్షణ పొంది ఆతర్వాత గ్రామీణ స్వచ్ఛంద దళం, రక్షణశ్రామిక బ్యాంకు సభ్యులకు శిక్షణ ఇస్తారు. కనుక సాధారణంగా మూడవ ఫారం లేక 8 వ తరగతి ఉత్తీర్ణుడు అయిన వ్యక్తి, దళపతిగా వుంటాడు. అతను 25 నుంచి 40 ఏండ్లలోపు వయస్సులోవుండాలి. ప్రజలకు ఆమోద యోగ్యుడై వుండాలి. ఆత్యయిక సంఘాధ్యక్షుడు దళపతిని ఎన్నుకుంటాడు. సమీపంలోవున్న పోలీసు స్టేషను అధికారి దళపతులకు ఉదయం ఒక గంట, సాయంత్రం ఒక గంట వ్యాయామం, డ్రిల్లు విషయాలలో శిక్షణ యిస్తారు, కవాతు చేయడం, పతాకానికి అభివందనం చేసే పద్ధతి మున్నగు విషయాలన్నీ శిక్షణ కార్యక్రమంలోచేరి వుంటాయి. ఈ పథకం పట్ల ప్రజలు అత్యంత ఆసక్తి ప్రకటించే చోట్లలో సమీపంలోవున్న పోలీసు స్టేషను హెడ్ కాన్స్టేబుల్ అలాంటి గ్రామాలకు వెళ్ళి దళపతి నాయకత్వాన స్వచ్ఛంద సేవకులందరికీ వ్యాయామ శిక్షణా తరగతులు నిర్వహిస్తాడు. సబ్_ఇన్స్పెక్టర్‌తో సంప్రదించి బ్లాకు డెవలప్మెంటు ఆఫీసరు శిక్షణకు కావలసిన ఏర్పాట్లు చేస్తాడు. సభ్యులకు వ్యాయామశిక్షణ యివ్వడమే కాక, అనువైన పనులను కార్యక్రమాలను ఎన్నుకోవడం, ప్రథమ చికిత్స, పారిశుద్ధ్యం వగైరా విషయాల్లో శిక్షణ కూడా గరప బడుతుంది.

## ముఖ్య విషయం

పంచాయతీరాజ్ వ్యవస్థను దేశంలో తొలిసారిగా ఆరంభించింది మన రాష్ట్రమే. పంచాయతీరాజ్ పథకం ప్రజల్లో చైతన్యం, ధైర్యం, విశ్వాసం కల్గించింది. ఇప్పుడు సమధికోత్సాహంతో మనం అతి ముఖ్యమైన పథకాన్ని అమలు పరుస్తున్నాం. ఈ క్లిష్ట సమయంలో జాతీయ రక్షణ కృషికి యధాశక్తి తోడ్పడి, ఈ పథకాన్ని విజయవంతంగా అమలు పరచగలమనే విశ్వాసం మనకు వుంది. ★

# బహుముఖ సేవానిరతుడు

# శ్రీ వీరేశలింగం

తల్లాప్రగడ ప్రకాశరాయడు

*(సంఘ సంస్కర్తగా, ప్రముఖ రచయితగా, చరిత్రకారుడుగా దేశ సంఘ సేవాపరాయణుడుగా, ధర్మపరుడుగా త్యాగిగా కీర్తి గడించిన కీర్తిశేషులు శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారి శతవర్ష జయంత్యుత్సవాలను పురస్కరించు కొని యీ వ్యాసాన్ని ప్రకటిస్తున్నాము.)*

ధీరుడు, ధర్మవిదురుడు, కర్మవీరుడు, కళాభిజ్ఞుడు అయిన శ్రీ వీరేశలింగం పేరు ప్రతిష్ఠలు అతడు సృష్టించిన అమూల్యమైన సాహిత్యంలోను, నడిపించిన సాంఘిక విప్లవంలోను, తద్వారా ఆంధ్రజాతి హృదయంలోను ఆచంద్రార్కం నిలిచివుంటాయి. కనుకనే 'నవ్యాంధ్ర జాతిపిత' బిరుదం ఆయన పట్ల సంపూర్ణంగా సార్థకమయింది. ఆత్మ విశ్వాసంతో, అనన్యమైన పూనికతో అర్థశతాబ్దానికి పైగా స్వీయ జీవితాన్ని, సంఘ జీవితాన్ని శోధించి సానపట్టిన మనిషి, తలపులో, పలుకులో, పనిలో లాభాలాభాలను జయాపజయాలను గుణించకుండ, విపత్పరంపరల మధ్య తా నమ్మిన దానిని పట్టుదలతో చేసి చూపించిన వజ్రసంకల్పుడు వీరేశలింగం. ఆయన జన్మతిథి 1848 ఏప్రిల్ 16 వ తేదీ.

పున్నమ్మ, సుబ్బారాయుడుగార్లు ఈయన తల్లిదండ్రులు. ఈయన తాత వీరేశలింగం గారు. జ్ఞాతులకు, విద్వాంసులకు మడిమాన్యాలిచ్చిన మహాదాత. మన వీరేశలింగం శైశవంలోనే తండ్రి మరణించాడు. విద్యాబుద్ధులు చెప్పించి పెదతండ్రి ఈ బిడ్డను పెంచాడు. రెండవ తరగతిలోనే వీరేశలింగానికి తెలుగు సాహిత్యం పైన అభిలాష హెచ్చింది. ఇంగ్లీషును కూడా ఉపేక్షించి, పురాణాలు, కావ్యాలపైన ఆసక్తి మెండయింది. జ్ఞాపకశక్తి, బుద్ధికుశలత చిన్ననాటనే ఈ విద్యార్థిని వరించాయి. ఆ లేత వయస్సులోనే చక్కని పద్య రచనకూడా పట్టుపడ్డది. అతని ప్రవర్తన వల్ల ఉపాధ్యాయులకే గాక, తోడి బాలురందరికి కూడా అతనియందు పూర్ణమైన సదభిప్రాయమేర్పడ్డది. తన పాఠశాల ప్రధానోపాధ్యాయుడు ఇంగ్లీషు పాఠం సరిగా బోధించలేదని చెప్పి, బడి బాలురచేత సంతకాలు చేయించి, తానుచేసి, పై అధికార్లకు విజ్ఞప్తి పంపించాడు వీరేశలింగం. ప్రధానోపాధ్యాయునికిది తెలిసి ఆర్జీదార్ల ననేక విధాల బాధించాడు. అయినా తనది న్యాయ పక్షం కనుక, పట్టినపట్టు వీరేశలింగం వదలలేదు. పాఠశాలోపాధ్యాయుల సానుభూతిని కూడా సంపాదించి, విచారణాధికారిని రప్పించి, ప్రధానోపాధ్యాయుని పంపివేసి, కొత్త వానిని రప్పించే వరకు అతడు నిద్రపోలేదు. జీవితం పొడుగునా ఇట్టి సత్యాగ్రహ దీక్ష ఈ ప్రపంచంలో ఒక్క వీరేశలింగానికే సాధ్యమయింది. విద్యార్థి దశలోనే వీరేశలింగం ప్రజలలోని అర్థంలేని ఆచారాలను, మూఢ నమ్మకాలను విమర్శించి ఖండించే వాడు. చాలమందికి దయ్యాలను గూర్చిన నమ్మకం, భయం అధికంగా వుండేది. కనుక భూత వైద్యులు కూడ కొల్లలుగా వుండేవారు. కాని విన్నదాని నెల్ల విశ్వసింపగూడదని, విశ్వసించినదాని నెల్ల ధైర్యంతో అనుసరించి తీరాలని వీరేశలింగం చేసుకున్న ధర్మ నిర్ణయం. ఒక్క దయ్యాన్నైనా తనకు చూపించ వలసిందని భూత వైద్యులను, మాంత్రికులను ఆశ్రయించాడు. వాళ్ళతోను, వంటరిగాను, స్మశానాలలో కూర్చున్నాడు. కాని దయ్యాన్ని చూపగలిగిన వాడొక్కడూ లేకపోయినాడు. వీరేశలింగం కోరంగిలో ఉపాధ్యాయుడుగా నుండగా, అక్కడ తనను చంపుతానని శపథం చేసిన బ్రాహ్మణ భూత వైద్యుని గూర్చి 'స్వీయ చరిత్ర' మూడవ అధ్యాయంలో వర్ణించబడ్డ విచిత్ర విషాద గాథ దయ్యాల భయస్థులకు కనువిప్పు కాగలదు.

1867 ప్రాంతంలో పెత్తండ్రి చనిపోయి,

కుటుంబ బాధ్యత తనపై బడటంవల్ల వీరేశలింగం ఆవశ్యంగా ఏదో ఒక వృత్తిలో ప్రవేశించక తప్పింది కాదు. నెలకు రు. 20 ల ఇస్తానని, దినమూ మూడు గంటలు తన వద్ద లేఖకుడుగా పనిచేయమని ఒక న్యాయవాది వీరేశలింగాన్ని కోరినాడు. ఇతడు దానికంగీకరించి పనిలో ప్రవేశించాడే కాని, ఆ న్యాయవాది వేశ్యనుంచుకొన్న దుర్నీతి పరుడని కొద్ది రోజులకే యీ గుమాస్తాకు తెలిసింది. ఒక రోజు వేశ్య బాహాటంగా ప్లీడరు ఇంటికే వచ్చి, అందరి యెదుట అతనితో సరసాలాడిటం వీరేశలింగం సహించలేక పోయినాడు. వెంటనే పని మానుకొని ఇంటికి పోయినాడు. 1870 లో వీరేశలింగం విశ్వవిద్యాలయ ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణుడైనాడు. కాని ముందుగతి యింకా నిర్ణయం కాలేదు. న్యాయవాది కావాలనుకున్నాడు. కాని ఆ వృత్తిలో న్యాయాన్యాయాలను తారుమారు చేయవలసివస్తుందని విని, దానిమీద రోతపుట్టింది. కనుక ఆ ప్రయత్నం విరమించాడు. అయితే స్వతంత్ర జీవనమో, లేదా ఉపాధ్యాయత్వమో చేయ నిశ్చయించాడు. 1871 లో రాజమహేంద్రవరంలోని ప్రభుత్వ జిల్లా పాఠశాలలో ఒక సంవత్సరం సహాయోపాధ్యాయుడైనాడు. వీరేశలింగం దృష్టిలో అధ్యాపకత్వమంటే విద్యార్థులకు పెద్దలయెడ భయభక్తులను, నీతి వర్తనను, ఉపాధ్యాయగణంలో పరస్పర గౌరవ భావాన్ని పురిగొల్పడమే. తదుపరి 1872 లో కోరంగి యింగ్లీషుపాఠశాలలోప్రధానోపాధ్యాయత్వం లభించింది. అది రెండేళ్ళలో అఖరయింది. 1870 నుండీ 'గోదావరీ విద్యాబోధిని' పత్రికకు వ్యాసాలు వ్రాయ మొదలు పెట్టాడు. కోరంగి వెళ్ళక పూర్వం బందరులోని 'పురుషార్థ ప్రదాయిని'కి గ్రంథాలే వ్రాసి పంపేవాడు. ఈ లోగా భాషాంతరీకరణ పరీక్షలో కూడ కృతార్థుడైనాడు. కోరంగి తరువాత ధవళేశ్వరం పాఠశాలకు ప్రధానోపాధ్యాయుడైనాడు. 1874 ప్రాంతంలో అక్కడి మిత్రులు అష్టావధానం చేయవలసిందని కోరగా దానిని చేయ మొదలు పెట్టినాడు. అది చూచిన వారందరూ ఆశ్చర్యంతో ఆనందపరవశులయ్యేవారు. కాని, దానివల్ల తలనొప్పే కాని లోకానికి గాని తనకు గాని నిజమైన ప్రయోజనం లేదని భావించి, తరువాత ఎవరెన్ని విధాల ప్రార్థించినా అవధానం చేయడం మానుకున్నారు.

చిన్నతనంలోనే వీరేశలింగంలో సంఘ సంస్కరణాభిలాష పొడచూపి, దినదినం అభివృద్ధి చెందుతూ వచ్చింది. ప్రజలలో నిజమైన విద్యాగంధం లేక, సంఘం దురాచారాలతోను, మతం మూఢ విశ్వాసాలతోను నిండి, అధికార్లలో నిరంకుశత్వం, లంచగొండితనం బాగా చెలరేగిన రోజులవి. వాటి నిర్మూలనకు విరామం లేని కృషి సల్పడమే యీ ఉపాధ్యాయుడు వృత్తిలో వృత్తిగా పెట్టుకున్నాడు. తన్నిమిత్తం 26 వ యేట 1874 లో వివేకవర్ధని యనే మాసపత్రికా ప్రచురణ ప్రారంభించాడు. చిరకాలం అది విజయవంతంగాసాగింది. పత్రికోద్దేశం 'భాషాభివృద్ధి, దేశాభివృద్ధి' అన్నాడు. వ్యాపారదృష్టితో గాని, పాండిత్య ప్రకర్ష కోసం గాని బ్రతికిన పత్రికకాదు వివేకవర్ధని. దేశంలో మత సాంఘిక పారిశుద్ధ్యానికి సత్ప్రవర్తనయే మూలకందమని ఆయన మతం. వదలకొట్టడమే వివేకవర్ధనికి ప్రధానాశయమయింది. లంచాలు తినడం ఉద్యోగ ధర్మమని, వేశ్యాగమనం గొప్పతనమని చెప్పి వాటికి లోబడిన పురానా దుర్జనులందరికి వివేకవర్ధని అంకుశమయింది. దానికి భయపడి పైకి మిత్రుల లాగున నటిస్తూనే, చాటున దూషిస్తూ, సమయం చూచి చేతనైనంత చెరుపు చేయ తలపెట్టిన వారనేకు లుండేవారు. అయినా 'ఈశ్వర బలం, సత్యబలం ముందు మనుష్యబలం ధన బలం, అధికారబలం ఎందుకూ కొరగావ'ని ఆయన దృఢ విశ్వాసం. 1878 సం. లో రాజమహేంద్రవరంలో కోర్టు మునసబుగా వుండిన పోలూరి శ్రీరాములు, గవర్నమెంటు ప్లీడరు చిత్రపు కామరాజు, జిల్లా జడ్జికోర్టు సిరస్తాదారు రోజారియో, రికార్డు కీపరు బొల్లాప్రగడ వెంకన్న తోడుదొంగలై న్యాయానికి మసిపూసి ప్రజలకు చేసిన దారుణ ద్రోహాలకు వివేకవర్ధని శస్త్రచికిత్సగా, బ్రహ్మాస్త్రంగా పనిచేసింది. ఒక్కొక్క వ్యాజ్యంలో వీరేశలింగం ప్రజాపక్షం అవలంబించి కేవలం యమధర్మరాజువలె పూనికతో తీసుకున్న అద్భుత చర్యల ఫలితంగా పైదుష్టచతుష్టయానికి ప్రాప్తించిన శిక్షల, జాలికరమైన దుర్మరణాల విచిత్ర చరిత్ర ధర్మ విజయానికి ప్రతీకంగా కల్పాంతం వరకూ నిలిచివుండగలదు. వివేకవర్ధనికి మరో పేరు 'దుష్టాధికార గర్వ నిర్భేదకం' అనవచ్చు. స్వతంత్రుడుగా నుండవలెననే యుద్దేశంతో వీరేశలింగం ధవళేశ్వరం పని మానుకొని 1876 లో స్వస్థానానికి చేరుకున్నాడు. కాని బంధు మిత్రుల ఒత్తిడివల్ల రాజమహేంద్రపుర ప్రభుత్వ కళాశాలలో ఆంధ్రాధ్యాపకత్వానికి ఒప్పుకున్నాడు. ఉపాధ్యాయత్వం అతడికి దైవమిచ్చిన వృత్తి అయింది. ఏదో ఒక రూపంలో మనసా, వాచా, కర్మణా ఆయన నడిపిన అపూర్వ సంస్కరణోద్యమ మంతా తరతరాల మానవులను తరింపజేసిన అధ్యాపకత్వమే. స్త్రీ పునర్వివాహాది ఉద్యమాలన్నిటిలో ఆనాటి యువక విద్యార్థులే

ఆయనకు అండగా నిలిచి పనిచేసిన వారు. మత సాంఘిక సంస్కారోద్యమాన్ని విస్తరింప జేయడానికి రెండు సంవత్సరాలు సెలవు పెట్టి 1897 లో భార్యా సహితంగా చెన్నపురికి చేరాడు. వెళ్ళడంతోనే అక్కడొక సంఘ సంస్కార సభ స్థాపించి, తద్వారా వితంతు శరణాలయాన్ని కూడా నెలకొల్పాడు. అక్కడ సంఘ సంస్కార సమాజ మందిర మొకటి, బ్రాహ్మణ సమాజికులకొక ఈశ్వరోపాసనా మందిరం కట్టించాడు. తన గ్రంథ ముద్రణ కొరకు ముద్రాయంత్రం, దానికొక యిల్లు కొన్నాడు. ఈలోగా తనను మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలకు మార్చినట్లు ఉత్తర్వు రాగా, దానిని దైవచిత్తంగా యెంచి 1905 వరకూ అక్కడనే పనిచేసి, నెలకు రు. 24 ల ఉపకార వేతనం పైన తిరిగి జన్మ స్థలానికి చేరుకున్నాడు. సంపూర్ణ శ్రద్ధతో ఉద్యోగ ధర్మాన్ని నిర్వహిస్తూనే మద్రాసులో కూడ తన సంస్కారోద్యమాన్ని సముద్ర తరంగంగా నడిపించాడు. దాని ప్రభావం ప్రసారం పరిసర రాష్ట్రాలకుకూడ పాకింది. 1908 లో బెంగుళూరులో కూడ ఒక ప్రార్థన సమాజ మందిరం కట్టించి యిచ్చాడు. 1898 లో మద్రాసులో జరిగిన భారత జాతీయ సంఘ సంస్కార మహాసభకు అగ్రాసనాధిపత్యం వహించాడు. అందు మహాదేవ గోవిందరానెడే మహాశయుడు వీరేశలింగం పంతులుకు 'దక్షిణ భారత విద్యాసాగరుడ'నే నూతన నామకరణం చేశాడు. 1902 లో కాకినాడలో చెన్నరాజధాని దేశీయ సాంఘిక మహాసభకూ,మరల 1903 లోనే చెన్నపురిలో భారత జాతీయాస్తిక మహాసభకూ అధ్యక్షత వహించాడు. అతడు అనుష్ఠానిక బ్రాహ్మ సమాజికుడు కావడానికి కారణాంతరాల వల్ల మరి కొంతకాలం పట్టినా, వివేకవర్ధని స్థాపన నాటికే అతడు బహు దేవతారాధనను మాని వేసి ఏకేశ్వరోపాసనను నిష్ఠతో అవలంబించాడు.

వీరేశలింగంతో ఆంధ్ర వాఙ్మయంలో ఒక నూతన పోకడ, ఒక నూతన శకమే యేర్పడ్డదని చెప్పవలె. ఇతడు సృష్టించినన్ని వాఙ్మయ శాఖలు మరే ఒక్కరూ సృష్టించలేదు. చిన్ననాటి ఉబలాటంతో ప్రారంభించి పట్టిన ప్రతిజ్ఞను నిలుపుకొన్న 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధం' మొదలుకొని అత్యంత వ్యయ ప్రయాసలతో, శ్రమతో, పరిశోధనాపటిమతో వ్రాయబడ్డ ఆంధ్రకవుల చరిత్రవరకూ గల పలురకాల రచనలలో స్త్రీ పురుషుల వివేక విజ్ఞానోదయానికి అవసరమని తోచిన ఏ ఒక్క విషయాన్ని ఆయన విడిచిపెట్టలేదు. దేశీయ పురాణాలు, ఇతిహాసాలు, వివిధ దేశాల కావ్యాలు, నాటకాలు, ప్రపంచ మహాపురుషుల ఉత్తమ స్త్రీల దివ్యచరిత్రలు ఎన్నో గాలించి, ఏర్చి, కూర్చి—పెద్దలకు నవల, చిన్నలకు ఈసపు కథ, గుండె చీల్చివేసే దుర్మత ఖండన, కడుపుబ్బ నవ్వించే హాస్య విమర్శ—ఒకొక్కక్కరి కొకొక్కటి, అందరకూ అన్నీ—ఇన్ని విధాలుగా కావలసిన వారికి ప్రౌఢిమతో కూడిన పద్యంలోను, ఎక్కువభాగం మనోహరమైన గద్యంలోను చెప్పి మెప్పుపొందిన సారస్వత సామ్రాట్టు వీరేశలింగం. ఇక్కడచోటు చాలదుకాని, పది పన్నెండు పెద్ద సంపుటాలలో కూర్చబడ్డ ఆయన రచనల జాబితా, వరుసను వ్రాసినా, దానిమటుకదే వీనులకు విందవుతుంది. ఆయన యే గ్రంథంవ్రాసినా అందు సంఘ దురాచార సంస్కరణం, పరిశుద్ధాస్తిక ధర్మ ప్రకటన ప్రచారం వీలైనచోటల్లా చొప్పించడం మరవలేదు.

వీరేశలింగం జీవితకథలో స్త్రీ పునర్వివాహ ప్రయత్నం ప్రత్యేకస్థానం, అగ్రస్థానం ఆక్రమిస్తుంది. ఆయన అవతరించింది దాని కోసమే అంటే అతిశయోక్తి కాబోదు. ముఖ్యంగా రాజమహేంద్రవరం మద్రాసు అందుకేర్పడ్డ రెండు కల్యాణ పీఠాలు. వివిధ ప్రదేశాలలో సమాజాలు స్థాపించడంలో ఉద్యమం ప్రారంభమయింది. దీనికి ప్రార్థన సమాజం, విద్యార్థుల సంఘం రెండూ రెండు భుజాలు. వివేకవర్ధని శంఖారావం చేసే సారథి. ఈ విషయంలో భార్య రాజ్యలక్ష్మమ్మకు మొదట కలిగిన భయసందేహాలు తీర్చి, సంపూర్ణంగా ఒప్పించి ఆమెను సహయాత్రిణిగా చేసుకున్నాడు. న్యాపతి సుబ్బారావుపంతులు ముఖ్యంగా ప్రాణసఖుడు బసవరాజు గవర్రాజువంటి సహచరులెందరో వెంటనున్నారు. జంబుకాలు జడిపించాయి, శకునపక్షులు శతించాయి, తుంటరిమూకలు రంకెలువేసి రాళ్ళవర్షం కురిపించాయి. అయినా సింహబలంతో యజ్ఞవేదిక నధిష్ఠించి మంత్రజప మారంభించాడు వీరపురుషుడు. 1881 డిశంబరు 11 వ తేదీన మొదటి స్త్రీ పునర్వివాహం జరిగింది. వీరేశలింగం నిఘంటువు ప్రకారం జరుగవలసింది జరిగే తీరుతుంది. మానదు. దేశమంతటా వాద ప్రతివాదాలు, విమర్శలు, దూషణలు, మత పీఠాధిపతి నుండి బహిష్కార పత్రికలు — ఇట్లా దుమారం చెలరేగింది. అయినా ఉత్సవరథం ఆగలేదు. ఈశ్వర ప్రేరితం, ఈశ్వర ప్రీతికరం కనుక అది మరింత వడి వడిగా సాగజొచ్చింది. ఒకటి తరువాత వొకటి వివాహాలు పరంపరగా జరిగించబడ్డవి. ఇట్లా రాజమహేంద్రవరంలో రూపొందిన వితంతూద్వాహోద్యమం వీరేశలింగం పేరు భరతఖండమంతటా ప్రతిష్ఠపొందినవి. వీరేశలింగం అంటేనే ధర్మానికి, ధైర్యానికి ప్రతిజ్ఞాబలానికి పెట్టింది పేరని ఋజువయింది.

వీరేశలింగం నెలకొల్పిన ప్రజాహిత సంస్థల, వాటికోసం నిర్మించబడ్డ కట్టడాల చరిత్ర చెప్పుకుంటేనే పెద్ద అధ్యాయమవుతుంది. 1890 లో పురమందిర నిర్మాణం 1897 లో ప్రార్థన సమాజమందిరం కట్టించబడ్డవి. 1905 లో ఒక తోటనుకొని సకుటుంబంగా కాపురం అక్కడకు మార్చాడు. గృహనిర్మాణం తరువాత వితంతు శరణాలయం కూడ అక్కడనే స్థిరపడ్డది. ఆ కాలంలోనే నిరుపమాన సద్వర్తనుడు, సంస్కార దీక్షాదక్షుడు, దేశిరాజ పెద బాపయ్య అనుష్ఠాన బ్రాహ్మదీక్షయందు తనకు మార్గదర్శకుడైనట్లు వీరేశలింగం పరమానందంతో చెప్పుకుంటాడు. తాను వర్ణభేదాన్ని, యజ్ఞోపవీతాన్ని త్యజించినా, హిందూ వితంతు వివాహోద్యమాని కెట్టి అంతరాయం కలుగనియ్యలేదు. తాను పూనిన సంస్కారాలను నెరవేర్చడానికి 1906 లో హితకారిణీ సమాజాన్ని నెలకొల్పి, రిజష్టరు చేయించి, అప్పటికి రూ 41,500 ల విలువ గల ఆస్తులను వారి కప్పగించాడు. 1908 నుండి హితకారిణీ ఆస్తికోన్నత పాఠశాలను ప్రారంభించి, స్వయంగా నడిపించాడు. అందు బాలికలకు, పంచములకు ఉచితవిద్య ఏర్పాటుచేశాడు. ఇపుడు పెద్ద భవనంలో పనిచేస్తున్న వీరేశలింగాస్తిక పాఠశాల అదే. ఇన్ని సంస్థలు కట్టడాల భగీరథ ప్రయత్నం, దానికితగిన విజయం యీ తెలుగు గడ్డపై మరి ఏ వొక్క వ్యక్తికి సాధ్యమయింది ?

తన తోడు నీడగా, తనతో సరిసమానంగా సమస్త కష్ట నిష్ఠురాలను భరించిన సహధర్మచారిణి మహాసాధ్వి, అవ్యాజ దైవభక్తి సంపన్నురాలు శ్రీమతి రాజ్యలక్ష్మమ్మ 1910 లో అకస్మాత్తుగా కాలధర్మం పొందింది. దానితో కాలూ చేయీ పడిపోయినట్లు బాధ పడ్డాడాయన. తీరని అసహాయత, ఏకాకితనం అనుభవించాడు. పాపం భార్య ఆస్తికలను నిక్షేపించిన తోటలోనే ఆమె సమాధిని నిర్మించాడు. దాని ప్రక్కనే తన సమాధికి చోటేర్పరిచాడు. సమాధి చుట్టూవున్న తోటకు రాజలక్ష్మి ప్రమదావనమని పేరు పెట్టాడు. భార్య మరణం అతని ప్రజాసేవకు ఆటంకం కాలేదు. కాని చిన్ననాటినుండి బాధిస్తూ వుండిన ఉబ్బసంతో సహజంగా దేహదార్ఢ్యం క్రమంగా క్షీణించింది. 1919 లో తన ఆఖరి జన్మదినోత్సవం చేసుకున్న మూడవనాడు మద్రాసు ప్రయాణం పెట్టుకున్నాడు. ఆ వెళ్ళడం కూడా అక్కడి పుస్తక భాండాగారంలోని పూర్వసాహిత్య పరిశోధన కోసమే. ఆ మనిషి పరిశ్రమ పట్టుదల అట్టివి. 'నే నీసారి మద్రాసునుండి తిరిగి రాజమహేంద్రవరం రాగలననే నమ్మకం నాకు లేదు. నాలో మూడు కోరికలు మిగిలి వున్నవి. 1. రాజమహేంద్రవరంలో నన్నయభట్టుపేర గొప్ప గ్రంథాలయ మొకటి స్థాపించుట. 2. కవుల చరిత్రను పూర్తిచేయుట. 3. సమగ్రమగు తెలుగు వ్యాకరణం రచించుట. ఈ మూడును నా జీవితకాలంలో నెరవేరనిచో, నా మిత్రులు వాటిని నెరవేర్చెదరని నా ఆశ' అని అన్నాడట. ఆయన తుదికోరిక లెట్లున్నాయో చూడండి. లోకమే కుటుంబంగా బ్రతికేవారి లక్షణమది. తా ననుకున్నట్లుగానే, తెలుగు దేశపు దురదృష్టంవల్ల, నెల రోజుల్లోనే 1919 మే 27 వ తేదీని మద్రాసులో దేహం చాలించి అమృతత్వాన్నందుకున్నాడు ఆ వీర పురుషుడు.

వీరేశలింగం భాగ్యవంతుడు కాడు, ఆరోగ్యవంతుడు కాడు, ఒక్కమాటలో చేపితే — ఆయన సత్కార్యాచరణ ధైర్యమే ఆయనకు భాగ్యం, ఆరోగ్యం అయి ధన్యాత్ముణ్ణి చేశాయి.

(శ్రీ కందుకూరి వీరేశలింగం శతవార్షిక జయంత్యుత్సవ సంఘంవారి సౌజన్యంతో)

---

**తక్కువగా మాట్లాడండి!**

**ఎక్కువగా పని చేయండి!**

---

# ప్రబోధము

మెండా చినసీతారామయ్య

భారతవీర సోదర ! భవత్ప్రతిభా సముదాత్త శౌర్య గం
భీరతరప్రవృత్తి రిపు భీకరమై పెను పొందఁగా సునా
సీరతనూజ విక్రమ విశిష్టతఁ జూపుము యుద్ధమందుఁ జై
నా రజనీచరాంధ్య తుహిన ప్రవినాశ విభాకరుండవై .

మనదేశీయ పురాఃమహోజ్జ్వల యశోమర్యాద జ్యోత్స్నాప్రస్ఫుర
ద్ఘననైర్మల్యము సంతరించుకొని విద్వన్మాన్య పూజార్హమై
తనరెన్ గానఁ దదీయ కీర్తిలతికా స్తంభమ్ము నిల్పంగ నె
మ్మినిఁ గేలూఁత నొసంగు సోదర ! రసోన్మీలాంతరంగుండవై .

జాతిని దీర్చి దిద్దుటకు జాగృతిఁ జూపుము దుష్టశాత్రవ
వ్రాతము నోర్చి భవ్య నవ భారత సౌహృదజైత్రకేతన
ఖ్యాతిని దిగ్దిగంతరములందు నిగుడ్పుము సౌమనస్యకం
జాతనితాంత సౌరభవశంవద చిత్తుఁడవౌచు సోదరా !

బిరుదు మగంటిమిఁ జూపెడు
తరుణము నేఁ డేగుదెంచెఁ దమ్ముఁడ ! వేగన్
దురమున జొరఁబడు చైనా
నరకాసురు పీచమణఁచ నలినాక్షుఁడవై .

నక్క జిత్తులు చూపి యీ నాఁటి దాఁక
నదనుఁగనిపెట్టి మన భూమి నాక్రమించి
కులుకుచున్నది చైనీయశలభపాళి
భరత వీరదవానలా ! ప్రజ్వరిలుము.

దేశరక్షణార్థమ్ము సందేశ మొసఁగు
జవహరాఖ్య ప్రధాని శిక్షణము క్రింద
ముందునకు దూఁకి దేశవిముక్తి కొఱకు
జీవితత్యాగమున కైన సిద్ధపడుము.

# ముఖ్యవార్తలు

## రాష్ట్రంలో

26 డిసెంబరు :— కేంద్ర జలవిద్యుత్ సంఘ సభ్యుడు శ్రీ హండా. గుల్హాతీ నివేదికనుగూర్చి రాష్ట్రప్రభుత్వం అభిప్రాయం తెలుసుకొనేందుకు హైద్రాబాదు వచ్చారు.

28 డిసెంబరు :— సెంట్రల్ రైల్వేలో కొండపల్లి, ఎర్రుపాలెంమధ్య 15 మైళ్ళ జంట రైలుమార్గం ఆరంభించబడింది.

31 డిసెంబరు :— రాష్ట్ర కార్మిక రవాణా శాఖల మంత్రి సికింద్రాబాదులో కొత్త ఉద్యోగ సాధక కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు.

1 జనవరి :— కేంద్ర ఆహార, వ్యవసాయ శాఖల మంత్రి హైద్రాబాదులో 23 వ అఖిల భారత పారిశ్రామిక ప్రదర్శనానికి ప్రారంభోత్సవం జరిపారు.

7 జనవరి :— ప్రఖ్యాత చారిత్రక పరిశోధకులు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు దివంగతులైనారు.

9 జనవరి :— హైద్రాబాదులో రాష్ట్ర కార్మిక సలహా సంఘం సమావేశమై. సలహా సంఘాన్ని సంప్రదించకుండా కార్మికులను ఎవరినికూడా ఉద్యోగంనుంచి తొలగించకూడదని ఏకగ్రీవంగా ఒక తీర్మానాన్ని ఆమోదించింది.

10 జనవరి :— 1963-64 సంవత్సరానికి హైద్రాబాదు మునిసిపల్ కార్పొరేషను బడ్జెటు ప్రతిపాదించబడింది.

11 జనవరి :—కేంద్రసమాచార శాఖ మంత్రి, హైద్రాబాదులోని అఖిల భారత పారిశ్రామిక ప్రదర్శనంలో "జాతీయ ఆత్యయిక పరిస్థితి శక్తిస్తోమతుల సమీకరణ" అనే విషయంపై జరిగిన గోష్ఠికి ప్రారంభోత్సవం చేశారు.

రాష్ట్ర పరిశ్రమల మంత్రి హైద్రాబాదులో ఆంధ్రప్రదేశ్ మైనింగ్ కార్పొరేషన్ నెలకొల్పిన రసాయనిక పరిశోధనాలయానికి ప్రారంభోత్సవం చేశారు.

16 జనవరి :— హైద్రాబాదులో విద్యాశాఖా మంత్రి తెలంగాణాలోని ప్రయివేటు,ఎయిడెడ్ పాఠశాలల ప్రధానోపాధ్యాయుల ప్రథమ మహాసభకు ప్రారంభోత్సవం చేశారు.

ముఖ్యమంత్రి నగరంలో మురికిపేటల్లో నివసించే ప్రజలకై ఉద్దేశించబడిన తక్కువ ఖర్చు కాగల ఇండ్ల నిర్మాణానికి శంకుస్థాపన చేశారు.

## భారతదేశంలో

28 డిసెంబరు :— కేంద్ర న్యాయ శాఖా మంత్రిని అటార్నీ జనరల్గా కూడా నియమించేందుకై తదనుగుణంగా రాజ్యాంగాన్ని సవరించడానికి భారత ప్రభుత్వం నిర్ణయించింది.

30 డిసెంబరు :— దక్షిణ మండలం సమావేశం కన్యాకుమారిలో జరిగింది.

1 జనవరి :— ప్రీమియం ప్రైజుబాండ్ల పథకం ఆరంభించబడింది.

5 జనవరి :— మన ప్రధానమంత్రి, శ్రీ చౌ-ఎన్-లైకు వ్రాసిన చివరిలేఖలో వివాదాన్ని ప్రపంచ న్యాయస్థానానికి నివేదించవలసిందిగా సూచించారు.

7 జనవరి :— ప్రధానమంత్రి ఉత్తరప్రదేశ్లో రూ. 46 కోట్లు ఖర్చులో నిర్మించబడ్డ రిహాండ్ ప్రాజెక్టుకు ప్రారంభోత్సవం చేశారు.

9 జనవరి :— కేంద్ర ఆర్థిక మంత్రి బంగారం కంట్రోలు నియమావళిని ప్రకటించారు.

10 జనవరి :— కొలంబో సమావేశపు ప్రతిపాదనలను చర్చించడానికి సింహళం ప్రధాని న్యూఢిల్లీకివచ్చారు.

బంగారం కంట్రోలు నియమావళి అమల్లోనికి వచ్చింది.

13 జనవరి :— కొలంబో సమావేశపు ప్రతిపాదనలను పార్లమెంటుకు నివేదించడానికి భారత ప్రభుత్వం నిర్ణయించింది.

15 జనవరి :— 1962 సం॥ వర్కింగు జర్నలిస్టుల (సవరణ) చట్టం అమల్లోకి వచ్చింది.

17 జనవరి :— స్వామి వివేకానంద శతజయంతి ఉత్సవాలను జరిపారు.

## విదేశాలలో

21 డిసెంబరు :— పశ్చిమ ఇరియన్లో డచ్చి ప్రభుత్వం అంతరించింది.

29 డిసెంబరు :— భారత, పాకిస్తాన్ ప్రభుత్వాల మధ్య మంత్రులస్థాయిలో రావల్పిండిలో జరిగిన చర్చలు ముగిశాయి.

30 డిసెంబరు:— కటాంగాలో, 'యుద్ధచర్య' ముగిసిందని అంతర్జాతీయ సంస్థ ప్రకటించింది.

10 జనవరి :— తన దేశంలో "భూస్వామ్యవాదానిన పరిపాలన''కు స్వస్తి చెబుతూ ఇరాన్ దేశపురాజు ప్రకటించారు.

అరబ్ రక్షణదళంలో భాగంగా కువైట్‌లో నున్న తమ దళాలను ఉపసంహరించుకోడానికి జోర్డాన్ నిశ్చయించింది.

14 జనవరి :— క్యూబాతో పశ్చిమ జర్మనీ ప్రభుత్వం దౌత్య సంబంధాల్ని తెగతెంపులు చేసుకొంది.

ప్రస్తుతపు వాణిజ్య ఒప్పందాన్ని 1966 ఫిబ్రవరి వరకూ పొడిగిస్తూ, భారతదేశం యునైటెడ్ అరబ్ రిపబ్లిక్ దేశాలు కైరోలో ప్రొటోకోల్ సంతకాలు చేశాయి.

15 జనవరి :— కటాంగా వేరుపడిన స్థితి అంతమైనట్టు కటాంగా నాయకుడు షోంబే ప్రకటించారు.

17 జనవరి :— ఈ సంవత్సరం ఇటలీ దేశాన్ని సందర్శించ గోరుతూ వచ్చిన ఆహ్వానాన్ని ప్రెసిడెంటు కెన్నెడీ అంగీకరించారు.

---

# రచయితలు

డాక్టర్ నీలం సంజీవరెడ్డి, ముఖ్యమంత్రి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైద్రాబాద్.

శ్రీ దాశరథి కృష్ణమాచార్య, ఆలిండియా రేడియో, హైద్రాబాద్.

శ్రీ కె. వి. భాస్కరరావు, పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్, సమాచార పౌరసంబంధాలశాఖ, హైద్రాబాద్.

డాక్టర్ యం. చెన్నారెడ్డి, ప్రణాళిక,పంచాయతీరాజ్య శాఖల మంత్రి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైద్రాబాద్.

శ్రీ గడియారము వేంకటశేష శాస్త్రి, మహాకవి, శతావధాని యం.యల్.సి, ప్రొద్దుటూరు, కడపజిల్లా.

శ్రీ పి. వి. నరసింహారావు, న్యాయ - సమాచారశాఖల మంత్రి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైద్రాబాద్.

డాక్టర్ కె. కృష్ణారావు, లీగల్ ఎడ్వైజర్, ఎక్స్‌టర్నల్ ఎఫేర్స్, కేంద్ర ప్రభుత్వం, న్యూఢిల్లీ.

"అమరేంద్ర" శ్రీ సి. నరసింహ శాస్త్రి, యం. ఎ., గుంటూరు, గుంటూరు జిల్లా.

శ్రీ మహతీ శంకర్, తెలుగు శాఖ, ఎ. సి, కాలేజి, గుంటూరు.

శ్రీ పైడిపాటి సుబ్బరామ శాస్త్రి, కవిసమ్రాట్, మారుతీ నగర్, విజయవాడ, కృష్ణా జిల్లా.

శ్రీ "సంపతి''...............

శ్రీ యం. వి. రావు, బి. ఎ., అమీర్ పేట, హైద్రాబాద్.

శ్రీ సి. వి. సుబ్బన్న, శతావధాని, ప్రొద్దుటూరు, కడప జిల్లా.

శ్రీ జి. వి. రామమూర్తి, దక్షిణ భారత హిందీ ప్రచార సభ, హైద్రాబాద్.

శ్రీ జూలూరి హనుమంతరావు, సనత్ నగర్, హైద్రాబాద్.

శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య, సీతాఫలమండి, సికింద్రాబాదు.

శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు, ఆలిండియా రేడియో, హైద్రాబాద్.

శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయడు, దానవాయిపేట, రాజమండ్రి, తూ. గో. జిల్లా.

శ్రీ మెండా చినసీతారామయ్య, తెలుగుశాఖ, గవర్నమెంటు ఆర్ట్సుకాలేజీ, రాజమండ్రి, తూ. గో. జిల్లా.

గ్రంథ సమీక్ష

శ్రీ టి. యల్. ప్రకాశరావు, హైదరాబాద్.




మీ "ఆంధ్రప్రదేశ్" పత్రిక కాంప్లిమెంటరీ ప్రతి గత ఆరు నెలలనుంచీ నాకు సక్రమంగా అందుతూవుంది. ఈ పత్రిక మెయిలింగ్ లిస్టులో నా పేరు చేర్చినందుకు చాలా కృతజ్ఞతలు.

ఆరు నెలలనుంచీ నేను మీ పత్రిక చదువుతూ వున్నాను. బృహత్తరమైన మీ రాష్ట్రంలో జరుగుతున్న అభివృద్ధిని గూర్చి చక్కగా తెలుసుకుంటూ వున్నాను. ఇది అందిస్తున్న సమాచారం ఆసక్తిదాయకమైనదీ, పురోభివృద్ధిని గూర్చి తెలుసుకోడానికి తోడ్పడేదీ మాత్రమే కాకుండా, మీ రాష్ట్రంలో మొత్తంమీద సాధించబడిన అభివృద్ధి విషయంలో సాధారణ భారత పౌరుడు సరైన నిశ్చయానికి రావడానికి ఉపకరించేదిగా కూడా వుందని నేను భావిస్తున్నాను. మీకు సమ్మతమైతే ఒక సూచన చేయదలచాను : ఈ పత్రికలో వ్యవసాయ, పారిశ్రామిక ప్రగతికి సంబంధించిన గణాంకములను కూడా ఇతర సమాచారంతోపాటు పొందుపరచండి. అన్ని స్థాయిలలోనూ విద్యావ్యాప్తి జరగడంకూడా ఇంతే ముఖ్యమైనది. ఇప్పుడు నేను మీకు సూచించదలిచింది ఇదే.

షామ్‌లాల్ షరవ్ ఎం. పి,

10, విండ్సర్ ప్లేస్,

న్యూఢిల్లీ

(విద్య, వ్యవసాయ రంగాలకు సంబంధించిన వార్తా విశేషాలను ఇటీవల ఈ పత్రికలో ప్రారంభించడం జరిగింది. - సం)

* * *

మీరు పంపుతూఉన్న "ఆంధ్రప్రదేశ్" కృతజ్ఞతతో పుచ్చుకొంటున్నాను. పత్రిక బాగావుంటోంది.

పింగళి లక్ష్మీకాంతం

తిరుపతి

* * *

మీరు క్రమంగా పంపుతున్న "ఆంధ్రప్రదేశ్" చేరుతునే యున్నది. దాని క్రమాభివృద్ధిని అందచందాలను చూచి ఎంతో సంతోషించుచున్నాను. మీకు అందుకై నా ధన్యవాదములు.

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

తిరుపతి

* * *

వెల స్వల్పము - ఫలమధికముగా చక్కటి వ్యాసములు, నాటికలు, కథానికలు, పద్య ఖండములు, సంగ్రహ ప్రకటనలు, వివిధ కేంద్రములలో జరిగిన అభివృద్ధి కార్యక్రమాలు, వార్తలు, చక్కటి చిత్రములు, ప్రశ్నలు - సమాధానములు మొదలగు పెక్కు ఆకర్షణీయమైన శీర్షికలతో అల్ప చందాతోనే సర్వాంగ సుందరముగా వెలువడుచున్న ఆంధ్రప్రదేశ్ మాస పత్రిక శుక్లపక్ష చంద్రునివలె దినదినాభివృద్ధిగాంచుటకై భగవానుడు సదా అనుగ్రహించుగాక.

చామలమర్రి రామకృష్ణయ్య

టీచరు

పంచేడు - వయా: బుచ్చిరెడ్డిపాలెం,

నెల్లూరు జిల్లా.

---



---

# "ఆచరణలో త్యాగానికి సిద్ధంకండి!"

## అనే సందేశంతో "రక్షణ నిధికి" సమర్పితమైన మంచి నవల.

భారత మాతకు ఏర్పడిన అవమానానికి ప్రతి భారతీయుని రక్తం ఉడికెత్తిపోతూంది. యీ క్లిష్ట పరిస్థితిలో తనకర్తవ్యం యేమిటని ఆబాలగోపాలమూ ఆత్మపరీక్ష చేసుకునే తరుణం యిది. దేశమాత గౌరవాన్ని కాపాడడానికి బీద, ధనికుడనే వ్యత్యాసం లేకుండా తమ సర్వస్వాన్ని ఆమె పాదాలముందు అర్పించడానికి సంసిద్ధులయ్యారు. ఇది ధర్మ యుద్ధం. సామ్రాజ్య కాంక్షతో పంచశీల అనే మంత్రాన్ని జపిస్తూనే, స్నేహం ముసుగులో మన భూభాగాలను స్వాహా చేయాలని వంచించిన చైనా ముష్కరులకు మన వీరత్వపు రుచిని చూపించాల్సిన అవకాశం మనం అనుకోకుండానే కలిగింది. శాంతి ప్రవచనాలు వల్లించే జాతిలో శూరత్వం ఉండదని బహుశా చైనా భావించి ఉండవచ్చు. అదేఅయితే నిజంగానే చైనా వారికి దేశ చరిత్రలు తెలియవనైనా అనుకోవాలి లేదా తెలిసిన మూర్ఖత్వం అనయినా అనుకోవాలి.

యేదైతేనేం: చైనా బల మదాంధకారంతో గ్రుడ్డిదై శాంతి అహింసలతో సర్వ మానవ సౌభ్రాతృత్వానికీ, సహజీవనానికీ పాటుపడుతున్న భారత్‌పై కాలు దువ్వి సవాలు చేస్తున్నది. యీ సవాలును యెదుర్కొని చైనాకు బుద్ధి చెప్పాల్సిన అవకాశం భారతదేశానికి కలగడం గర్వకారణం!

యుద్ధకాలంలో కూడా ప్రజాస్వామ్యం స్థిరంగా ఉండి సామ్రాజ్య కాంక్షను పాతాళానికి అణగద్రొక్కుతుందని భారతదేశం ప్రపంచానికి నిరూపించాల్సి ఉంది. ఇదొక యజ్ఞం.

అయితే యీ మహా యజ్ఞంలో మన పాత్ర యేమిటి? మనం వహించ వలసిన పాత్రను చక్కగా వివరించిన నవలే "నన్ను పిలిచింది"

["నన్ను పిలిచింది"
రచన: వినుకొండ నాగరాజు
పుటలు: 140
వెల: రెండు రూపాయిలు
ప్రాప్తిస్థానం: పంచశీల పబ్లికేషన్స్,
హైదరాబాదు.]

యీ నవలలోని రామినీడు, సుబ్బారావు, కుమారి యెవరో కారు. వీరిలో ప్రతి భారతీయ యువతీ యువకులూ మనకు కనిపిస్తారు. భారతీయ యువలోకానికి వీరు ప్రతిబింబాలు. వారిలో ఆవేదన, ఆవేశం పొంగులు వారుతూ ప్రవహిస్తుంది. రామినీడు పాత్రచిత్రణలో రచయితఉద్వేగం స్పష్టంగా గోచరిస్తుంది. యీ నవల వృద్ధులలో చల్లబడిన రక్తాన్ని మరొక్కసారి ఉడికెత్తింపజేస్తుందనడంలో సందేహం లేదు.

రామినీడు, సుబ్బారావులు విద్యార్థి లోకానికి ఆదర్శప్రాయులు.

జగన్నాధుని రథ చక్రాలు కదిలాయి. వాటిని ఆపేశక్తి ప్రపంచంలో దేనికీ లేదు. అన్నారావుల వంటి దేశద్రోహులు దాని క్రింద నలిగి నశించి పోవాల్సిందే. యీ నవలలోని అన్నారావువంటి హీనులను, పరదేశపు భక్తులను క్షమించరాదు. అవసరమైతే అట్టివారిని కఠినంగా శిక్షించినా దేశం సంతాపం తెలుపదు. అటువంటి వారిని ఆత్మీయులైనా, బంధువులైనా సరే ఓ కంట కనిపెట్టి ఉండడం యీ తరుణంలో యెంతో అవసరం.

ఇటువంటి దేశభక్తి ప్రబోధితాలైన రచనలు యీనాడు ఎంతో అవసరం. వృద్ధులు, యువకులు ఎల్లరూ చదవదగిన, చక్కటి నవల యిది.

ఇంకో విషయం: ఈ పుస్తక విక్రయంపై వచ్చే ఆదాయాన్ని (ఖర్చులు పోను) జాతీయ రక్షణనిధికి ఇవ్వడం, స్వాతంత్ర్య సంరక్షణా సమరంలో అసువులు బాసిన వీరులకు అంకితం ఇవ్వడం రచయిత దేశభక్తిని చాటుతున్నది. అందరూ కొని చదివి ప్రోత్సహించదగిన నవల.

# గ్రంధ సమీక్ష

—టి. యల్. ప్రకాశరావు.

# "ఆంధ్రప్రదేశ్"

## తెలుగు, ఉర్దు, హిందీ, ఇంగ్లీషు మాస పత్రిక ప్రకటన రేట్లు

దిగువ రేట్ల ననుసరించి 'ఆంధ్ర ప్రదేశ్' మాస పత్రికలో ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | నాలుగు సంచికలలో | | | ఒక సంచికలో మాత్రమే | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తిపేజీ | సగంపేజీ | పావుపేజీ | పూర్తిపేజీ | సగంపేజీ | పావుపేజీ |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| లోపలి పేజీ | 300 | 150 | 100 | 100 | 55 | 30 |
| వెనుక అట్ట పేజీ (4) | 400 | — | — | 150 | — | — |
| అట్ట 2, 3 పేజీలు | 350 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కంట్రాక్టు ప్రకటనలకు 20 శాతం రిబేటు ఇవ్వబడును.

### నిబంధనలు

1. మెకానికల్ వివరాలు : $10\frac{3}{4}'' \times 8\frac{1}{2}''$ డెమ్మీ.
2. ముందు అట్ట టైటిల్ పేజీపై ప్రకటనలు స్వీకరించబడవు.
3. పావు పేజీకి తక్కువగా ఉన్న ప్రకటనలు స్వీకరించబడవు.
4. వచ్చే సంచికలో ప్రచురించడానికి వీలుగా స్థలం వివరాలు, డబ్బుతోసహా ప్రకటన సమాచారాన్ని ప్రతినెల 8వ తేదీలోపుగా యీ కార్యాలయానికి పంపాలి. క్రాస్ చేయని డిమాండ్ డ్రాఫ్టుద్వారా గానీ, మనియార్డరు ద్వారా గానీ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, ప్రజా సంబంధముల శాఖ డైరెక్టరు, హైద్రాబాదు పేర డబ్బును పంపాలి.
5. బ్లాకుల విషయంలో అన్నివిధాలా శ్రద్ధ తీసుకోబడుతుంది. అయితే మిషనుపై బ్లాకులు పగిలిన యెడల యీ శాఖ బాధ్యత వహించదు.
6. ప్రకటన విధం, స్థలం వివరాలను ఒక సంచికలో ప్రకటించాలో (భాషను తెల్పాలి) లేక 4 సంచికలలో ప్రకటించాలో స్పష్టంగా పేర్కొనాలి.
7. డబ్బు చెల్లింపు, యితర ప్రత్యుత్తరాలను దిగువ వారితో జరుపాలి :—

డైరెక్టర్,

**సమాచార ప్రజా సంబంధాల శాఖ,**

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం,

హైదరాబాదు - 1.

# ఆంధ్రప్రదేశ్

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | ... | 1,05,858 చదరపు మైళ్లు. |
| జిల్లాలు | ... | 20 |
| తాలూకాలు | ... | 189 |
| 20 వేలు, అంతకుమించిన జనాభాగల పట్టణాలు, నగరాలు | ... | 223 |
| గ్రామాలు | ... | 28,997 |
| పూర్తి జనాభా (1961) | ... | 359.78 లక్షలు |
| జన సాంద్రత | ... | ఒక చదరపుమైలుకు 339 |
| అక్షరాస్యులు (1961) | ... | 74.90 లక్షలు |
| నికర సాగుభూమి (1959_60) | ... | 10,889,000 హెక్టర్లు |
| పశువులు (1961) | ... | 327 లక్షలు |
| నమోదైన ఫ్యాక్టరీలు (1959) | ... | 4083 |
| విద్యుదుత్పాదన (1961) | ... | 1,026.072 మిలియన్ కె. డబ్ల్యు. హెచ్. |
| విద్యుత్ సౌకర్యాలుగల పట్టణాలు, గ్రామాలు (1961_62) | ... | 4084 |
| విశ్వవిద్యాలయాలు | ... | 3 |
| కళాశాలలు (1960_61) | ... | 119 |
| ఉన్నత పాఠశాలలు (1960_61) | ... | 1224 |
| వృత్తివిద్యా పాఠశాలలు | ... | 431 |
| పంచాయతీలు (1959_60) | ... | 14,552 |
| అభివృద్ధి మండలాలు (1_4_1962 నాటికి) | ... | 378 |
| 1960_61 లో అప్పటి ధరలనుబట్టి రాష్ట్రాదాయం అంచనా | ... | రూ. 1007.51 కోట్లు |
| పార్లమెంటు సభ్యులు | ... | 61 |
| శాసన సభ సభ్యులు | ... | 301 |
| శాసన మండలి సభ్యులు | ... | 90 |

